# PHULMANI AND KARUNA.

BY MRS. MULLENS.

Second Edition, 1,000—Total Copies, 2,000.

# ఫుల్మనీ కరుణల చరిత్రము.

ఈ గ్రంథము

స్త్రీల హితముకొఱకు రచింపఁబడినది.

MADRAS:
THE CHRISTIAN VERNACULAR EDUCATION SOCIETY.
C. K. S. PRESS, VEPERY.

1881.

# PREFACE.

## పీఠిక.

ఈ గ్రంథము ముఖ్యముగా హిందుదేశపు క్రీస్తుమత స్త్రీలకు గాను చేయబడినది. ఇందులో ఆయా సంసారాంశములు, అనగా, వివాహ సంబంధములను చేసుకొనే విషయమైయు, భర్తలయెడల స్త్రీలయొక్క ప్రవర్తన విషయమైయు, పిల్లలను జ్ఞానశిక్షలో పెంచుట విషయమైయు, స్త్రీలయొక్క సామాన్యపు విధియు, ముఖ్యముగా, వారు బీదలయెడలను, శరీర స్వస్థతలేని వారియెడలను, అజ్ఞుల యెడలను నడుచుకొనవలసిన విధియు వీటినన్నిటి విషయమై క్రీస్తు మతముయొక్క ఫలపర్యంత ప్రేరణ ఇట్టిదని విశదపరచుట గ్రంథ కర్త్రియొక్క అభిప్రాయమై యున్నది. ఇదిగాక ఈ దిగువున వచ్చు ప్రమేయములను పట్టి కూడ సూచనగా తెలియచెప్పడమైనది: అనగా, బైబిలు అనెడి గ్రంథమును ఎవరిమట్టుకు వారు చదువుకొనవలసిన విధియు, ప్రభు దినమును పరిశుద్ధముగా ఆచరించుటయు, దేవాలయ మునకు వెళ్లుటయు, స్త్రీలకు విద్యలు చెప్పడమును, వీటిని గురించే కాకుండా, ఇంకను అప్పు చేసుకొనుటవల్ల వచ్చెడి కీడులును, స్త్రీలను బైటికి రానియ్యకుండా తమ యిండ్లలోనే పెట్టియుంచడమును, శరీర స్వస్థత లేనివారికి తగిన ఔషధములు ఇచ్చి వారిని జాగ్రత్తగా చూడకపోవడమును, అనేకులైన హిందుదేశపు క్రీస్తు మతస్థులలో ఇంకా బలముగా వ్యాపించియున్న శకునములు మొదలైన మూఢాచారము

లును, స్త్రీ పురుషులు పరస్పర పరిచయములేకయే కాని, లేక, భిన్న రుచులు కలిగియున్నప్పుడే కాని, వివాహములు చేసుకొన్నయెడల కలిగే కీడులును, మితమైన గృహ వ్రయమును గురించిన విధియు, శుభ్రతయు, మానసోల్లాసమును, పని పాటలలో శ్రద్ధయు మొదలు గాగల సంగతులను గురించియు ఈ గ్రంథములో తెలుపపడడమైనది.

ఈ గ్రంథములో చెప్పబడిన కథలలో కొన్ని ఈ గ్రంథకర్త్రికి అనుభవమైనవే. మరికొన్ని దేశము మీదనున్న క్రీస్తు మత బోధ కులయొక్క భార్యలవల్ల తెలుసుకొనినవి. గనుక ఈ కథలను అన్ని టినిని చేర్చి ఒక వచన గ్రంథముగా రచింపబడినది. మరియు ప్రతి సత్కార్యమునకును ముఖ్యాధారము అనుభవములోనికి తెచ్చు కొనిన నిజమైన భక్తియే అని ఈ గ్రంథమందు అంతటను కనుపరచ బడియున్నది. మరియు ఈ గ్రంథమునందు రక్షణను గురించి సువార్తలో చెప్పబడిన స్పష్టమైన పద్ధతి అనునది తరుచుగా వివరింప బడి సూచింపబడి యున్నది.



# THE HISTORY OF PHULMANI AND KARUNA.

## ఫుల్మనీ కరుణల చరిత్రము.

### ౧ అధ్యాయము.

నేను కొన్ని సంవత్సరములక్రిందటను, బంగాళ దేశములో ఒక ఏటి యొడ్డున ఉన్న ఒక పల్లెటూరిలో కాపురము చేయుచుంటిని. ఆ ఊరి పేరు ఇక్కడను చెప్పనక్కరలేదు. ఆ యూరికి దాదాపు అర క్రోసెడు దూరములో, క్రీస్తు మతస్థులైన నల్లవారి పల్లె యొకటి యున్నది. ఈ పల్లెలో కాపురము చేసే నా యన్నదమ్ములతోను, నా యక్క చెల్లెండ్రతోను, నేను వాడుకగా చేయుచు వచ్చిన ఇష్టా గోష్ఠియు, మత సంబంధమైన సంభాషణయు నేటివరకును నాకు జ్ఞాపకమందున్నవి. అందును గురించి నా పరలోకపు తండ్రిని స్తుతించుచున్నాను. ఎందుకనిన, వారి ప్రవర్తనము చూడడము వల్లను, వారి సంభాషణమును వినడమువల్లను, నా విశ్వాసము ప్రబలము కావడమేకాకుండా, ఇందువల్ల క్రీస్తుయొక్క శిష్యులకు అవశ్యమైన విధులిట్టివని నేను మునుపటికంటే ఎక్కువగా నేర్చుకొంటిని.

దేవుడు, తన సభికులైనవారు పురాతన భక్తులయొక్క దృష్టాంతమును తమ ఎదుటనుంచుకొని, వారి వలెనే తాము పరిశుద్ధులుగా నుండుటకు ప్రయత్నపడేలాగున, వారికి ఆ భక్తుల చరిత్రలను వ్రాసి పెట్టి, వాటివల్ల ముఖ్యముగా బోధ చేయుచున్నట్టు, మనము బైబిలు అనే గ్రంథమును చదివి తెలుసుకొనవచ్చును. ఇది నాకు తెలిసినది గనుక, ఇప్పుడు నేను ఈ పైని ఉదాహరించిన క్రీస్తు మతస్థులను గురించి, ఒక చరిత్ర మార్గముగా, కొంచెము వివరించి

వ్రాస్తే, బంగాళములోనున్న నా అక్క చెల్లెండ్రు దానిని చదువుకొని, దేవుని కృపవల్ల లాభమును సంతోషమును కలుగ చేసుకొందురనే భావముచేతను, ఈ చిన్న పుస్తకమును వ్రాయుచున్నాను.

ఇంతకు మునుపు చెప్పిన ఊరిలో, కుటుంబ సహితముగా నేను ప్రవేశించి యున్న కొంత కాలమునకు, అక్కడ నివసించి యున్న క్రీస్తు మత బోధకుని దర్శనము చేయ వెళ్లినాను. ఆ యా సంగతులను గురించి కొంత సంభాషణము జరిగిన తరువాత, నేను ఆయనతో—
"అయ్యా! ఈ యూరికి నేను క్రొత్తగా వచ్చి యున్నాను; ఇక్కడ
'నాకు పరిచితులు ఎవరును లేరు గనుక, మనవారిలో మతాభిమా
'నము గల దొరసానులును దొరలును ఇక్కడ ఎవరో, ఆ సంగతి
'మీకు తోచిన ప్రకారము, దయచేసి నాకు చెప్పుడీ; అటువంటి
'వారితోనే నేను స్నేహము చేయ కోరుదును; ఇతరులతో నేను
'మిక్కిలి సహవాసము చేయ కోరను" అని చెప్పగా, ఆ బోధకుడు—
"అయ్యో! ఇక్కడనున్న ఇంగ్లీషువారిలో ఇద్దరో ముగ్గురో దేవునికి
'భయపడి, ఆయన ఆజ్ఞాప్రకారము నడుచుకొనుచున్నారు, కాని
'తక్కిన వారందరును లోక వ్యవహారములలోను, నానా విధములైన
'వేడుకలలోను మునిగియున్నారు. అయితే ఈ పొరుగుననుండే
'క్రీస్తు మతస్థులైన బంగాళీల గ్రామములో, మీరడిగిన కొందరు
'భక్తులు కలరు; వారు క్రీస్తు సభాభూషణులని వారి విషయమై
'నిజముగా చెప్పగలను" అని ప్రత్యుత్తరమిచ్చెను. నేను ఈ సంగతిని విని, ఆ జనులను గురించి చాలా మట్టుకు విచారణచేసి, సమయము దొరికినట్టుగానే వెళ్లి, వారితో స్నేహము చేసుకొందునని నిశ్చయించుకొంటిని. ఆ మరుదినము, నా పెనిమిటి ఇల్లు విడిచి, ఒక బందిపోటు దొంగల గుంపును గురించి విచారణ చేయుటకు, తన ఖండపు గ్రామాదులకు వెళ్ల వలసి వచ్చి వెళ్లినందున, ఆ సాయంకాలమందు, నేను ఒంటరిగా నుండలేక, ఆ క్రీస్తు మతపు పల్లెలోనికి వెళ్లి, అక్కడి జనుల దర్శనము చేసుకొని, వారితో ముచ్చటించ వలె

నని నిశ్చయించుకొంటిని. ఆ పల్లె నా యింటికి దాదాపు అరక్రోసెడు దూరములో నుండెను; అయితే ఆ సాయంకాలము మిక్కిలి తేటగా నుండి, చల్లని గాలి వేయుచుండెను గనుక, నేను బండెక్కి వెళ్లకుండా, ఒక బంట్రౌతును వెంటబెట్టుకొని, కాలినడకనే బయిలుదేరినాను.

నేను ఆ పల్లె ప్రవేశించడముతోనే, మొదట నాలుగు అయిదు చాప యిండ్లను చూస్తిని. వారి ఇంటి పెరడులు బహు చీదరగా నుండెను. వాటి ముందర పిల్లలు దినమొలలతోనే రేగడి మంటితోను ఇసుకతోను బొమ్మరిండ్లు కట్టుకొని, ఆడుకొనుచుండిరి. ఆ యిండ్లు క్రీస్తు మతస్థుల కాపురపుటిండ్లయినట్టు, నాకు ఒక చిహ్న అయిన కనుపడలేదు. అవి హిందువుల ఇండ్లవలె అంత శుభ్రముగాను అంత చక్కగాను ఉండలేదు, గనుక వాటిలో చొరకనే దాటిపోతిని. అయితే నేను కొంత దూరము వెళ్లిన తరువాత, పరిశుభ్రమైన చక్కని పెంకుటిల్లు కఒటి కనుపడినందున, చూచి, చాలా సంతోషించినాను. మరియు అందులోనున్న వారి దర్శనము కలుగచేసుకొనుటకు నాకొక మంచి వీలు దొరికెను. ఏమనిన, ఆ యింటియెదుట ఒక చెట్టు కొమ్మకు వ్రేలాడ గట్టిన ఒక ఇనుప కడ్డీమీపను ఒక చిలుక గొలుసుతో కట్టబడి యుండడమును, దానిని కాకులు ముక్కులతో పొడిచి మిక్కిలి బాధ పెట్టుచుండడమును చూచితిని. దీనిని నేను చూచుచునే, ఆ చిలుకను దాని కడ్డీనిని పట్టుకొని, ఆ యింటి పెరటిలోనికి వెళ్లినాను. అంతట సగము ఈడు గలిగిన యొకస్త్రీ నా రాక చప్పుడు విని, బయిటికి వచ్చెను. దాని కొప్పు చక్కగా కట్టియుండెను. దాని చీర పరిశుభ్రముగా నుండెను. అప్పుడు ఆమెను నేను చూచి, "ఇది నీ చిలుకా?" అని అడిగి, "కాకులు దీనిని నిండా బాధపెట్టుచుండెను గనుక, దీనిని ఇంటిలోనికి తెచ్చితిని" అని చెప్పితిని. అప్పుడు ఆ స్త్రీ, "అమ్మా!

'మీరు మిక్కిలి దయగలవారు; ఇది నా చిలుకే. నా కుమారుడు 'మరచి దీనిని బయటనే ఉంచినాడు" అని ప్రత్యుత్తరమిచ్చెను. అప్పుడు ఆమె తన చేతితో ఆ పక్షియొక్క యీకెలను సవరణగా నివిరెను. అంతట ఆ చిలుక ఆమెను తన యజమానురాలినిగా బాగుగా తెలుసుకొనినట్టు నేను కనుగొంటిని; అది ఆమెను పొడ వక, ఆమె బట్టలో ఒదుగుకొన కోరెను.

అప్పుడు ఆ స్త్రీ నన్ను చూచి, "అమ్మా! మీరు మా పల్లెలో ఏమి 'చూడ వచ్చినారు? మా బోధకుని భార్య తప్ప, ఏ దొరసాని అయి 'నను ఎప్పుడును ఇక్కడికి ఎన్నడు రాలేదు" అని చెప్పేవరకు, నేను—"అయ్యో! బంగాళీ క్రైస్తవుల బాగు కొరకు తెల్లవారు ప్రయ 'త్న పడుటనేది అవశ్యమైన విధి అయ్యున్నది. నేను క్రొత్తగా 'వచ్చిన న్యాయాధిపతికి భార్యను. క్రిందటి మాసములో మామిడి 'తోటలోనున్న రెండంతస్తులు గల పెద్ద మేడను అద్దెకు పుచ్చుకొని 'నది నేనే. నిన్న ఈ క్రీస్తు మతపు పల్లెను గురించి మీ బోధకుని 'వల్ల విని, నేడు మిమ్ములను చూడ వచ్చినాను" అని ప్రత్యుత్తర మియ్యగా, ఆమె "మీరు బండియెక్కి వచ్చినారు కాబోలును" అని అడిగెను. అందుకు నేను "ఆ చొప్పున రాలేదు; ఈ చల్లని ఏటి 'గాలిని అనుభవించవలెనని ఒక బంట్రోతును వెంటబెట్టుకొని, కాలి 'నడకనే వస్తిని; అయితే మీ పల్లె ఇంత దూరముగా ఉన్నదని నాకు 'మొదట తెలియక పోయినందున, ఇంత దూరము కాలినడకను రావ 'డమువల్ల చాలా అలసటబడియున్నాను. గనుక, నా కొక పీట 'వెదకి తెచ్చి యిస్తే, కొంతసేపు నేను కూర్చుండి అలసట తీర్చుకొం 'దును" అని చెప్పగానే, ఆమె త్వరగా ఇంటిలోకి వెళ్లి, ఒక పాత కురిచీని బయిటికి తెచ్చినది. ఆ కురిచీ గొప్ప అధికారము గల వారి కొరకే ఉంచబడినట్టు ఊహించుచున్నాను. ఎందుకనిన, దాని మీదను కొంత దుమ్ము ఉండెను. అయితే ఒక క్షణములో ఆమె

తన కోక చెంగుతో దాని మీదనున్న దుమ్మంతయు దులిపివేసి, చాలా మర్యాదతో నన్ను చూచి, "అమ్మా! దయచేసి కూర్చుందురా? 'ఇంతకు మునుపే మీకు కురిచీని ఇచ్చేదానననే, అయితే న్యాయాధి 'పతి భార్యలరైన మీరు ఇంత పేదయింటిలో కూర్చుండరు గదా 'అని ఊహించుకొని, ఇంతకు పూర్వము ఏమియు చెప్పుటకు తెగిం 'చకుండా నుంటిని" అని చెప్పెను.

అప్పుడు నేను ఆ కురిచీని మొగసాలకు తీసుకొని వెళ్లి కూర్చుంటిని. వెంటనే ఆ స్త్రీయొక్క పసి బిడ్డ ఇంటిలో నిద్రలేచి, ఏడుచుచుండెను గనుక, ఆమె ఆ పిల్లవానిని తీసుకొని వచ్చుటకు వెళ్లినప్పుడు, నేను కొంత సేపుటికి ఒంటరిగానుండి, పెరటిలోనున్న దానిని చూచుటకు తగిన అవకాశము కలదాననైతిని. పెరటిచుట్టూ క్రొత్త చాపలతోను క్రొత్త బొంగులతోను ఒక దడి కట్టి యుండెను. దాని మీదను ఒక సొగసైన కాయ తీగె ప్రాక పెట్టబడి యుండెను. పెరటిలో ఒక పక్కగా, పశువుల సాలయొకటి కనుపడెను. అందులో ఒక ఆవును దూడయును నెమ్మదిగా నెమరు వేయుచుండెను. ఆ పశువుల సాలయొక్క కప్పు మీదను చాలా ముదిరిన కాయలుండెను. పెరటియొక్క రెండవ వైపున, వంటయిల్లు ఒకటి యుండెను. దాని తలుపు తీసియుండినందున, లోపల బాగుగా తోమియున్న మూడు నాలుగు తపెలలును చెంబులును చూచితిని; కొన్ని శుభ్రములైన రాతి చిప్పలు కూడ దొంతరగా ఉంచబడి యుండెను. పెరడు బహు శుభ్రముగా నుండెను. దాదాపుగా ప్రతి యింటను సాధారణముగా పెంటపోగున్నట్లు, నేను అందులో పెంటపోగును ఎంతమాత్రమును చూడలేదు. అంతయు సమానముగా శుభ్రము చేయబడి యుండెను. మొగసాల యెదుట ఇంటి వాచూరుక్రింద పది పండ్రెండు మొక్కలు కుదుళ్లలో ఎదుగడము చూచితిని. వాటిలో మూడు నాలుగు ఔషధపు మొక్కలును, తక్కినవి బంతిమొ

క్కలును, తులసిమొక్కలును, గంధరాజము మొదలైనవి అయ్యుం డెను. అయితే అందులో ముఖ్యముగా మొగ్గలతోను పుష్పముల తోను కప్పుకొనియున్న ఒక మిక్కిలి చక్కని చీనాదేశపు గులాబీ మొక్కయుండెను.

ఇది అంతయు నేను చూచే యీలోగా, ఆ యింటి యజమా నురాలు తిరిగి బయిటికి వచ్చి, నా కురిచీ దగ్గర నిలుచుండెను. అప్పుడు నేను ఆమెతో "కూర్చుండుమని" చెప్పినంతలో, ఆమె మండిగము మీద కూర్చుండి, తన పిల్లకు పాలియ్యసాగెను, ఆ పిల్లవాడు, నాకు చూడగా, దాదాపు ఒక సంవత్సరము ఈడుగల చక్కని వాడై కనుపించెను. ఆ చిన్నవానికి కాకను పుట్టించే యొక అంగీ తొడగబడెను. వాని తల్లికూడ ఒక రవిక తొడుగు కొనియుండెను. క్రైస్తవస్త్రీలు అందరును ఇటువంటి బట్టలు తొ డుగుకొంటే, బాగుగా నుండునని నాకు తోచుచున్నది. ఒకొక రవికకు రెండేసి అణాలు విలువగల గుడ్డ పట్టును. ఇది యెంతో విలువలోది కాదు. మరియు వారు కొంచెము కుట్టు నేర్చుకొంటే, ఇంటిదగ్గర సులభముగా దానిని కుట్టుకొనవచ్చును.

అయితే అది అట్లు ఉండనిమ్ము. ఆ స్త్రీ కూర్చుండిన తరువాత, ఆమెతో నేను మాటలాడ నారంభించి, ఆమె పేరును, ఆమె పెని మిటి ఉద్యోగమును, ఆమెకు ఎంతమంది పిల్లలో ఆ సంగతినిని అడి గినాను. అందుకు ఆమె, తన పెనిమిటి, ఉత్తరములు తీసుకొని వెళ్లే నిమిత్తమును, ఒక పల్లెకూటమునకు అయ్యే వ్రయమునకుగాను దొరలు ప్రతి నెలకును ఇచ్చే చందా పయికము అడిగి తెచ్చే నిమి త్తమును, బోధకునిచేత నియమింప బడిన భృత్యుడై యున్నాడని యు; ఒకానొకప్పుడు కలకత్తాకు వెళ్లి మిశ్శనా నిమిత్తము ఆయా దినుసులు కొనుకొని రావడమునకు కూడ అయ్యుండి యున్నాడని

యు; తన పేరు ఫుల్మనీ అనియు; తనకు ఇద్దరు కుమారులును ఇద్దరు కుమార్తెలును అనియు చెప్పెను.

ఫుల్మనీ ఇంక అధికముగా చెప్పేదే కాని, ఆ సమయములోనే మరి యొక స్త్రీ వెలపటి తలుపు గట్టిగా తోసుకొని, లోపలికి వచ్చెను. దాని బట్టలు నిండ మైలగా నుండెను. దాని తల వెంట్రుకలు కట్టకుండా, తల అంతను విరబోసుకొని వ్రేలాడుచుండెను. అయితే ఆబిడ నావంక కొంతసేపు మర్యాదలేకుండ తేరి చూచి, ఆటుతరువాత ఫుల్మనీ వైపునకు తిరిగి, ఆమె చెవిలో, "ఇది ఎవరు!" అని అడిగెను. అందుకు ఫుల్మనీ "క్రొత్తగా వచ్చిన న్యాయాధిపతి భార్య" అని చెప్పెను. ఇది వినడముతోనే, అది కొంచెముగా భయపడి, అతి వినయముతో నాకు సలాము పెట్టినది. అప్పుడు అది ఫుల్మనీని చూచి, మెల్లిమెల్లిగా, "ఫుల్మనీ! నీ అదృష్టము మంచిది. 'తెల్లవారందరును నీ మీద అనుగ్రహము కలవారై యున్నారు. 'అయితే నన్ను దయగా చూచేవారు ఎవరును లేరు" అని చెప్పెను. అందుకు ఫుల్మనీ ఏమియు ప్రత్యుత్తరము ఇయ్యక, "ఓ కరుణా! ఆ 'సంగతి యేలాగుననుంటేనేమి, నీవు ఇక్కడికి ఇంత తొందరగా ఎం 'దుకు వచ్చినావు!" అని అడిగెను. అందుకు కరుణ "నాకు వంట 'లోనికి కొంతకారము నిమిత్తము నిన్ను అడుగుటకు అక్కరపట్టి 'వచ్చినాను. ఇంటిలో ఒక దమ్మిడి గవ్వలైన లేవు. అయితే నా 'కుమారుడు కొన్ని చేపలను పట్టి ఇంటికి తెచ్చినాడు. ఇందులో 'కొంత ఇప్పుడు ఒక పూటకు నేను వండుకొన వలెను. నా పెని 'మిటిని నీవు ఎరుగుదువు గదా! అతడు వంటకము నిమిత్తము నాకు 'ఎంతమాత్రమును సొమ్ము ఇయ్యక పోవడమే కాకుండా, ఆయనకు 'తినడమునకు నావల్ల ఏమియు దొరకని పక్షమందు, ఆ రాత్రి అంత 'యు నన్ను తిట్టుచుండును" అని పలికెను.

ఫుల్మనీ యిచ్చిన ప్రత్యుత్తరము, "ఇది మిక్కిలి చెడ్డపనియే;
'అయితే నీకు దమ్మిడీ గవ్వలైన లేవు అనేది ఏలాగున ఉండవచ్చును?
'ఈ ప్రొద్దున ఉపదేశికుడైన రామనాధుడు నిన్ను పిలిచి, నేడు
'ప్రసంగించుటకు గ్రామము లోనికి వెళ్లుచున్నాననియు, నీవు దగ్గ
'త్తగానున్న నా భార్యవద్ద కనుపెట్టుకొనియుండి, ఆమెకు కొం
'చెము సగ్గు బియ్యము మొదలైనవాటిని వండిపెట్టితే, అందుకుగాను
'నీకు ఆరు పైసలు ఇత్తును అనియు చెప్పగా నేను వింటిని" అనెను.
అందుకు కరుణ నవ్వుచు ప్రత్యుత్తరము ఇచ్చినదేమనిన, "ఆయన
'నన్ను పిలిచిన మాట నిజమే, కాని నేను వెళ్లలేదు. పారిపోయిన
'మధువుయొక్క భార్యను గురించిన కథనంత వినడముతోనే కాలము
'వెళ్లబారి పోయినది. అటుతరువాత, ఆ రామనాధ బాబు ప్యారీని
'తన భార్యయొద్ద ఉంచి, వెళ్లిపోయెను. మధువు భార్య కాళీపుర
'ములో వంట చెరుకును కూర్చుకొని అమ్ముచుండగా దొరికినది.
'మునుపు దాని దగ్గరనుండిన నగలలో ఒకటైన లేకపోయెను. ఆ
'సంగతిని గురించి అది చెప్పినదేమనిన, ఒక ముసలిది మొదట నా
'యెడల చాలా దయగా నుండి, తరువాత తన యింటిలో నన్నుంచు
'కొని, అయిదు ఆరు దినములు అన్నము పెట్టినది. అటుతరువాత
'ఒక రాత్రి నేను గాఢ నిద్రలో నున్నప్పుడు, ఎవడో ఒకడు వచ్చి,
'నా నగలన్నియును తీసుకొని వెళ్లినాడు. నేను ఉదయమందు
'నిద్రలేచి చూచుకొంటే, నగలు లేవు. అప్పుడు నేను ఏడ్చి, ఆ
'ముసలిదానితో, నీవే నా నగలన్నియు తీసుకొని యుందువని అంటే,
'ఆ ముసలిది నన్ను తిట్టి, యింటిలోనుంచి బయిలు వెళ్ల గొట్టినది,
'అప్పుడు అది, నన్ను ఆకలిచేతను చావుమన్నావా! వెళ్లి నీ మీద
'వ్యాజ్యము వేతునని అంటే, ఆ ముసలిది ఈ మాట వినుచునే,
'నీకు సాక్షులును లేరు, సొమ్మును లేదు, నీవు ఏలాగున వ్యాజ్యము
'వేయ గలవని అడిగి, యిదిగో పుచ్చుకొనుము, నీ కొరకై జాలిపడి

'రెండు రూపాయీలు ఇచ్చుచున్నాను; అయితే ఈ సంగతిని గురించి
'యేమైన మరియొకరితో చెప్పితివా, నీ మీదనే నేను వ్యాజ్యము
'వేశుదు సుమీ, అని చెప్పినది" అనెను. కరుణ ఇంకా అనినది యేమం-
'టే, "ఇదియంతా రాణి చెప్పిన కథయయితే అవునుగాని, ఇదియంతా
'అబద్ధమని తోచుచున్నది. మధువుకూడా చెప్పుచున్నది యేమంటే,
'అది దాని నగలు తిరిగి తీసుకొని రానిపక్షమందు, దానిని దొంగను-
'గా కట్టి, చెరసాలను వేయింతునని చెప్పుచున్నాడు" అనెను. అప్పుడు
ఫుల్లనీ చెప్పినదేమంటే, "మధువు ఈ పని యెన్నటికిని చేయచాలడు.
'వివాహ కాలమునందు వాడు ఈ నగలను రాణికి కట్నముక్రింద
'బొత్తుగా ఇచ్చెను కాదా? ఇదిగాక, రాణియొక్క నగలన్నియు
'మధువు ఇచ్చినవి కావు. ఇందులో కొన్ని నగలు రాణియొక్క తల్లి
'చచ్చినప్పుడు, ఆమె ఈ రాణికి ఇచ్చినవే. కాబట్టి, నా అభిప్రా-
'యము ఏమంటే, రాణి నిజమే పలికినది. నగలు తీసుకోవలెనన్న
'ఆశచేతనే ఆ ముసలిది దానిని దగ్గరకు తీసినది; లేకపోతే, ఒక
'క్రీస్తుమత స్త్రీని ఇంటిలో ప్రవేశపెట్టుకొని, దానికి అన్నము మొద-
'లైనవి పెట్టేపాటి దయాళు లెవరున్నారు! అయితే రాణి పారిపోవ-
'డమనేది మిక్కిలి అవివేకమైన పని. ఇది సత్యమేకాని, ఈ దోష-
'మంత దానిది కాదు. దాని పెనిమిటియు అత్తగారును దానిని ఎంత
'మాత్రమును చక్కగా చూడకపోవడమనేది నాకు బాగుగా తెలుసు-
'ను" అనెను. అందుకు కరుణ ప్రత్యుత్తరము ఇచ్చినదేమంటే, "అవును,
'నీవు రాణి పక్షమే వహింతువనే మాట యెవరికి తెలియదు! ఎందు-
'కంటే, అది బడిపిల్లలలో ఒకతె అయ్యుండెను. మరియు అది మీ
'సుందరికి స్నేహితురాలు; అయితే ఫుల్లనీ! నేను నీతో నిజముగా
'చెప్పేది యేమంటే, ఇకను ఎవరును తమ తమ కుమారులకు బడిపిల్ల-
'లను పుచ్చుకొని వివాహములు చేయనే చేయరు. నాటి నాటికిని
'ఈ బడిపిల్లలు అల్లరి పడిపోవుచున్నారు" అనెను.

2

అందుకు ఫుల్లనీ చెప్పినదేమంటే, "ఇదంత ఉత్త ఊసు. ఈ ఆడ
‘పిల్లలకందరికిని పదునాలుగు సంవత్సరముల ఈడు రాకమునుపే,
‘వివాహములు అగుచున్నవి. ఈలాగున కావడమనేది వీరికి పెనిమి-
‘ట్లను సంపాదించ వలెనని మా బోధకునియొక్క ప్రయత్నమువల్ల
‘కాదు గాని, జనులు తమంతట తామే వచ్చి, పిల్లలను వివాహముల
‘నిమిత్తము అడుగుచున్నారు గనుక, బడిపిల్లలు ఈ పల్లెలోనుండే
‘పరువుగల ప్రతి కుటుంబములోను వివాహము పొందుచున్నారు.
‘మన రామనాథ బాబుయొక్క భార్యను, కుమాల్ సర్కారుయొక్క
‘భార్యను, శోషి భూషణ మక్కర్జ్యాయొక్క ఇద్దరు కోడండ్రను
‘చూడు. వీరందరును బడిపిల్లలే. వీరిలో నొకరిమీదనైన ఎవ్వరును
‘ఏమియు చెప్పలేకుండా ఉన్నారు. నీవు రాణి సంగతిని గురించి
‘మాటలాడే పక్షమందు, అందును గురించియు నీకు నేను కొంచెము
‘చెప్పగలను. దొరగారు ఆమె వివాహమునకు మొదటనుంచి ఒప్ప-
‘కుండా ఉండెను. మేమును దానిని అనేక విధములచేత ఆక్షేపించి-
‘నాము. అయితే రాణి తల్లి బహు బుద్ధిహీనురాలై యుండి, కొన్ని
‘బంగారపు నగలను చూడడముతోనే, భ్రమ పుట్టినందువల్ల, మధువు
‘ఆమె కంటికి నిర్దోషిగా కనుపడెను. మధువు కేవలమును తెలివి లేని
‘వాడును, అక్షరములనైన ఎరుగనివాడును అనే సంగతి నీకే బాగు-
‘గా తెలుసును. రాణి అయితే పిల్లలందరిలోను చదువులోనేమి,
‘వ్రాతలోనేమి, మిక్కిలి నేర్పరి అయ్యుండెను. అయితే ఇప్పుడు
‘దానికి గృహకృత్యము తప్ప మరియేమి పని లేదు. ఇటువంటి విరుద్ధ
‘గుణములు గల ఇద్దరు మనుష్యులకు అయ్యే వివాహమువల్ల ఏమి
‘లాభము రాగలదు? అయితే అది ఏలాగున నుంటేనేమి. ఇతరుల
‘సంగతులలో సంబంధము కలుగచేసుకోవడము మనపని కాదు. రా,
‘నీవు నిండా అక్కర కలిగి యున్నావు గనుక, నీకు కొంచెము కార-
‘మును కొంత చమురును వంట చేసుకోవడమునకు ఇత్తును" అనెను.

ఫుల్లనీ వెంట ఇంటిలోనికి కరుణకూడ వెళ్లుచున్న సమయములో, నేను ఇందాకను చెప్పిన చీనాదేశపు గులాబీచెట్టు, ఆ కరుణయొక్క కోకకు పెద్ద చినుగు ఉన్నందువల్ల, అందులో చిక్కుకొనినది. ఈ సంగతిని అది తెలుసుకొనక, తన కోకను గట్టిగా లాగికొన్నందున, ఆ చెట్టు వేరుతోకూడానే పెల్లగిలి వచ్చినది. అంతట అది తనవల్ల సంభవించిన ఆ చెట్టుయొక్క నష్టిని చూచి, మిక్కిలి దుఃఖాక్రాంతురాలై, క్రింద కూర్చుండి, ఆ పువ్వులను అన్నిటిని ఒక్కొక్క రేకుచొప్పున ఏర నారంభించెను. అయితే ఫుల్లనీ ఈ జరిగినది ఎంతమాత్రమును తెలియక, అప్పుడే చమురుబుడ్డిని చేతితో పట్టుకొని బైటికి వచ్చినది. అంతట ఆమె, తాను జాగ్రత్తగా కాపాడుకొనుచు వచ్చిన మొక్కకు సంభవించిన నష్టిని చూచి, మిక్కిలి దుఃఖపడి, "అయ్యో! కరుణా, ఏమిచేసినావు? నా చక్కని మొక్క పోయెనే," అని పలుకసాగెను. అందుకు కరుణ, "ఫుల్లనీ, నన్ను క్షమించు, నేను ‘ఈ పని చేసినందుకు మిక్కిలీ దుఃఖించుచున్నాను. నీవు ఈ మొక్కను ‘నీ సుందరికి ప్రతినిధిగా చూచుకొనుచు, దానిని చాలా సంరక్షణ ‘చేయుచున్నావని నేను ఎరుగుదును" అని చెప్పెను.

ఇది వినడముతోనే, ఫుల్లనీయొక్క కోపము చల్లారెను. అటుతరువాత ఆమె నవ్వుమొగము పెట్టుకొని చెప్పినదేమంటే, "ఇందుకు ‘లోపము ఏమియు లేదు. నీవు చేసిన పని బైబిలులో ఒక మిక్కిలీ ‘ఆదరణకరమైన వచనమును జ్ఞాపకమునకు తెచ్చుచున్నది. హా! కరుణా, ‘ఈ మాటయొక్క విలువ నీవు మనస్ఫూర్తిగా తెలుసుకొంటే, నీ ‘దుఃఖము ఇంతగా నుండకపోవును. ఆ వచనము ఏదంటే, "గడ్డి వాడి ‘పోవును, పుష్పము క్షీణించును, అయితే మన దేవుని వాక్యము ఎన్న‘టికిన్ని నిలిచియుండును" అనెను. (యెషయా 40: 8.) కరుణ నిట్టూర్పు విడిచి, అందుకు మారుమాట ఒకటి అయిన పలుకలేదు. అయితే నేను దాని ముఖమును నిదానించి చూచినంతలో, ఫుల్లనీకి ఉన్న

గుణము తనకంటే బాగుగా నుండును గదా, అని అది అనుకొనినట్లు
నాకు తోచినది. చివరకు అది తన ప్రియ స్నేహితురాలైన ఫుల్లనీ
దగ్గర సెలవు తీసుకొని, నాకు సలాముపెట్టి, నూనెబుడ్డి చేతపుచ్చు-
కొని వెళ్లిపోయెను.

ఈ వెనుకటి సంభాషణము అంతయు నేను విని, ఫుల్లనీ మిక్కిలి
మతాభిమాని అనియు, వినయమైన మనస్సు కలదనియు నిశ్చయించి,
ఆమెతో తిరిగి కూర్చుండుమని చెప్పి, "నీ వృత్తాంతమునంత నాకు
'తెలియచేయుము" అని ఆమెను బతిమాలినాను. అందుకు ఆమె
చెప్పినదేమంటే, "అమ్మా! నన్ను గురించి నేను ఇంక ఏమి చెప్పకొం-
'దును. ఇదివరకే మీకు అంత తెలియచేసినాను" అనెను. అప్పుడు
నేను, "ఇంద్రాక్షను నీవు కరుణతో మాటలాడుచుండినప్పుడు, అది
'నీతో అనుచువచ్చిన సుందరి అనేది ఎవరు? ఈ సంగతి నాకు
'చెప్పుము. ఎందుకంటే, అది నీకు ఇచ్చిన గులాబీ చెట్టును ఇంత
'ప్రేమగా చూచుకొనుచున్నావు గనుక, అది నీకు మిక్కిలీ కావల-
'సినది అయినట్టు నాకు తోచుచున్నది" అని చెప్పితిని.

అందుకు ఫుల్లనీ ఇట్లనెను, "తమరు బాగుగానే నిశ్చయించినారు.
'సుందరి అనేది నా పెద్ద కుమార్తె. దానికి దాదాపు పదియేను సంవ-
'త్సరముల ఈడున్నది. రెండు సంవత్సరముల క్రిందట దాని తండ్రి
'ఆరు నెలలదాకా నిండా సంకటపడి యుండెను గనుక, అప్పటిలో
'మాకు మిక్కిలీ ఇబ్బందిగా నుండెను. ఆ ఆరు నెలలును అన్నము
'కూరకాయలుకంటె ఒకనాడైన మాకు మంచి తిండి దొరకలేదని
'నిజముగా చెప్పగలను. అయినప్పటికిని, నేను ఒక దమ్మిడీ అయిన
'అప్పు ఎప్పుడును చేయలేదు. ఎందుకంటే, పాపమునకు ఎంతో, అప్పు-
'నకును అంత భయపడుచున్నాను. తరువాత మేము అన్నమునకుకూడ
'మిక్కిలి ఇబ్బంది పడితిమి. అయితే ఒకనాడు ప్రవక్తయైన ఏలీ-
'యాయొక్క కథను చదువగా, కరవు సమయమునందు దేవుడు తాను

పోషించే జనులను ఆకలిచేత చచ్చిపోనియ్యక, వారి ప్రాణములను సంరక్షణ చేయుటకు, వారికొరకు ఆహారము తెచ్చేనిమిత్తము ఆకాశమున ఎగిరే పక్షులకు ఆజ్ఞాపించెనని కనుగొంటిని. (1 రాజులు. 17: 1—7.) ఇది చదువడమువల్ల మా యిరుకు సమయములో మాకు గొప్ప ఆదరణ కలిగెను" అనెను.

అప్పుడు నేను, "ఫుల్మనీ! మీ దినాహారము మీకు ఏలాగున దొరికినది," అని అడిగితిని. అందుకు ఫుల్మనీ ఇట్లనెను; "ఇంగ్లీషు బడియొక్క పెద్ద ఉపాధ్యాయులైన మహేంద్రబాబు కుటుంబము కొరకు పాకము చేసేవారు ఒకరు కావలసివచ్చెను. అంతట నేను అప్పులపాలు కావడముకంటె, అన్యుని కొలువడమునేది యుత్తమమని యెంచి, అక్కడికి వెళ్లి, ఆ ఉద్యోగమును పుచ్చుకొన్నాను. ప్రతి దినమును ప్రొద్దుటివేళ నేను పనికి వెళ్లవలసి వచ్చెను గాని, ప్రతి సాయంకాలము ఇంటికి రావడమునకు నాకు సెలవు దొరికినది. ఆ కాలములో సుందరి బడిలో చదువుకొనుచుండెను. అయితే ఆ యిరుకు సమయములో దానిని ఇంటికి తీసుకొని రావలసివచ్చెను. ఎందుకంటే, నేను పనికి వెళ్లినప్పుడు, దాని తండ్రిదగ్గర అది కనిపెట్టుకొని యుండుటకు అవశ్యమై యుండెను. ఆ బాబుదగ్గర నాకు నెలకు మూడు రూపాయీలు దొరికినవి. ఇంతేకాకుండా, ఆవుపాలు అమ్మడమువల్ల, ఆవు మేతవిలువ పోగా, నెలకు రెండు రూపాయీల దాకను సంపాదించితిమి. ఈ చొప్పున ఆరు నెలలదాకను ముదుక బియ్యపు అన్నము తినుచు, ముదుకగుడ్డలు కట్టుకొనుచు, కాలము గడిపితిమి. సుందరియొక్క తండ్రి సంకట పడకముందు, పదియారు రూపాయీలు కూడబెట్టి యుంచితిమి. అందులో అయిదు రూపాయీలు పెట్టి పసులసాల కట్టుకొంటిమి. పదకొండు రూపాయీలకు ఒక ఆవును దూడనును కొనుకొంటిమి. మాకు ఇంత శ్రమ సంభవించునని పూర్వమే తెలిసి యుంటిమేని, ఈ సొమ్ము వ్రయము చేయ-

'కుండా ఉంచుకొందుమని తోచుచున్నది. అయినప్పటికిని, ఒక విధ-
'ముచేతను విచారిస్తే, మేము అలాగున చేయడమనేది మేలుగానే
'కనుపడుచున్నది. ఎందుకంటే, ఆ దినము మొదలుకొని పాలు అమ్మ-
'కమువల్ల కొద్ది గొప్ప లాభము నిత్యమును కలుగుచునే ఉన్నది"
అనెను. ఫుల్మనీ ఇంకా చెప్పినదేమంటే, "ఆరునెలలు అయిన తరు-
'వాతను, దేవుని కృపవల్ల సుందరియొక్క తండ్రి శరీరము కొంతమ-
'ట్టుకు కుదిరినది. గనుక ఆయన తన పనిలోనికి తిరిగి వెళ్లినాడు.
'అయితే అప్పటిలో గ్రామ వైద్యునకు మేము సొమ్ము ఇయ్యవలసి
'వచ్చెను. అతడు ఆరునెలల పర్యంతము మా యింటికి వచ్చుచు పోవు-
'చును ఉన్నందుకు, ఇరువది నాలుగు రూపాయీలకంటె తక్కువ
'పుచ్చుకోవాలని చెప్పెను. ఈ సంగతిని మేము వినగానే, మిక్కిలీ
'తొందర పడితిమి. ఎందుకంటే, అప్పటిలో అతనికి అయిదు రూ-
'పాయీలు అయిన ఇచ్చుటకు మాకు శక్తి లేకపోయినది. అయితే,
'దేవుడు తన సేవకులు ఇబ్బందిలో ఉన్నప్పుడెల్ల, వారిని చూచి,
'రక్షించుచునున్నాడు. దీని నిజము మాకు తరువాత అనుభవములోనికి
'వచ్చినది. ఆ సమయములోనే, మా బోధకునియొక్క సహోదరి
'తన సహోదరుని ఇంటిలో కొన్ని దినములు ఉండుటకు వచ్చెను.
'ఆమె మహా భక్తురాలు. ఆమె పెనిమిటి కలకత్తాలో వైద్యుడై
'యున్నాడు. ఆ దొరసాని నా కుమార్తెను బడిలో చూచి, దాని
'మీద నిండ ఇష్టముగా ఉండెను. ఆమె మా తొందరలను గురించి
'విని, నన్ను పిలువనంపించి చెప్పినది యేమంటే, 'ఫుల్మనీ, నా వెంటను,
'సుందరిని కలకత్తాకు రానిమ్ము. నేను దానికి ఆయా పనిని నేర్పు-
'దును. అది భక్తిగల చిన్నది అని నేను నమ్ముచున్నాను గనుక ఇటు-
'వంటి చిన్నదానిని నా పిల్లలతోకూడ ఉంచుకొనుటకు నాకు నిండ
'ఆశకలిగి యున్నది. సుందరికి ఈ పనిని గురించి ఏమియు తెలియక
'పోయినప్పటికిని, దానికి అన్న వస్త్రము ఇచ్చి, నెలకు రెండు రూపా-

'యీల చొప్పున జీతమును ముట్టచెప్పుదునని వాగ్దత్తము చేయుచు-
'న్నాను. అది పని బాగుగా నేర్చి చేయగలిగిన తరువాత, దాని జీతము
'ఎక్కువ చేయుదును. ఇందుకు నీవు అనుకూలిస్తే, ఇప్పుడే నేను
'ముందుగానే సంవత్సరమునకు అయిన జీతము, అనగా ఇరువది నాలుగు
'రూపాయీలు ఇత్తును. ఈ సొమ్ము తీసుకొని పోయి, మీ వైద్యుని
'అప్పు తీర్చుకొనవచ్చును. అప్పుడు మీ తొందరలన్నియు తీరిపోవు-
'నని ఆమె చెప్పెను" అనెను. ఫ్లన్సీ ఇంక చెప్పసాగినది యేమంటే,
"అమ్మా! నేను ఇంటికి వచ్చి, సుందరియొక్క తండ్రితో ఈ సంగతి
'అంత తెలియచేసితిని. అయితే ఆయన మా కుమార్తెను విడిచిపెట్టి
'యుండుటకు సమ్మతించలేదు గనుక, అయిదు ఆరు దినములదాకను
'నాకు నేమియు తోచక, ఆ జాతి వైద్యుని భార్యదగ్గరకు వెళ్లలేదు.
'ఇరుగు పొరుగు వారందరును, 'నీ పిల్లను బొత్తుగా పంపించవద్దు,'
'అని చెప్పినారు. కొందరు, ఛీ, ఛీ, మీ కుటుంబమునకు అవమానము
'వచ్చును, వద్దు సుమీ,' అని చెప్పినారు. కొందరు, 'వద్దు, పిల్ల చెడి-
'పోవు'నని చెప్పినారు. మరి కొందరు, 'నీకు రూపాయీలమీద నిండా
'ఆశ ఉన్నది. డబ్బు ఆశచేతను నీ కుమార్తెను నీవు నీచపు సేవలో
'నికి పరస్థలమునకు పంపించ కోరుచున్నావు. అప్పు చేసుకొనవచ్చును
'గాని, నీ కుమార్తెను పంపించవద్దని,' చెప్పినారు. ఈ ఇరుగు పొరుగు
'వారు ఈ చొప్పున చెప్పడము విని, నేనును ఒక పర్యాయము
'మాత్రము అప్పు చేసుకొంటే, ఎంతమాత్రము హాని రాదనియు,
'జాగ్రత్తగా నడుచుకొంటే, అప్పు దబ్బున తీర్చవచ్చుననియు, అను-
'కొన సాగితిని. అయితే సుందరి అనినది యేమంటే, 'అమ్మా! వద్దు,
'తీర్చుటకు నీకు సొమ్ము ఎక్కడనుంచి వచ్చును? ఎందుకంటే, మా
'అయ్య బలమును పుట్టించే తిండి తింటేనే కాని, ఆయనకు బలము
'తిరిగి ఎన్నటికిని రా నేరదని, వైద్యుడు చెప్పుచుండడమే కాకుండా,
'అమ్మా! నీవును చాలా కష్టము చేయుచున్నావు గనుక, నిండ చిక్కి-

'పోవుచున్నావు. కాబట్టి, ఇప్పుడు మీరు మంచి ఆహారమును బట్టల-
'నుసు సంపాదించుకోవలసినది. నన్ను కలకత్తాకు వెళ్లనిమ్ము. లోకులు
'చెప్పేది వినవద్దు. ఎందుకంటే, నేను దేవునికి భయపడుచున్నాను.
'ఆయన నన్ను సమస్తమైన కీడునుంచి తప్పించును'" అనెను.

సుందరి వెళ్లడమును గురించి మేము ఏమియు నిశ్చయించుకొనక
ముందే, ఒక గర్వము గల ముసలి స్త్రీ నా సద్దికి వచ్చి, "మంచిది
'పుల్లనీ, నిరుడు నీ కుమార్తెను మధువనే నా కుమారునకు ఇచ్చి పెండ్లి
'చేయుటకు ఒప్పకపోతివి కదా. ఇప్పుడు నీకు ఇబ్బంది తటస్థించినది
'గనుక, సందేహము లేకుండా మా కాళ్లమీద పడి, వివాహము జరిగే
'లాగున బతిమాలుకొందువు. అయితే అది అట్టుండనిమ్ము. నేను సమ-
'స్తమును క్షమించినాను. సుందరిని కలకత్తాకు పంపించక, దానిని
'నా కుమారునకు ఇచ్చి, పెండ్లిచేయుము. ఆ పక్షమందు వైద్యునకు
'నీవు ఇవ్వవలసిన అప్పు నీ అల్లుడు తీర్చును" అని చెప్పెను. అందుకు
నేను "కూడదు, ఇది ఎన్నటికిని జరుగబోదు. నేను నీ కుమారునిని
'చిన్నప్పటినుంచి ఎరిగియున్న మాట సత్యమే. ఇంతే కాకుండా,
'వాడు నన్ను అమ్మా అని పిలుచుచున్నాడు. అయితే రెండు మూడు
'సంవత్సరములనుంచి, వాడు అప్పుడప్పుడు సారాయీ దుకాణము
'లోనికి వెళ్లి మద్యమును తాగడమును చూచుచు వచ్చినాను. గనుక
'మునుపు నేను మంచి స్థితిలో ఉన్నప్పుడు ఏమి చెప్పినానో, ఇప్ప-
'డును నా కుమార్తెను ఏమాత్రము తాగుబోతునకు ఇచ్చి, వివాహము
'చేయనని చెప్పుచున్నాను. ఇటువంటి వివాహముకంటె, అయ్యా
'కొలువు వెయ్యంతలు మేలుగా ఉన్నది" అని చెప్పితిని. ఇది వినడ-
ముతోనే ఆ ముసలిది మిక్కిలి కోపగించుకొని, మమ్ములను గురించి
చాలా ఘాతమాటలను చెప్ప నారంభించినది. ఏలాగుననంటే, "సుం-
'దరి కడుపుతో ఉన్నది గనుక, దానిని కలకత్తాకు నేను పంపించు
'చున్నాను అనినది గాక, ఇంతకంటె పెద్ద సంగతులనుకూడ ఇరుగు

'పొరుగువారితో చెప్పినది. దాని తండ్రియు, నేనును ఇటువంటి
'లేని పోని నింద మాటలను విని మిక్కిలి దుఃఖపడ్డాము. అయితే
'అప్పటిలో, 'నీతో వాదించే ప్రతి నాలుకకును న్యాయ విమర్శలో
'శిక్ష విధింతువు.' (యెషయా. 54: 17.) అనే దేవుని వాగ్దత్తము మా
'యెడల నెరవేరినది. ఎందుకంటే, సుందరి చెడిపోయినదని ఒకరును
'నమ్మలేదు. మరియు ఇరుగు పొరుగువారందరును ఆ ముసలిదానిని
'కూకలు పెట్టినారు" అనినప్పుడు, "మంచిది, నీ కుమార్తెను పెండ్లి
'చేసుకో వలెనని యుండిన పడుచువాడు చివరకు ఏమైపోయినాడు"
'అని నేను అడుగగా, ఫుల్మనీ చెప్పినది యేమంటే, "ఇందాకను ఇక్కడికి
'వచ్చిన స్త్రీ మధువు అనే ఒకనిని గురించి మాటలాడుచుండెను కదా,
'ఈ మధువు నా కుమార్తె అయిన సుందరిని పెండ్లి చేసుకోవలెనని
'కోరెను. అయితే ఒక సంవత్సరము అయిన తరువాత, వాడు రాణి
'అనే ఒక చిన్నదానిని పెండ్లి చేసుకొనెను. కాని అది రెండు పర్యా
'యములు అతనియొద్దనుంచి పారిపోయెను. సుందరి చదువుకొనే
'బడిలో రాణియు చదువుకొనేది గనుక, వారుభయులకును మిక్కిలి
'స్నేహము కలిగి యుండెను. ఈ హేతువును పట్టి సుందరి వెళ్లిపో-
'యిన తరువాత, రాణి అప్పుడప్పుడు నాయొద్దకు వచ్చి, నా దగ్గర
'కొంతసేపు కూర్చుండి, తన దుఃఖమునంత నాతో చెప్పుచు వచ్చినది.
'అయితే అది నా యింటికి వచ్చినప్పుడెల్ల, దాని పెనిమిటి అయినా,
'దాని అత్త అయినా, ఇద్దరిలో ఒకరు, అది తిరిగి ఇంటికి వెళ్లగానే
'దానిని లెస్సగా కొట్టేవారని దాదాపు మూడు మాసముల క్రిం-
'దట అది నాతో చెప్పినది. అది నేను విని, కుటుంబములో కలహా-
'ములు పుట్టించే దేవినైనా చేయకూడదు గనుక, నేను దానిని రావద్దు
'అని ఆజ్ఞాపించితిని" అనెను.

"నీవు బాగుగా నిశ్చయించినావు. ఈ మధువును గురించియు,
'రాణిని గురించియు, తరువాత ఇంకా అడుగబోవుచున్నాను గనుక,

'సుందరిని గురించి ఏమి జరిగినదో ఇప్పుడు నాకు తెలియ చెప్పుము"
అని అడిగినాను.

అందుకు ఫుల్లనీ చిరునవ్వు నవ్వుచు, "అమ్మా! నా కుమార్తెను గురించి వినడమునకు మీకు ఇంత ఆశ కలిగియుండడమువల్ల మీ దయ నిం-'డుగా ఉన్నట్టు కనుపడుచున్నది. దానిని విడిచిపెట్టవలెనో, లేదో 'అని మాకు ఎటును తోచకుండా ఉన్నప్పుడు, అందును గురించి 'ఆలోచన పుచ్చుకొనుటకు, నేను బోధకుని దగ్గరకు వెళ్లినాను. ఆయన 'అప్పటిలో సువార్తను ప్రకటనచేసి, పుస్తకములను పంచిపెట్టుటకు 'అంగడివీధికి వెళ్లియుండెను. అయితే ఆయన భార్య, తన గదిలో 'కూర్చుండుమని, నాతో చెప్పెను గనుక, ఆయన వచ్చేదాకను కాచు-'కొని యుంటిని. ఆయన రాగానే, సుందరిని గురించిన యావత్తు కథ 'ఆయనతో చెప్పి, ఆయన ఏమి ఆలోచన చెప్పునో అని ఆయనను 'అడిగినాను. అందుకు ఆయన చెప్పెను, 'సాధారణముగా బంగాళీపడు'చు స్త్రీలు తల్లిదండ్రులను విడిచి, దూరదేశమునకు వెళ్లడము యుక్తము 'కాదని నాకు తోచుచున్నది. ఎందుకంటే, చిన్నతనములో ఉన్న-'వారు మిక్కిలి చపలులును ఆలోచన లేనివారును అయ్యుండి, దుర్మా-'ర్గులు చెప్పినట్టు నడుచుకొందురు. అయితే ఇది సుందరివిషయమై 'బొత్తుగా చెప్ప వల్లకాదు. దాని ప్రవర్తన రెండు సంవత్సరముల-'నుంచి చూచుచు వచ్చినాను. అది దేవునికి భయపడేదని నిస్సందే-'హముగా నమ్ముచున్నాను. మరియు అది స్వశక్తిని నమ్మకుండా, యేసు 'క్రీస్తువల్లనుండి బలమును ఉపదేశమును తనకు కలుగును గాక అని 'నిరంతరమును ప్రార్థించుచున్నదని నాకు తెలుసును. ఈ హేతు-'వును పట్టి, దానిని వెళ్లనియ్యవచ్చును. దానికి ఎవరును ఏ విధమైన 'హానినైన చేయలేరని చెప్పుచున్నాను. ఇంతే కాకుండా, చూడుము, 'ఓ సుందరియొక్క తల్లీ! నీవు ఇబ్బందిలో ఉన్నావు. దేవుడు ఈ 'విడుదల మార్గమును నీకు అగుపరచుచున్నాడు. నీకై నీవు నీ కుమార్తె

'కొరకు ఒక కొలువు వెదకలేదు. నా మట్టుకు నేనును ఈ సంగతిని
'గురించి నా సహోదరితో ఒక మాటయైన చెప్పలేదు. అది గనుక,
'దేవుడే ఒక తగిన ద్వారము తెరచినప్పుడు, దానిగుండా ప్రవేశిం-
'చడమనేది ఆయన సేవకులకు విధి అయ్యున్నది' అని చెప్పెను"
అనెను.

ఫుల్మనీ ఇంక చెప్పినదేమంటే, "బోధకుడు చెప్పిన ఈ మాట సుం-
'దరిని కలకత్తాకు మేము పంపించేటట్టు నిశ్చయించేలాగున చేసినది.
'ఆ మరునాడు ఆ వైద్యుని భార్య, తాను మాట ఇచ్చిన ప్రకారము,
'మాకు ముందుగా ఒక సంవత్సరపు జీతము ఇచ్చెను. దానితో మా
'వైద్యుని అప్పు తీర్చి, ఎనిమిది దినములదాకను నిండా సంతోష-
'ముగా ఉంటిమి. అయితే సుందరి కలకత్తాకు వెళ్లిపోయిన తరువాత,
'నేను మిక్కిలి దుఃఖముగా ఉంటిని. అప్పుడు సుందరియొక్క తండ్రి
'నాతో అనేకమారులు, ఫుల్మనీ! ఏడువ వద్దు, నీవు దేవుని చిత్తము
'చొప్పున జరిగించినావు గనుక, ఇదే నీకు ఓదార్పుగా ఉండనిమ్మని
'చెప్పెను. సుందరి వెళ్లిపోయిన ఎనిమిది నెలలకో, లేక పది నెలలకో,
'అది దాని యజమానురాలితోకూడ ఒక పర్యాయము ఇంటికి వచ్చి-
'నది. అప్పుడు నేను చూడగా, దాని అన్ని అందములును బాగుగానే
'ఉండెను. దాని తండ్రికూడ ఒక పర్యాయము దానిని చూచుటకు
'కలకత్తాకు వెళ్లినాడు. ఇప్పుడు ఆ జాతి వైద్యుని భార్య ఇక్కడికి
'తిరిగి పుష్యమాసములో వచ్చునని చెప్పుకొనుచున్నారు. హా! అమ్మా,
'మీరు సుందరిని చూస్తే, దానిని ప్రేమించకుండా ఉండలేరు. విరిగి
'పోయిన ఈ గులాబీచెట్టును గురించి యెందుకు ఇంతగా దుఃఖించి-
'నానో, ఆ వైనము మీకు తెలియచెప్పుదును. సుందరి కలకత్తా-
'నుంచి వచ్చినప్పుడు, ఈ మొక్క చేతిలో పెట్టుకొని నాయొద్దకు
'వచ్చి, 'అమ్మా దీనిని పుచ్చుకొనుండి, మా దొరసాని తోటమాలి ఈ
'మొక్క నాకు ఇచ్చినాడు. ఇది ఇంకా చిన్న అంటు అయ్యున్నది.

‘అయితే, దీనిని జాగ్రత్తగా చూచుకొంటే, అది చిగర్చి పుష్పిం-
‘చును.’ అప్పుడు యేసుక్రీస్తు కనికరించి పలికిన ఆ మాటను జ్ఞాప-
‘కమునకు తెచ్చుకొనుండి, ఏమంటే, ‘నేడు ఉండి, రేపు పొయిలో
‘వేయబడే అడవి గడ్డిని ఈ చొప్పున దేవుడు అలంకరించగా,
అల్ప విశ్వాసులారా! మిమ్ములనుకూడ అలంకరించడా’ అనేదే’ అని
‘నాతో చెప్పెను. ఈ హేతువును పట్టి, ఈ మొక్కను మిక్కిలి
‘ప్రియముగా చూచుకొంటిని. అది నా కుమార్తెను గురించిన సూచిక
‘అయ్యుండెను. మరియు దుఃఖ సమయములలో, అది నాకు తరు-
‘చుగా ఆదరణకరమై యుండెను. చెట్లకంటెను పువ్వులకంటెనుు
‘దేవుని జనులు ఆయన దృష్టికి మిక్కిలి విలువ కలిగి యున్నారని
‘నేను ఎరుగుదును” అని చెప్పెను.

ఈ కథ చదివేవారు, ఈ భక్తిగల స్త్రీయొక్క చరిత్రను నేను విని నిండ సంతోషించినానని తెలుసుకొనవచ్చును. అప్పటిలో కాలము ఉంటే ఇంక చాలా సంభాషించేవారమే. అయితే అప్పుడు ప్రొద్దు లేనందున, బంట్రోతు నా విషయమై తొందరపడి వచ్చి, “అమ్మా! మీరు చాలా కాలముదాకను ఉండడము చూచి, నేను త్వర-
‘గా ఇంటికి వెళ్లి బండి తీసుకొని వచ్చినాను. మీరు చీకటిలో కాలి
‘నడకను రాలేరు, మరియు ఇప్పుడు గుఱ్ఱములును నిలువకుండా ఉండి
‘వెళ్లిపోవడమునకు ఆతురపడుచున్నవి” అని చెప్పెను. ఈ సంగతిని విని, అరమనస్సుతో ఫుల్మనీయొద్ద సెలవు పుచ్చుకొంటిని. ఆమె ఇంటి-యొద్ద నేను గడిపిన రెండు గంటలును మిక్కిలి వినోదముగా గడిచి-నవి గనుక, నేను శీఘ్రముగానే తిరిగి వత్తునని చెప్పి, బండి ఎక్కి-నాను. ఇంటికి వెళ్లుచుండగా, మార్గములో నా మనస్సుకు అనేకము-లైన తలంపులు పుట్టినవి. ఫుల్మనీ తనకు తొందర ఇచ్చిన ఇటువంటి స్త్రీ ఎడల యెంత శాంతముగా నడుచుకొనెనో, ఆ సంగతిని తలంచి,

అయ్యో! ఈ బీద స్త్రీకి ఉన్న తెలివికంటె నాకు అధికముగా తెలివి యున్నప్పటికిని, ఈమె చూపినట్టు నేనుకు సర్వదా ప్రేమను, సహ-నమునను చూపుచున్నానని చెప్పచాలను అనుకొని, మరియు ఫుల్లనీ దేవునియందు ఉంచిన దృఢమైన విశ్వాసమును, నిరీక్షణమును జ్ఞాప-కము తెచ్చుకొని చూచుకొంటే, నా అవిశ్వాసమును గురించియు నా నిష్ప్రయోజనమైన తాపత్రయము యావత్తును గురించియు నేను మిక్కిలి నిరుత్తరవాదినియు దోషినియునై యున్నానని గ్రహించి, వినయము పొంది, "ఓ ప్రభువా! నేను నమ్ముచున్నాను. నా అప నమ్మికకు సహాయము చేయుము" అని ప్రార్థనచేసినాను. నా మన-స్సులో మరి యొకతలంపు పుట్టినది, యేమంటే, "నేను క్రీస్తు మత-స్థుల పల్లెలో కొంతసేపుమాత్రమే యుంటిని. అయినప్పటికిని, అక్కడి యిండ్లు అన్నియు ఫుల్లనీ యిల్లువంటివి కావనియు, అక్కడి స్త్రీలు అందరును ఆమె వలెనే భక్తి కలవారు కారనియు, నాకు మిక్కిలి స్పష్టముగా విశదమైనది" అనునదే. అంతట నేను దేవుని సమ్ముఖములో అతి వినయముతో ఈ ముందర వచ్చే ప్రార్థనను పలి-కినాను. "ఓ పరలోకపు తండ్రీ! నీ పరిశుద్ధాత్మతో నన్ను నింపి, ఈ పల్లెలో భక్తి హీనమైన కుటుంబము ఒకటి యున్నంతమట్టుకు, దానికి నేను నిన్ను గురించి యుపదేశించిటకు మానకుండా ఉండేలాగున, నా హృదయములో పాపాత్ముల యెడల కనికరమును పుట్టించుము" అనునదే.

నేను నా యిల్లు తిరిగి చేరగానే, నా తురక ఆయాను పిలిచి, నేను క్రైస్తవులతో చూచినది అంతయు వైనముగా దానికి చెప్పినాను. అప్పుడు ఆ ఆయా సంతోషించి, "మీరు అక్కడికి తిరిగి వెళ్లేటప్పుడు దయచేసి నన్ను వెంట పెట్టుకొని వెళ్లుదురా?" అని అడిగెను. అం-దుకు నేను మంచిది అని చెప్పి, నా గదిలోనికి వెళ్లినాను. కొం-చెము సేపటికి ఒక పెద్ద గాలి పుట్టినది. అప్పుడు నా [illegible]

గ్రామాదులలో గుడారముల క్రింద ఉండునని నాకు తెలుసును గనుక, నేను తొందరపడి కళవళ పడ్డాను. అయితే సుందరి దాని తల్లితో జ్ఞాపకముంచవలసినదని చెప్పిన మాటలను నేను జ్ఞాపకము తెచ్చుకొని, అందువల్ల ఆదరింపబడి నెమ్మదిగా నిద్రపోయినాను.



## ౨. అ ధ్యా య ము.



వెనుకటి అధ్యాయములో చెప్పబడిన సంగతులు జరిగిన పది పండ్రెండు దినముల తరువాత, నేను ఫుల్మనీ యింటికి తిరిగి వెళ్లుటకు ఉద్దేశించినాను. ఇది శనివారము గనుక, నేడు వెళ్లితే, ఆమె పిల్లలను కూడ చూడవచ్చును గదా అని అనుకొంటిని. ఎందుకంటే, ప్రతి శనివారమున ఆ దినము అంతయు కాకముందే, తన పిల్లలు బడినుంచి ఇంటికి వత్తురని ఆమె నాతో చెప్పియుండెను. అది జ్ఞాపకము చేసుకొని, ఆయాను బంట్రౌతునును వెంట పెట్టుకొని బైలు-దేరినాను. బంట్రౌతు ఒక పువ్వుల తొట్టిలో నుండే ఎఱ్ఱ రంగు గల ఒక పెద్ద సీమ మొక్కను మోసుకొని వచ్చినాడు. ఈ మొక్కను క్రిందట చిక్కుబడి పెళ్లగిలి పోయిన చీనా గులాబీ చెట్టుకు ప్రతిగా, ఫుల్మనీకి ఇచ్చుటకు యోజించితిని. ఎందుకంటే, పుష్పముల యెడల ఆమెకు ఉన్న ప్రేమను, వాటివల్ల ఆమె కలుగ చేసుకొనిన మంచి ఉపదేశమునను నేను చూచి, మిక్కిలి సంతోషించినాను. అనేక క్రీస్తు మతస్థులు ఈ సృష్టియొక్క సౌందర్యమును చూచి, అందువల్ల మహా స్రష్టను గురించిన బోధను కలుగ చేసుకొన లేకుండా ఉండుట ఆశ్చర్యముగానే యున్నది. మరియు, ఇటువంటివారు ఆయన హస్త కృత్యమునకును ఆత్మీయ సంగతులకును ఉండే సంబంధము ఇట్టిదని తెలుసుకొన లేకుండా ఉన్నారు. ఈ సంగతి ముఖ్యముగా ఈ దేశపు స్త్రీల విషయమై చెప్పవచ్చును. ఎందుకంటే,

వీరిలో దేవుని క్రియలను విచారించేవారు మిక్కిలి అరుదుగా నున్నారు. మెట్టుకు ఈ స్త్రీలలో ఫ్లల్సీ తప్ప, ఈ సంగతులను గురించి బాగుగా మననము చేసేవారు నాకు ఒకరును కనుపడి యుండలేదు. అయితే ఇది యేలాగున నుంటేనేమి, మెట్టుకు ఈ విషయములో ఫ్లల్సీయొక్క గుణము నేను చూడగా, మేము ఉభయులము మంచి స్నేహితలముగా ఉందుమని కనుగొంటిని, మా ఉభయుల రుచులును ఒకటిగానే కనుపించినవి. అనేక సంవత్సరములనుంచి నా మనస్సుకు నేనే ఒక వాడుకను ఏర్పరచుకొని యుంటిని. అనగా, ఎప్పుడైనా పొలములోనే కాని, ఏటి ఒడ్డుననే కాని, తోటలోనే కాని, ఒంటరిగా నేను తిరుగుచుండేటప్పుడు, నా కన్నులకు కనుపించే కలుపే కాని, పువ్వే కాని, రాయే కాని ఈ మొదలుగా గల వాటిలో దేనినైన ఒక దానిని ఏరి తీసుకొని, ఇది యెందుకు ఉపయోగమో, ఎంత చక్కనిదో, దీని గుణములు ఎటువంటివో అని యోజించి, ఈ చొప్పున దేవునియొక్క శక్తిని గురించియు, జ్ఞానమును గురించియు, ఉపకారమును గురించియు బోధ తెచ్చుకొనుచు నుందును. ఇంతే కాకుండా, ఇహ సంబంధమైన విషయములను ధ్యానము చేసుకొనేటప్పుడెల్ల, ఆత్మీయమైన సంగతులను గురించి కూడ మనము జ్ఞానము సంపాదించుకొన వచ్చును. ఇందుకు నేను ఒక దృష్టాంతమును చెప్పుదును. ఒక తోటమాలి తోటలో నున్న ఒక చెట్టు కొమ్మలను నరికి, దానికి పెంట కట్టుచుండుటను చూచి, బైబిలులో నుండే ఒక్క వచనముయొక్క భావమును బాగుగా గ్రహించ గలను. అది యేదంటే, "ప్రభువు, తాను ప్రేమించు వాని శిక్షించి, 'తాను అంగీకరించు ప్రతి కుమారునిని దండించును." (హెబ్రీ. 12: 6.) అనే ఈ వచనము కాకపోతే, మరి యొకటి యున్నది; "ఫలించని ప్రతి తీగెను ఆయన తీసివేయును. ఫలించు ప్రతి తీగెను 'అది మరి యెక్కువగా ఫలించునట్లు శుద్ధిపరచును" అనునదే.

(యోహాను. 15: 2.) నేను ప్రొద్దు గ్రుంకుట చూచేటప్పుడెల్ల, నిజమైన క్రీస్తు మతస్థులయొక్క చావు అనేది ఆ ప్రొద్దు గ్రుంకుటను పోలి యున్నట్టు యోజించుదును. ఎందుకంటే, ఒక నిర్మలమైన దినమంతయు ఎండ బాగుగా కాచిన తరువాత ప్రొద్దు గ్రుంకినప్పుడు, ఎవరును ఆ గ్రుంకడమును గురించి ఏలాగున తలపెట్టరో, ఆలాగుననే, కొందరు క్రీస్తు మతస్థులు తమ యావజ్జీవమును దేవుని సేవలో మనుష్యుల ఉపకారము కొరకు ఒప్పగించి, మరణ సమయమందు ఎక్కువ సంతోషమేకాని జయ చిహ్నమేకాని కనుపరుచకుండా, తమ ఆత్మనుల నమ్మకముతో ప్రభువు హస్తమునకు నెమ్మదిగా సమర్పింతురు.



## గీతపద్యము.



వారుతమయాయువంతయు వరుసదవిలి
నెమ్మదినొనర్చుచుంచి కార్యమ్ములందు।
గట్టివినియోగమొనరించి కాంతురంత
మఱియుమదినెమ్మదిరవొందు మరణమందు॥

వాస్తవముగానే ఒక నిర్మలమైన దినమందు తటస్థమయ్యే సూర్యాస్తమయమువలెనే, వీరిలో కొందరు, చచ్చేటప్పుడు, అనేకులచేతను లక్ష్యము లేకుండానే ఎంచబడుదురు. అయితే సూర్యుడు దినమంతయు మేఘముచేత కప్పబడి, సాయంకాలమందు మేఘములోనుంచి బయలుదేరి, కాంతితో ఏలాగున అస్తమించునో, ఆలాగుననే, కొంతమంది క్రీస్తు మతస్థులు అనేక శోధనములకు లోలులై, తమ భక్తివల్ల ఎక్కువ ఆదరణ పొందక, మనో వ్యాధిచేతను తమ జీవిత కాలమంతయు వ్యాకులముతోనే జరిపి, చివరకు తమ్ము మబ్బువలెనే కప్పిన దుఃఖమంతయు పోగొట్టబడగా, అధిక ధైర్యముతోను సంతోషముతోను కాలము చేతురు. ఇంతే కాకుండా, వానకాలము-

లో సూర్యుడు దినమంతయు మబ్బులచేతను తరుచుగా కప్పబడి, మబ్బులలోనే అస్తమించునట్లు, దేవునియొక్క రహస్యపు పిల్లలైన కొంతమంది క్రీస్తు మతస్థులును, స్వభావ సిద్ధమైన సంకోచముచేతనే కాని, మరియొక హేతువుచేతనే కాని, తాము బ్రతికి యున్నంత మట్టుకు, తమ భక్తిని విశేషముగా కనుపరచక యుందురు. అయితే హృదయములు అన్నియు కనుగొనే ప్రభువు వారి మనో భావములను తెలుసుకొని యున్నాడు. మరియు వారి పేరులు జీవ గ్రంథములో ఎక్కి యున్నవి. ఇదిగాక సూర్యుడు అస్తమించినప్పటికిని, తిరిగి ఉదయించ వలసినవాడే కనుక, ఇప్పుడు చెప్పిన క్రీస్తు మతస్థుల తరగతులు అన్నియు చచ్చి తిరిగి బ్రతుకును అనే మాటకు సంశయము ఏమియు లేదు.

ఫుల్లనీయొక్క యిల్లు చేరుటకు ఒక యేటి యొడ్డున పడి వెళ్లవలసి వచ్చెను. నేను నడువగా, ఇప్పుడు తెలియ చేసిన ప్రకారమే, ఆ నదిని గురించి యోజన చేసినాను. నా యోజనలు ఎటువంటివిగా నుండెనంటే చెప్పుదును: గంగానది ఉన్నతమైన హిమవత్పర్వతము మీదనుంచి క్రిందికి ప్రవహించునట్లు, పరిశుద్ధాత్మయును అలాగుననే పరలోకమునుంచి క్రిందికి వచ్చి, మనుష్యహృదయములో నివసించును. నదియొక్క ఊట ఎప్పుడును ఎండిపోకుండా ఏలాగున నుండునో, ఆలాగుననే, ఈ పరిశుద్ధాత్మ మనుష్యహృదయములో ఊటగా నుండి, నిత్య జీవములోనికి ఉబుకుచుండును. ఏటి నీటివల్ల శరీరము శుభ్రము అగుననేది సత్యమే కాని, నీరు హృదయము దాకను చొచ్చి, అక్కడ ఏమియు క్రియ నడపజాలదు. గనుక, అందులో స్నానము చేయుటవల్ల, పాప మాలిన్యమునుంచి మనుష్యులు పరిశుభ్రత్వమును పొందరు. అయితే పరిశుద్ధాత్మ హృదయములో వ్యాపించితే, ఆయన ప్రతి విధమైన పాపమునుంచి మనుష్యుల ఆత్మలను పవిత్రము చేయును. మరియు ఏటి నీటివల్ల భూమి ఏలాగున సార-

వత్తై యుండునో, ఆలాగుననే మతము అనే భూమి పరిశుద్ధాత్మవల్ల సారవత్తై సుకృత రూపకమైన ఫలమును ఇచ్చును. ఇదిగాక, మనస్సు గలవారందరును ఏటి నీటి వద్దికి వచ్చి, నిర్బాధకముగా నీరు ఏలాగున తాగవచ్చునో, ఆలాగుననే దప్పి కలిగి మనస్సు గలవాడెవడో, వాడు అమృతమును ధారాళముగా వచ్చి పుచ్చుకొనవచ్చును. గంగో-దకముచేత లక్షల తరబడి మనుష్యులును జీవరాసులును ప్రాణ సంరక్షణ చేయబడునట్టు, పాపములో చచ్చియున్న మనమును పరిశుద్ధాత్మచేత బ్రతికించబడుచున్నాము. గంగా ప్రవాహము, తనకు అడ్డముగా వచ్చే దేనినైనా కొట్టుకొని పోవుటకు, చాలునంత బలము ఏలాగున కలదై యున్నదో, ఆలాగుననే మనుష్యుల హృద-యములలో నుండే గొప్ప అడ్డి, అనగా వారి పాపేచ్ఛను పరిశుద్ధాత్మ అణచి, హృదయమును దేవునకు లోపరచును. ఇకను చిట్ట చివరకు ఏమంటే, గంగయొక్క ఉదకము నిరాటంకముగా మహా సముద్ర-ముతో ఏలాగున కలిసి పోవునో, ఆలాగుననే పరిశుద్ధాత్మయు మను-ష్యుల హృదయములలో పరిశుద్ధతను కొనసాగించి, వారిని నిత్యా-నందమనే సముద్రమును చేర దీసును. ఈ చొప్పున యోచించు-కొనుచు నడిచితిని గనుక, నాకు ఆయాసము తోచకపోవడమే కా-కుండా, మొదట ఉద్దేశించుకొని వచ్చిన ఫుల్మనీ యిల్లు ఇదే అని నేను తెలుసుకొనక మునుపే, ఫుల్మనీ యిల్లు చేరితిని. అక్కడ చేరగానే, ఇద్దరు పిల్లలు బైటికి పరుగెత్తి వచ్చి, నాకు తలుపు తీసినారు. అటు-తరువాత వారు సలాము పెట్టి, యింటిలోనికి త్వరగా వెళ్లి, తమ తల్లిని పిలిచినారు. క్రిందటి పర్యాయము ఫుల్మనీ నాకు కురిచీ తెచ్చి ఇచ్చినట్టు, ఇప్పుడు ఆమె కుమార్తె ఆ కురిచీని నాకు తెచ్చి ఇచ్చి, నా వద్ద నిలుచుండెను, అది దాదాపు ఏడు సంవత్సరముల ఈడు-కలదై యుండెనని అనుకొంటిని. దాని ముఖము పట్రువగాను పుష్టి-గాను నవ్వు కలదిగాను ఉండెను. దాని చక్కని నిడివైన వెంట్రు-

కలు సొంపుగా ముడివేసి యుండెను. దాని యిష్టకరమైన వైఖరిని
చూచి, నేను మిక్కిలి సంతోషించినాను. ఎందుకంటే, ఇతరమైన
బంగాళీ పల్లెటూరిలోని పిల్లలవలె, ఆ చిన్నది పారిపోకుండా, నా
ఆయా కొరకు ఒక పీట కూడా తీసుకొని వచ్చి, మాతో మర్యాద-
గా మాటలాడ నారంభించెను. అప్పుడు "నీ పేరు ఏమి!" అని నేను
అడిగినాను. అందుకు అది "నా పేరు సత్యవతి, సత్యమాడుట ఎప్ప-
'టికిని నా ప్రయత్నము" అని చెప్పెను. ఇది నేను విని, "సత్యవతి
'అనే పేరు మిక్కిలి చక్కని పేరే, కాని నీవు సత్యము పలుకుట
'నీ మాటలు నీ పేరుతో కూడ సరిపడియుండుటకా!" అని అడిగితే,
అది చిరునవ్వు నవ్వి, "కాదు, కాదు, అమ్మా! అలాగున కాదు;
'దేవుడు సత్యము పలుకవలసినదని మనకు ఆజ్ఞాపించెను, గనుకనే,
'నేను సత్యము పలుకేది. 'అబద్ధికులందరును నిప్పుతోను గంధకము-
'తోను మండే కుండములో పాలు పొందుదురని ఆయన చెప్పియు-
'న్నాడు'" అని చెప్పెను. (ప్రత్యక్ష. 21: 8.)

"బైబిలులోని ఈ వచనమును నీకు ఎవరు నేర్పిస్తారు" అని నేను
అడిగినాను. అందుకు సత్యవతి—"నా తండ్రి నాకు నేర్పినాడు.
'మాపుటి భోజనము కాగానే, ఆయన బైబిలులో ఒకటియైన రెం-
'డైన వచనములను మాకు నిత్యము నేర్పి, వాటిని గురించి మిక్కిలి
'తేటగా వివరించును. సత్యమును గురించిన వచనములను అన్నిటిని
'కంఠపాఠముగా చెప్పగలనని తోచుచున్నది. అయితే వాటిలోని-
'వెల్ల నాకు మిక్కిలి ఇష్టమైనది యిది యొకటే: ఏదంటే, 'నేను మా-
'ర్గమును సత్యమును జీవమును అయి యున్నాను' అనునదే. ఇది పలి-
'కినది యేసుక్రీస్తే. ఆయన తాత్పర్యమును క్రిందటి ఆదివారము-
'నాడు నా తండ్రి నాకు బోధించినాడు. అమ్మా! మనము క్రీస్తును
'వదిలిపెట్టి మరియొక మార్గమున నడిస్తే, మనము పరలోకమునకు వెళ్లక
'నరకములోనే పడుదుము" అని చెప్పెను.

ఈ చిన్న ఆడపిల్ల ఈ చొప్పున మాటలాడుచుండగా, దాని అన్న ఇంటిలోనుంచి బయిటికి వచ్చి, "ఓ అమ్మగారూ! నా తల్లి ఇల్లును గోడలును అడుసుతో అలుకుచున్నది. ఆ పని అయిన తరువాతను మీ వద్దికి వచ్చును. ఇక ఒక గది మాత్రము అలుక వలసియున్నది" అని చెప్పెను. అందుకు నేను, "నీ తల్లి నా వద్దికి రాకముందు, తన పనిచేసి తీర్చుకొనుట సరే. అయితే నీ పేరు ఏమో నాకు చెప్పుమని" అడిగినాను. ఆ చిన్నవాడు, తనపేరు సాధువు అని ప్రత్యుత్తరమిచ్చినాడు. సాధువు తన చెలియలికంటె రెండు మూడు సంవత్సరములు ఎక్కువ ఈడు కలవాడు. వాని ముఖవైఖరి విచారిస్తే, మిక్కిలి తెలివిగల చిన్నవాడని నేను అనుకొంటిని. అప్పుడు సత్యవతి "ఓ అమ్మగారూ! నేను సత్యమును గురించిన వాక్యములన్నిటిని ఏలాగున వల్లించినానో, నా అన్నయు ఆలాగుననే సాధుత్వమును గురించి చెప్పబడిన వన్నియు నేర్చుకొనియున్నాడు. మా బోధకుని భార్య ఈ దినము మాతో, 'సాధుత్వమును సత్యమును అన్నయును చెలియలును వలెను, నిరంతరమున్ను ఏకీభవించి యున్నవి, అవి యెన్నటికిని దేని వల్లనైన వేరుపరచబడవు' అని చెప్పెను. ఆహా! మాకు ఇద్దరికిని మిక్కిలి ఎక్కువైన పేరులు కలవు" అని చెప్పి, పెరటిలోనికి వెళ్లి, తన మానసోల్లాసమున గంతులు వేయసాగెను.

నేను ఇంతకు పూర్వము అనేకులైన బంగాళీ పిల్లలను చూస్తిని కాని, ఇంత సరిగా యోజించి, యింత మధురముగా మాటలాడిన ఒకదానినైనను ఇంతకు పూర్వము ఎప్పుడును చూచి యుండలేదు. ఆ సమయములో నేను కన్నులకు నీళ్లు తెచ్చుకొంటిని. వెంటనే నా మనస్సునకు తాకిన వేదవాక్యము ఏదంటే, "తండ్రీ! ఆకాశమునకును భూమికిని ప్రభువా! నీవు జ్ఞానులకు వివేకులకును వీటిని మరుగుచేసి, బాలురకు బైలుపరచినావని నిన్ను స్తుతించుచున్నాను" (మత్తయి. 11: 25.) అనునదే. అయితే సాధువును సత్యవతియును

నా కన్నీరైతే చూడలేదు గాని, తమ తల్లి వచ్చినదాకను నేను కాలము ఇష్టముగా గడుపవలెనని మిక్కిలి కోరియుండిరి.

సాధువు నాతో చెప్పినది యేమంటే, "అమ్మగారూ! చెడ్డదైన 'కరుణ అనేది మా అప్పయొక్క గులాబీ మొక్కను విరిచిన దినము 'మీరు వచ్చినారని అనుకొనుచున్నాము. నా తల్లి మిమ్ములను గురిం-'చియు, మా అప్పగారిని గురించి మీరు వినిన యాపత్తును గురించియు 'మాతో చెప్పినది" అనెను. అందుకు నేను, "అవును, అది విని నిండ 'సంతోషించినాను. ఇందుకొరకే మీ అప్ప ఇచ్చిన గులాబీ చెట్టుకు 'బదులుగా నీ తల్లికి ఇచ్చుటకు మరియొక సీమ మొక్కను తెచ్చి-'యున్నాను" అని చెప్పినాను. అప్పుడు బంట్రౌతును లోపలికి పిలిచి, ఆ మొక్కను వాని వద్దినుంచి తీసుకొని, వారికి ఇచ్చినమీ-దట, వారు ఉభయులును మిక్కిలి సంతోషించి, ఆ పువ్వును చాలా మెచ్చుకొన్నారు. అప్పుడు సాధువు, "సత్యవతీ, మన అప్పగారి-'యొక్క ఎండిపోయిన మొక్కను తీసి పారవేసి, దాని చోట ఈ 'మొక్కను పాటుదము రమ్ము. అప్పుడు మన తల్లి ఇది ఎక్కడ-'నుంచి వచ్చినదో ఎరుగక, మిక్కిలి ఆశ్చర్యపడును" అని చెప్పెను. అందుకు సత్యవతి, "వద్దు, వద్దు, సాధువూ! ఈ అమ్మగారు తెచ్చిన 'మొక్కను ఇంతకు మునుపు ఎండిపోయిన మొక్క ఉన్న కుదుటి-'వద్దనే ఉండనిమ్ము; కాని మనము అప్పగారి మొక్కను పారవేయ 'కూడదు. ఎందుకంటే, అది తిరిగి బ్రతుక గలందులకు అమ్మ నిండ 'అపేక్షకలదై యున్నది. ఈ దినమే ఆమె మన తండ్రితో, 'ఆ మొక్క 'ఎండిపోయినప్పటికిని, దానిని కాపాడుదును. దానియొక్క రెం-'డిన కొమ్మలు నా కొక సంగతిని బోధించుచున్నవి' అని చెప్పినది" అనెను. అందుకు, "ఆ బోధ యేమిటో, ఆ సంగతి అమ్మ చెప్పి-'నదా!" అని సాధువు అడిగెను. అందుకు సత్యవతి "అవును, ఈ 'రెండిపోయిన మొక్క చూచేటప్పుడెల్ల, అది పాపము చేసే రెండిల

తన మనస్సుకు భయము పుట్టించును, లేకపోతే ఎండిపోయిన కొమ్మ-
వలెనే ఆరని నిప్పులో పారవేయబడుదునని జ్ఞాపకపరచును అని
మన అమ్మ చెప్పినది" అనెను. ఈ సంగతిని విని, సాధువు మిక్కిలి
గాంభీర్యము వహించి, "సత్యవతీ! అలాగున అయితే, అప్పగారి
మొక్కను ఉండనిమ్ము. మనమును ఈ ఉపదేశమును మన హృద-
యములలో ఉంచుకొనవలెను. ఎందుకంటే, నీవును నేనును తరు-
చుగా తప్పులు చేయుచునే యున్నాము" అని పలికెను.

అటుతరువాత సత్యవతి లేచి, ఆయాను పిలుచుకొని, దానితో-
కూడ వంట యింటిలోకి వెళ్లెను. అప్పుడు నేను సాధువును చూచి,
"నేను క్రిందటి పర్యాయము సాయంకాలమందు వచ్చినప్పుడు, నీ తల్లి
తన పని అంతయు ముగించి యుండెనే, ఈ వేళ ఇంత పనిగా
ఎందుకు ఉండవలెను!" అని అడిగినాను. అందుకు ఆ చిన్నవాడు
చెప్పెను, "అమ్మగారూ! ఇది శనివారము గనుక, నా తల్లి పని మీద
ఉన్నది. వారముయొక్క చివర దినమునందు, ఆమెకు ఎప్పటికిని
నిండా పని యుండును. ఎందుకంటే, ఆదివారమునందు ఆమె మిక్కిలి
పనిచేయదు. ఈవేళ మేము బడినుంచి పంద్రెండు గంటలకు వచ్చి-
నాము. అది మొదలుకొని నా తల్లి చేసిన పని అంతయు చెప్పు-
దును. మొదట సత్యవతిని చెరువు దగ్గరకు తీసుకొనివెళ్లి, దాని
తల నున్ని పిండితో రుద్ది, నీళ్లు పోసినది. అటుతరువాత ఇంటికి
వచ్చి, చలువచేసిన బట్టలు తెచ్చుకొనుటకు చాకలవాని యింటికి
వెళ్లినది. తిరిగి వచ్చిన తరువాత, నా తండ్రియొక్క ఉత్తరీయమును నా
అంగీయును చినిగియుంటే, రేపటి దినము మేము దేవాలయమునకు
వెళ్లేటట్టు, వాటిని మా కొరకు బాగుచేసినది. అటుతరువాత సత్య-
వతి తలకు నూనె రాచి, తలవెంట్రుకలు చక్కగా జడవేసినది. అటు-
తరువాత దొడ్డి అంతయు ఊడ్చి, ఇల్లు అలుక నారంభించినది.
అయితే ఆ పని ఇదివరకును కాలేదు. మా ఆయ్య అప్పుడెప్పుడు

'మా అమ్మను చూచి, నీకు శనివారమునాడు చాలా పని యుండుచు-
'న్నది గనుక, ఇల్లు మరియొకనాడు అలికితే బాగుగా ఉండునని చెప్పు-
'చు వచ్చినాడు. అయితే ఆమె ఆ పని ఈనాడే చేయ కోరును. ఎం-
'దుకంటే, ఆదివారమునాడు ప్రార్థన అయిన తరువాత, కొందరు
'మనుష్యులు ఇక్కడికి వచ్చి, ముంగిట కూర్చుండి, బోధకునియొక్క
'ప్రసంగమును గురించి మాటలాడుకొని, రెండు మూడు కీర్తనలను
'పాడి అటుతరువాత కొంచెము ఫలాహారముచేసి వెళ్లుదురు. ఈ
'మనుష్యులు సమస్తమును శుభ్రముగాను క్రమముగాను ఉన్నదని
'చూచే కొరకు, మా అమ్మ శనివారమునాడు ఇల్లు అంతయు శుభ్రము
'చేయుచుండును. ఎందుకంటే, క్రైస్తవ స్త్రీలందరును మంచి ఇల్లాండ్రై
'యుండడము వారికి అవశ్యమైన విధియై యున్నదని ఆమె ఎప్పు-
'డున్ను చెప్పుచుండును" అనెను.

అంతట ఫుల్మనీయే వచ్చినది. అప్పుడు సాధువు వంట యింటిలో సత్యవతి దగ్గరకు వెళ్లెను. ఫుల్మనీయొక్క చీర మునుపటి యంత శుభ్రముగా ఉండలేదు. మరియు ఆమె నిండ అలసియున్నట్టు కను-పించినది. అయినప్పటికిని ఆమె సలాముపెట్టి, "అమ్మగారూ! నా
'పని అంతయు వదిలిపెట్టి మీ వద్దికి వచ్చేదాననే, అయితే శనివార-
'మందు పని కొరతగా ఉంచుట బాగుగా ఉండదని మీరు ఎరుగు-
'దురు" అని పలికెను. అందుకు నేను, "నిజము ఫుల్మనీ! అది మిక్కిలి
'మంచి వాడుక. సరే, ఆలాగున చేయడమువల్ల సబ్బాతు దినమందు
'దేవుని ఆజ్ఞ చొప్పున విశ్రాంతిని పొందవచ్చును. మంచిది, నాతో
'నిజముగా చెప్పుము. నీ పని యంతయు అయినదా కాలేదా! కాని
'పక్షమునందు నేను మరియొక దినము వచ్చి నీతో మాటలాడుదును.
'ఇప్పుడు వెళ్లి నీ పని చూచుకొనుము. అయితే నీ పిల్లలను నా
'వద్దికి తిరిగి పంపించుము. వారి మాటలు నాకు నిండా ముచ్చటగా
'నున్నవి" అని చెప్పితిని.

అందుకు ఫుల్మనీ "మీ సెలవైతే ఆలాగుననే చేయుదును. ఎం-
'దుకంటే, రేపటికిగాను కూరలు ఇంక వండి యుండలేదు" అని
చెప్పెను. అప్పుడు నేను, "ఏమి, రేపటి కొరకు కూర ఈ దినమే
'వండుదువా?" అని అడిగినందుకు, "అవును అమ్మా! శనివారమందు
'చేయగలిగిన పని నేను ఎందుకు మానవలెను? ప్రతి శనివారమును
'కొంత మాంసమునైన చేపలనైన కొనుకొందును; మరియు ఈ
'చలికాలములో ఈ దినము వండినది మరుసటి దినమువరకు చెడి-
'పోక యుండును. అయితే ఎండకాలములో ఈలాగున చేయ వల్ల-
'కాదు గనుక, ఆ కాలములలో కూరగాయలును పప్పును శనివార-
'మందు కొనడము మాత్రమే అగుచున్నది. కొని, విధిలేక ఆదివార-
'మందు వాటిని వండుకొందుము. కాని, ఆ దినము అంగడి వీధికి
'మాత్రము బొత్తుగా వెళ్లము" అని ఫుల్మనీ చెప్పెను.

అంతట ఫుల్మనీ వంట యింటిలోనికి వెళ్లుచు, దాని దృష్టి నా
సీమ మొక్కపైని పారినప్పుడు, నా వైపునకు తిరిగి, "అమ్మా! సలాము,
'ఈ చక్కని పూలమొక్క నాకు బహుమానముగా తెచ్చితిరి కాబో-
'లును. హా! సొలొమోను తన సమస్త వైభవమందును దీని వలె ధరిం-
'పబడి యుండలేదు" అని చెప్పి, వెళ్లి, ఆయాను పిల్లలనును నా
వద్దికి పంపించినది.

అప్పుడు ఆయా నన్ను చూచి, "అమ్మా! ఈ పిల్లలు నన్ను క్రీస్తు
'మతములో కలుపుకొనవలెనని చూచుచున్నారు" అనెను. అప్పుడు
నేను పిల్లలను చూచి, చిరునవ్వు నవ్వి, "మీరు నా ఆయా యెడల
'ఏమి జరిగించినారు? మీ రుచి గల కూరను దానికి బలవంతముగా
'తినిపించుటకు ప్రయత్నము చేసినారు కాబోలును" అని చెప్పితిని.
అందుకు ఆయా, "లేదు లేదు, అమ్మా! వారు ఆ చొప్పున చేయలేదు
'గాని, వారు ఒక క్రొత్త గుడుగుడీ తీసుకొనివచ్చి, అందుకు పొగాకు
'సిద్ధపరచి, నాకు త్రాగనిచ్చిరి. అటుతరువాత వారు క్రీస్తువేదము-

లోనుంచి చక్కని వచనములను చెప్పి, వాటి యర్థము నాకు స్పష్టముగా తెలిపిరి" యని పలికెను.

అప్పుడు ఆయా సత్యవతిని చూచి, "సత్యవతీ! నీవు నాకు చెప్పిన వచనములను నా యజమానురాలికి తిరిగి వినిపించుము. వాటిని ఒక పర్యాయము ఆమెను విననిమ్ము" అని చెప్పెను. అందుకు సత్యవతి "అమ్మా! ఆయా విని మిక్కిలి సంతోషించిన వచనములు ఏవంటే, 'ఒకడు తన స్నేహితుల కొరకు తన ప్రాణము పెట్టుటకంటె, ఎక్కువైన ప్రేమ గలవాడు ఎవడును లేడు. నేను మీకు ఆజ్ఞాపించుచున్నవన్నియు చేసితే, మీరు నా స్నేహితులై యుందురు" (యోహాను 15: 13, 14.) అనేవే యని చెప్పెను.

యేసుక్రీస్తు పాపాత్ములకొరకు చేసిన ప్రాయశ్చిత్తమును గురించి ఆయా తరుచుగా నావల్ల వినియుండెనుగాని, ఎప్పుడును దానిని మిక్కిలి అక్కరపట్టి వినియుండ లేదు. అయితే ఇప్పుడు ఈ చిన్నవారి నోటియారా ఈ మాటలను విని, తలపోయుచు, గంభీరముగా కూర్చుండెను. అప్పుడు నేను క్రీస్తు పలికిన ఈ మాటలు దాని మనస్సున గట్టిగా నాటినట్టు అనుకొంటిని. దాని కన్నుల నీళ్లు రాల చూచినాను. అయితే అది వారితో స్వకీయముగా మాటలాడ లేక, నాతో, "అమ్మా! ఈ పిల్లలతో మత సంగతులను గురించి మీరే మాటలాడుండి" అని చెప్పెను.

ఈ భక్తిగల కుటుంబము వారముయొక్క చివర దినమును గడిపే విధమును చూచి, నేను నిండ సంతోషించినాను గనుక, వారు సబ్బాతు దినమును ఆచరించే విధమును కూడ వినుటకు మిక్కిలి ఆశ కలిగి యుంటిని. కాబట్టి నేను సాధువుతో, "సాధువూ! నీవు ఆదివారము అంతయు ప్రొద్దున మొదలుకొని రాత్రి పర్యంతము చేసేది నాకు తెలియ చెప్పుము" అని అడిగితిని. అందుకు సాధువు ఇట్లనెను; "తమరు మొదటినుంచియు వినకోరే పక్షమునకు, శనివారము రాత్రి-

'తో ఆరంభించుకొని మీతో చెప్పవలెను; ఎందుకంటే, మా నాయన
'శనివారము రాత్రితోనే విశ్రాంతి దినము ఆరంభము అగుచున్నదని
'చెప్పును. శనివారము సాయంకాలము, మా అమ్మ పని అంతయు
'అయిన తరువాత, మేమందరము కూడి కూర్చుండి, కొన్ని కీర్తనలు
'పాడుదుము. అటుతరువాత మా నాయన దేవుని గూర్చి, 'ఓ దేవా!
'నీ వాక్యము ఫల ప్రదమయ్యేలాగున చేయుము, రేపటి దినము
'ప్రజలు వినే బోధ అంతయు వారి హృదయములలో గట్టిగా నాటు-
'ము, ముఖ్యముగా, మా బోధకుని యెడల దయయుంచి మా సభను
'ఆశీర్వదించుము' అని ప్రార్థించును. ఆదివారమందు చీకటితోనే మా
'అమ్మ మా కొరకు అన్నము వండును. మేము భోజనము చేసిన తరు-
'వాత, మా నాయన తిరిగి ప్రార్థించును. అటుతరువాత మేమంద-
'రము తెల్లబట్టలు కట్టుకొని, తలుపు తాళము వేసి, దేవాలయమునకు
'వెళ్లుదుము. ప్రార్థన అయిన తరువాతను, మీతో ఇంతకు పూర్వము
'చెప్పిన ప్రకారము, కొందరు మనుష్యులు ప్రసంగమును గురించి
'సంభాషించుటకు ఇక్కడికి వత్తురు. ఆ సమయములోనే సత్యవతియు
'నేనును ఒకానొక గీతమును బైబిలులోని ఒక వచనమును కంఠ-
'పాఠముగా పలుకుదుము. జనులందరును ఇండ్లకు వెళ్లిపోయిన
'తరువాత, మా నాయన మా చేత చదివించి, బైబిలులో ఒక వాక్య-
'మును గురించి మిక్కిలి తేటగా వివరించి చెప్పును, లేదా యోసేపు-
'యొక్కడైన, దానియేలుయొక్కడైన, సామయేలుయొక్కడైన,
'మరియొకరియొక్కడైన కథను మాకు చెప్పును. ఈ చొప్పున ఆది-
'వారమును ఇతర దినములకంటే ఎక్కువగా భావించుకొనుచు-
'న్నాము" అనెను.

ఇది నేను విని, "అయ్యో! క్రీస్తు మతస్థులందరును ఈ కుటుం-
'బము వలెనే, భక్తి కలిగి యుంటే, మా మతము విగ్రహారాధకుల
'సహా ఒప్పుకో తగినదిగా నుండును! అయితే అనేకులు పేరుకు

'మాత్రము క్రీస్తు మతస్థులై యుండి, హిందువులును తురకలును చేసే 'చెడ్డపనులను చేయుచు, క్రీస్తు పేరునకు అవమానము తెచ్చుటకు 'కారకులై యున్నందున, అది దుఃఖమునకు హేతువై యున్నది" అని మనస్సున అనుకొంటిని. అటుతరువాత నేను సత్యవతిని చూచి, "మం-'చిది, సత్యవతీ! చదివిన తరువాత ఆదివారమునందు మీరు ఇకను ఏమి 'చేతురు. దానిని నాకు చెప్పుము" అని అడిగితే, అది, "అయిదు 'గంటల సమయమునందు నా తండ్రియు నా అన్నయు తిరిగి దేవా-'లయమునకు వెళ్లుదురు. అయితే మా అమ్మ అన్నము వండేనిమిత్తము 'ఇంటివద్దనే యుండును. నేను నా తమ్ముడైన ప్రియసాధుని విహరిం-'చుటకు తీసుకొని వెళ్లుదును. ఇతను నా యెడల మిక్కిలి ప్రేమగా 'నుండి, నన్ను చూచినప్పుడు చేతులతో చప్పట్లు కొట్టును. మా 'నాయన యేడు గంటల సమయమునకు ఇంటికి వచ్చిన తరువాత, మేము 'భోజనము చేసి, తిరిగి కీర్తనలను పాడుదుము, లేదా, మా అన్న 'యాత్రికుని చరిత్ర చదివితే, మేమందరము కూర్చుండి ఆలకింతుము. 'అటుతరువాత ప్రార్థన చేసుకొని నిద్ర బోదుము" అని పలికెను.

ఇది నేను విని, "మంచిది, మీ నాయన మతమును గురించి బో-'ధించే విధమును నేను నిండ తెలుసుకొన కోరుచున్నాను. కాబట్టి 'నేను ఎప్పుడైన ఒక ఆదివారమునాడు [illegible] వస్తే, ఆయన కోపగించు 'నా?" అని అడిగితిని. "లేదు అమ్మా! మా నాయన అందుకు సంతో-'షించును. అయితే మీ యెదుట మాకు బోధించడని తోచుచున్నది. 'మిమ్ములనే మాకు బోధించమని బతిమాలును అనే సంగతి నాకు 'బాగుగా తెలుసును" అని సాధువు చెప్పగా సత్యవతి, "హా! అన్నా, 'అది యెంతో బాగుగా నుండును" అని చెప్పి, నా వైపు చూచి, "మీరు మిక్కిలి మంచివారు, మీకు చదివి వినుపించుటకు నాకు 'చాలా ఇష్టముగా నున్నది. అయితే అది యేలాగున నెరవేరును? 'మీరు బంగాళీ చదువలేరే" అని పలికెను.

అంతట నేను నవ్వుచు, "ఓ సత్యవతీ! ఇది నీకు ఎవరు చెప్పినారు! నేను నీకంటె బాగుగా చదివితే, అప్పుడో!" అని అడుగగానే, సత్యవతి అందుకు కొంచెము సిగ్గుపడి, "బోధకుల భార్యలు మాత్రమే బంగాళీ చదువనేర్తురని అనుకొంటిని. అయితే మీరు బోధకుని భార్యలరైనవారుగా నుండలేరు. గనుక, అలాగు చెప్పితి" ననెను. అందుకు నేను, "అది సత్యమే కాని, నేను బోధకురాలను కాకపోయినప్పటికిని, బంగాళీలయెడల దయ తలచి యున్నాను. మరియు వారికి బోధించ గలిగి యుండేలాగున, నేను బంగాళీ భాషను శ్రద్ధగా నేర్చుకొని యున్నాను. కాబట్టి నీవు కోరిన ప్రకారము ఒక దినము వచ్చి, నీ పాఠమును ఒప్ప చెప్పుకొందును. అప్పుడు నేను ఎంత పండితురాలనై యున్నానో, ఆ సంగతి నీవే కనుకొందువు. అయితే నేను చాలా సేపు ఉంటిని గనుక, నేను ఇప్పుడు ఇంటికి వెళ్లవలెను" అని చెప్పి, పిల్లలకు తలా ఒక పావులా చేతిలో పెట్టిన మీదట, వారు నిండ సంతోషించి, ఊరి పొలిమేర దాకా నాతో కూడ వచ్చి, కుక్కలను తరుముచు నన్ను కాపాడిరి.

ఆ రాత్రి నిద్రించక పూర్వము, "ఓ దేవా! నేను ప్రభు దినమందు ఆత్మలో లేచేటట్టు, నాకు కృప దయచేయుము. మరియు నేను పరలోక సంబంధమైన శాశ్వత సంతోషములను పొంద, సెలవు ఆయ్యే దాకను, ఈ లోకములో విశ్రాంతి దినమును క్రమముగా నాచరించేలాగున సహాయము చేయుము" అని ప్రార్థించితిని.

## ౩. అధ్యాయము.

మరునాటి యుదయమందు, అయా నా వద్దికి వచ్చి, "అమ్మా! ఒక స్త్రీ ఆ క్రీస్తు మతస్థుల పల్లెనుంచి వచ్చియున్నది, ఆమె మీతో ఒక మనవి చేసుకోవడమునకు వచ్చి యున్నానని అనుచున్నది. అయితే

'మీరు నిన్నటిదినము చూచిన ఆ క్రీస్తు మతస్థులవలె ఆమె యెంత 'మాత్రము నుండలేదు. ఆమె కట్టుకొని యున్న బట్టలు మిక్కిలి 'మైలవిగాను చినిగినవిగా నున్నవి గనుక, ఆమెను లోపలికి తీసు-'కొని రాక, వసారాలోనే కూర్చుండుమని, ఆమెతో చెప్పితిని" అని చెప్పెను. అందుకు నేను ఆయాతో, "నీవు మంచిపని చేసినావు 'నేను అక్కడికి వెళ్లి దానితో మాటలాడుదును" అని చెప్పి, వసారా-లోనికి వెళ్లి, నేను మొట్టమొదట ఫుల్మనీ యింటికి వెళ్లినప్పుడు చూ-చిన స్త్రీ కూర్చుండి యుండగా దానిని చూచితిని. కరుణ నన్ను చూడ కోరుట నాకు మొదట వింతగా నుండెను. అయితే తరువాత నాకు తెలిసినదేమంటే, నేను సాధువుకును సత్యవతికిని ఇచ్చిన రెండు పావులాలను వారు సంతోషించి, ఊరిలో నున్న వారికందరి-కిని చూపించినందున, కరుణ, తాను కూడ వెళ్లి, నాకు తన ఇబ్బందిని తెలుపుకొంటే, తనకును ఏమైన నిశ్చయముగా దొరుకునని అనుకొ-నెను. అది ఈ చొప్పున ఊహించుకొనుచు, నన్ను చూడగానే ఏడవ సాగి, "అమ్మా! మీరు ఇబ్బందిలో నుండేవారికి తల్లి దండ్రులై 'యున్నారు. మీరే మాకు గతి. మీరుతప్ప మాకు లోకములో నెవరును 'లేరు. ఇదిగో! మీరు నిన్నటిదినము భాగ్యవంతుల పిల్లలయెడల 'దయ చూపినారు. నేను బీదదానను, ఇక్కట్లో నున్నాను. కాబట్టి 'మీరు నన్ను కొంచెము కనుపెట్టవలెను" అని మనవిచేసెను.

కరుణయొక్క ఇబ్బందిని గురించిన కథ అంతయు విని, నేను కూడ దుఃఖించినాను. అయితే మునుపు అది ఫుల్మనీతో చేసిన సంభాష-ణను నేను జ్ఞాపకము చేసుకొని, కరుణ సోమరి స్త్రీ అనియు ఇంత కష్టము దాని లోపముచేతనే దానికి సంభవించి యుండవచ్చుననియు తలంచినాను. మరియు ఈ క్రీస్తు మతస్థులకు నేను రోజాజించక తారతమ్యము తెలుసుకొనక రూపాయిలు ఇయ్యబట్టితే, వారికి మేలునకు బదులుగా కీడు రావచ్చును. ఏలాగంటే, అందువల్ల యిర-

హంకారములును ద్రవ్యాపేక్షయును వారిలో పుట్ట వచ్చునని అనుకొంటిని. ఈ చొప్పున ఆలోచించుకొని, కరుణను చూచి, "చూడు. 'కరుణా! ఇటువంటి మైలబట్టలు కట్టుకొని ఆదివారమునందు ఇక్క- 'డికి నీవు రావడము నాకు బొత్తుగా ఇష్టము లేదు. ఎందుచేతనంటే, 'ఇప్పుడు నీవు దేవాలయమునకు వెళ్లుటకు సిద్ధముగా నుండవలసినది. 'అయితే నేను నీ నడవడిని గురించి నీ ఇరుగు పొరుగువారివల్ల తెలు- 'సుకొనినంగాని, నీకు సహాయము చేయను" అని చెప్పినాను.

కరుణ ఇది వినడముతోనే: తిరిగి ఏడవసాగి, "హా! అమ్మా! నేను 'మిక్కిలి దౌర్భాగ్యురాలను. నా పెనిమిటి దుర్మార్గుడును త్రాగు- 'బోతునై యున్నాడు. అతడు తాను చేసే వడ్రంగపు పనిలో 'గట్టివాడు గనుక, దినమునకు నాలుగు అణాలు సులభముగా సంపా- 'దించుకొన గలడు. అయితే అతడు మిక్కిలి తాగుబోతు గనుక, 'ఇంటికి ఎప్పుడు నేమియు తీసుకొని రాడు. మరియు అమ్మా! నా 'మైలబట్టలను పట్టి నామీద దోషారోపణ చేస్తిరి. అయితే ఈ బట్ట 'గాక నాకు ఇంకొక ముదుగుచీర మాత్రము ఉన్నది. అది చాక- 'లవానికి వేసి నెల దినములు అయినది. అది చలవ చేసినందుకు 'ఏమైన వానికి ఇచ్చి తీసుకొనేటందుకు, నా వద్ద ఒక దమ్మిడీ అయిన 'లేదు" అని చెప్పెను.

ఈ సంగతి విని, "కరుణా! ఒక దమ్మిడీ లేని హేతువుచేత నీవు 'తెల్ల బట్టలు కట్టుకో లేకపోతే, నీకు ఆ దమ్మిడీ నేను ఇస్తాను. చాక- 'లవానికడకు వెళ్లి, నీయొక్క ఉతికిన చీర కట్టుకొని, దేవాల- 'యమునకు శీఘ్రముగా వెళ్లుము" అని చెప్పితిని. అయితే కరుణ ముఖము చూడగా, దేవాలయమునకు వెళ్లుటకు దానికి మనస్సు ఉన్నట్టు 'నాకు కనుపించలేదు. అది నేను ఇచ్చిన దమ్మిడీ చేతపుచ్చుకొని "హా! అమ్మా! కనికరించి ఇంక నాకు కొంచెము ఇమ్ము. నాకు ఇంటి- 'వద్ద నిండా సంకటముతో నున్న ఒక కుమారుడు ఉన్నాడు. వానికి.

'అన్నము తెచ్చి పెట్టుటకు నా చేతిలో నేమియు లేదు" అనెను. అంతట నేను, ఇది మిక్కిలి దుఃఖకరమైన సంగతే. "దీనిని ఇంతకు పూర్వము నాకు ఎందుకు తెలియచేయలేదు?" అని అడిగి, దానికి ఒక గోధుమ రొట్టెను కొంచెము పంచదారను సగ్గు బియ్యమునను ఇచ్చి, దానితో, "ఇప్పుడు నీవు ఇంటికి త్వరగా వెళ్లి, ఇదంతయు నీ చిన్న-వానికి తినిపించుము. రేపటి సాయంకాలము మీ పల్లెకు వచ్చి, నేను నీకు సహాయము చేసే విధమును విచారింతును" అని చెప్పిన మీదట, కరుణ విని ఆసమాధానముగా వెళ్లిపోయెను. అంతట నేను చూడగా, రొట్టె పంచదార సగ్గు బియ్యము వీటికి బదులుగా కొంత సొమ్ము ఇచ్చితే, అది మిక్కిలి సంతోషించునని నాకు తోచినది. అయితే అది విశ్రాంతి దినమునందు ఏ వస్తువును కొనకుండేటట్టు, దానికి సొమ్ముకు బదులుగా తిండి వస్తువును ఇచ్చుట యుక్తమని. నాకు తోచినది.

మరునాడు నేను చెప్పిన మాట ప్రకారము, ఆ క్రీస్తు మతస్థుల పల్లెకు వెళ్లి, కొంత సేపటిదాక కరుణ యిల్లు వెదకి, ఆటుతరువాత దానిని కనుగొంటిని. అయ్యయో! దాని యింటికిని ఫుల్లనీ యింటికి నెంతో భేదమున్నది. కరుణయొక్క ఇంటి ఆవరణములో నొక చిన్న వంటయిల్లు ఉండెను గాని, దాని చూరు క్రిందికి జారి యు-న్నందున, పొయి వంట సామగ్రియు- కాపురపు ఇంటి ముంగిట నుంచి యుండెను. నేను వెళ్లకముందు కరుణ అన్నము వండుచుం-డెను గనుక, పొగచేతను ఇంటిలోనికి వెళ్లలేక పోయినాను. అయితే నేను చూడగా, ఆ ముంగిటి యిల్లు కూడ పడిపోయేటట్టుండెను. ఆవరణమంతయు మిక్కిలి చీకాకుగా నుండెను. ఇదిగాక నేను అక్కడనే నిలుచుచుండ వలసి వచ్చెను, ఎందుకంటే, "నా వద్ద పీట ఉండెను గాని, పిల్లలు దానిని ఈ దినము విరుగ గొట్టి పారవేసిరి" అని కరుణ చెప్పినది.

కరుణ తన కుటుంబము కొరకు అన్నము సంపాదించలేనంత ఇబ్బందిలో నున్నప్పటికిని, అది ఇంటిలో నొక గజ్జి కుక్కను పెట్టుకొని యుండెను, నన్ను చూడగానే, అది బిగ్గరగా మొరగసాగినందున, కొంతసేపటిదాక కుక్క ధ్వని తప్ప, మరేమియు నాకు వినుపించలేదు. చివరకు కరుణ దానిని మిక్కిలి కసురుకొని, అది యూరకుండ చేసిన మీదట, నేను దానికి ఇట్లంటిని, "కరుణా! ఈ వేళ నేను వత్తుననే మాట నీకు తెలిసే యున్నది గదా, నీవు నీ యింటిని కొంచెము శుభ్రముగా చేసి యుంచుదువని అనుకొంటిని. మంచిది, నీ ఉతికిన చీర యెక్కడ నున్నది? నా ఇంటికి నీవు కట్టుకొని వచ్చిన ఈ మురికి బట్టలనే ఇదివరకును కట్టుకొని యున్నావు" అంటిని. అందుకు కరుణ, "అమ్మా! మీరు నాకు ఇచ్చిన దమ్మిడి పెట్టి పొగాకును తమలపాకులను కొనుక్కొంటిని. చీర నొకటి రెండు దినములు తాళి తెచ్చుకొంటే, వచ్చే హాని యేమియు లేదు. అయితే పొగాకు లేకపోతే, చచ్చిపోదుము" అని పలికెను. అందుకు నేను అనిన మాట, "నీవు పొగాకు వేసుకొనుట మిక్కిలి చెడ్డపని. అయినప్పటికిని, ఇది ఒకందున స్వల్పమైన సంగతే కాని, సబ్బాతు దినమందు అంగడికి వెళ్లినందువల్ల దేవుని ఆజ్ఞను అతిక్రమించినావు గనుక, నేను నీ మాటలు విని, మిక్కిలి దుఃఖించుచున్నాను" అని చెప్పిన మీదట, కరుణ పలికినదేమంటే, "అమ్మా! మేము ఇబ్బందిలో నున్నాము. తినడమునకు అన్నము తెచ్చుకోలేము. ఇకను తమ పద్ధతులకు ఏలాగున చెవి ఇయ్య గలము? ఇంతేకాక, నేను మాత్రమే ఆదివారమునందు అంగడిలోని వస్తువులను కొనేదానను కాను. ఈలాగున చేసేవారు ఇంక పదిమంది క్రీస్తు మతస్థులను మీకు చూపించ గలను" అనెను. అందుకు నేను, "ఆలాగుననే ఉండవచ్చును. పదిమంది అలాగున చేసినను, అది యుక్తము కాదు. ఈ పదిమందియు చేయుచున్నట్లు నీవు చేయుట,

'నీ పొరుగున నున్న ఫుల్లనీ వలె నడుచుకొంటే, ఉత్తమమై యుం-
'డును" అని చెప్పితిని. అప్పుడు కరుణ, "ఓ అమ్మా! ఫుల్లనికిని
'నాకును చాలా భేదము కలదు. ఆమెకు దొరికిన పెనిమిటివంటి
'వాడు దొరకడము చాలా కష్టము. ఇంతేకాక, మరి యొక
'సంగతి చెప్పుదును. వారు భాగ్యవంతులు. వారికి బట్టలకును సొమ్ము-
'లకును కొరతలేదు, గనుక వారు కావలసిన వస్తు సామగ్రి అంతయు
'శనివారమునాడే కొని, ఆదివారమునందు శుభ్రమైన బట్టలు కట్టు-
'కొని దేవాలయమునకు వెళ్లుదురు" అని పలికెను.

అందుకు నేను చెప్పిన మాట, "వినుము కరుణా! ఫుల్లనీ భాగ్య-
'వంతురాలని నా యెదుట దీనితో రెండు పర్యాయములు అంటివి.
'అయితే దాని పెనిమిటికి నెలకు ఏడు రూపాయీలు మాత్రమే
'దొరుకుచున్నవిగదా. వారు ఏ చొప్పున భాగ్యవంతులు అయిరి?
'అయితే ఆ కుటుంబము ఇంత సుఖముగా ఏ హేతువునుపట్టి కాల-
'ము గడుపుచున్నదో అది నాకు బాగుగా తెలుసును. ఫుల్లని కష్టము
'చేసి తగుమాత్రముగా వ్యయము చేయును గనుక, దేవుని ఆశీర్వచ-
'నము ఆమెమీద నున్నదని నేను గట్టిగా నమ్ముచున్నాను. దే-
'వుడు విధేయులైన యిశ్రాయేలీయులకు దయచేసిన వాగ్దానము
'ఫుల్లనీ విషయమై నెరవేరినది. అది యేదంటే, 'నీ గంపయు నీ
'సామగ్రియు ఆశీర్వదింపబడును' (ద్వితీ: 28: 5.) అనునదే. ఫుల్లనీ
'దేవుని ఆజ్ఞలనన్నిటిని కాపాడేయెడల మనస్ఫూర్తియైన ప్రయ-
'త్నము చేయును గనుక, ఆమె భాగ్యవంతురాలై యున్నది. యేసు
'క్రీస్తు చెప్పినది వాస్తవమేను. ఏమంటే, 'మీరు దేవుని రాజ్యమును
'ఆయన నీతిని మొదట వెదకుండి, అప్పుడు ఇవి అన్నియు మీకు
'చేర్చబడును' (మత్తై 6: 33.) అనునదే' అంటిని. అందుకు కరుణ
'చెప్పినది," "అవును అమ్మా! అది అలాగునే యుండవచ్చును. అయితే
'ఆమె స్థితి యావత్తు నా దాని కంటే అన్నివిధములు బాగుగా నున్నది.

'ఆమెకు ఎంత భక్తిగల పురుషుడు ఉన్నాడో చూడుము. నా పెనిమిటి
'అయితేనో, దుర్మార్గుడును నిండ తాగుబోతునై యున్నాడు.
'అయ్యో, అమ్మా! అతడు నన్ను పెట్టే తొందర మీరు చూచితే, నా
'యందు కొంత కనికరము తలంతురు" అని చెప్పెను. ఇది విని, కరుణ
విషయమై నేను నిండ దుఃఖించి, "వినుము కరుణా! నీ పెనిమిటి
'నీ యెడల రెండు మూడు పరుష వాక్యములు ప్రయోగించితే, నీవు
'ఏలాగునైన సహించవలసినది. ఎందుకంటే, నీ వివాహ పురుషుని
'వద్దనుంచి నిన్ను ఎవరును ప్రత్యేకించలేరు. అయితే ఇది పోనిమ్ము.
'ఒళ్లు బాగులేని నీ పిల్ల యేలాగున నున్నదో నాకు చెప్పుము" అని
అడిగితిని. ఆ మాట వినడములోనే, కరుణ కొంచెము భయపడి,
"వానికి నేడు కొంచెము నిమ్మళముగా నున్నది గనుక, వెళ్లవద్దని
'నేను వానితో నెన్నిపర్యాయములు చెప్పినప్పటికి, వినక వాడు
'ఆడుకొన వెళ్లి యున్నాడు. వాడు నిండ మంకువాడు గనుక, ఎవరు
'చెప్పినప్పటికి వినడు" అని చెప్పెను. అందుకు నేను అన్న మాట,
"వాడు నిన్నటిదినమే నిండ సంకటముగా నుండి, ఈ దినము ఆడు-
'కొన వెళ్లినాడా! ఇది నాకు చాలా వింతగా నున్నది. హా! కరుణా!
'ఆ చిన్నవాని విషయమై నీవు కేవలము సత్యము పలుకలేదని నాకు
'తోచుచున్నది" అంటిని. కరుణ సిగ్గుపడి, "అమ్మా! వాడు క్రిందటి
'సెలలో నెంత సంకటముగా నుండెనో, ఆ సంగతి అందరికిని తెలు-
'సును. ఐతే దైవానుగ్రహమువల్ల వాడు ఇప్పుడు కొంచెము తేటగా
'నున్నాడను మాట సత్యమే" అని మారు మాట పలికెను. ఇది కరుణ
చెప్పుచుండగా, ఒక పిల్లవాడు ఇంటిలోనికి పరుగెత్తుచు వచ్చినాడు.
వాని రంగు నిండ నల్లగా నుండెను. వాడు మంటిలోను బురద-
లో నాడుకొని వచ్చినాడు గనుక, వాడు మరింత నల్లగా కనుపిం-
చెను. వాడు కేవలము దినములుగా నుండలేదుగాని, వాని ముఖము-
ట్టు నొక చిరిగిన గుడ్డమాత్రము చుట్టియుండెను. వానిని చూడ-

గానే వానితల్లి తొందరపడి, "నవీనా! ఇక్కడికి వచ్చి, ఈ అమ్మకు సలాము పెట్టు. ఈమె మిక్కిలి దయగల దొరసాని. నిన్నటిదినము రొట్టెయు పంచదారయు నీ కొరకు పంపించినది యీమెయే" అని వానితో పలికెను. అయితే నవీనుడు తన తల్లిని చూచి, "నేను ఈ దొరసానికి ఎందుకు సలాము పెట్టవలెను? ఆమె పంపించిన రొట్టెయు పంచదారయు నాకు ఏమైన నిచ్చినావా!" అని అడిగెను. "ఇదేమి, ఆ రొట్టె యేమై పోయినది?" అని నేనడిగినప్పుడు, అందుకు నవీనుడు త్వరగా మారు మాట పలికెను; "అమ్మా! ఆలకించుండి, నేను మీకు తెలియచేతును. ఈ పల్లెలో మా వైపున బాకల అనే పేరు గల ఒక స్త్రీ యున్నది. దానిపిల్ల ఓపలేక యున్నందున, అది నా తల్లికి రెండు డబ్బులిచ్చి, ఆ రొట్టెను కొనుక్కొనినది. అంతట నా తల్లి వెళ్లి, వాటితో పొగాకు కొనుక్కొనినది. వా! అమ్మా! అది తాగే పొగచుట్టలు మీరు చూచితే, మీకు ఆశ్చర్యమగును. అది దినమంతయు మరియొక పని చేయదు. రాత్రిలో నూరు మారులు నన్ను నిద్రలేపి, పొగాకు సిద్ధము చేయుమని చెప్పును. ఇందుకు నా తండ్రి దీని కెన్నిపర్యాయములో కొట్టినాడు. అయితే ఇది యెవరికిని తెలియదు" అని ఆ చిన్నవాడు ఈ మాటలు పలుకగానే, వాని తల్లి మిక్కిలి కోపపడి, వాని నొక గట్టి చెంపకాయ కొట్టి, "నవీనా! నీవు పెద్ద అబద్ధము చెప్పుచున్నావు" అనెను. అయితే నవీనుడు సత్యమే పలికెననియు, కరుణ తన తప్పును దాచుకొనుటకే, నా యెదుట వానిని శిక్షించెననియు నాకు బాగుగా తెలుసును.

నేను తల్లియొక్కయు కుమారునియొక్కయు ఈ శాంతి నడతను చూచి, వీరు బాగుపడరు గదా అని విచారము చేయుచు సిద్ధపడి, వీరు ఎప్పటికిని తిన్నగా నడుచుకొనరని నా మనస్సులో అనుకొంటిని. అయితే అప్పుడు నేను, "నాకు నా తలిదండ్రులిట్లు నాకి

శరీరములోనుంచి రాతి గుండెను తీసివేసి, వారికి మాంసపు గుండెల నిత్తును" (యెహెజ్కేలు. 11: 19.) అను వేదవాక్యము జ్ఞాపకము చేసుకొంటిని. ఈ [illegible]కరపు వాగ్దత్తముచేత నేను కొంతమట్టుకు ప్రేరేపింపబడి, కరుణను ఏ హేతువును పట్టియైన వదిలిపెట్టననియు, దానికి బోధించి, దాని కొరకు ప్రార్థించి, అది తిన్నగా నడుచుకొనేలాగున, దానిని దారికి తెచ్చేకొరకు, నా యావచ్ఛక్తిని వినియోగ పరతుననియు, నిశ్చయించుకొంటిని. నేను ఈ చొప్పున నిష్కర్ష చేసుకొని, దానిని చూచి, "కరుణా! నీవు ఏమైన పని చేయగలవా, లేదా!" అని ముందుగా నడిగితిని. అందుకు అది, "అమ్మా! మేము గృహస్థులము. నేను ఏమి పని చేయవలెనని కోరుచున్నావు!" అని అడిగెను. అప్పుడు నేను, "బట్ట కుట్టు కుట్టగలవా!" అని అడిగితే, "అవును, ముదుగు కుట్టు కుట్టగలను" అని కరుణ చెప్పగా, "అలాగునైతే నేను నీకు కొంత పని ఇయ్యగలను. శనివారమందు సామాను తుడిచే డెబ్బదిరెండు తుడుపు గుడ్డలను తీస్తిని, వాటిని కుట్టుటకు దర్జీవానికి ఇస్తే, గుడ్డ ఒకటింటికి ఒక డబ్బు వానికి దొరకును. అయితే నీవే వాటిని కుట్టే పక్షమందు, నీకు గుడ్డ ఒకటింటికి అర్ధణా ఇత్తును. ఈ చొప్పున చూచితే, అన్నిటికిని సరిగా రెండు రూపాయీల పావుల అగును. ఆ సొమ్ము పెట్టి నీవు రెండు మంచి చీరెలు కొనుక్కో గలవు" అని చెప్పితిని.

కరుణ యిది విని, "మీరు భాగ్యవంతులు. మీరు ఒక బీదవానికి ఒక రూపాయి ఊరికే ఇచ్చితే, దానివల్ల మీకు నష్టము ఏమియు రాదు. కుట్టు కుట్టుకొని ఈ డబ్బులు సంపాదించుకొనుటకు నాకు సావకాశము ఎంతమాత్రము లేదు. ఇప్పుడును నేను గృహకృత్యము తీర్చుకొనకుండగా, కుట్టుమీదకూడ పడితే, భోజనమును వెంటనే వదిలిపెట్టవలసి యుండును" అని చెప్పగా, "నేను, మంచిది కరుణా! నీకు ఇష్టము వచ్చినట్టు చేసుకొనుము. అయితే, ఎవడైన

‘పనిచేయ నొల్లకపోతే, వాడు తినకూడదు’ (2 థెస్స. 3: 10.) అని
‘వేదగ్రంథములో వ్రాసియున్నది. కాబట్టి నీకు బిచ్చము ఇత్తునని
‘అనుకొనవద్దు. ఇదిగో సెలవుపుచ్చుకొని వెళ్ళుచున్నాను” అనినప్పుడు,
కరుణయొక్క ముఖము దుఃఖముతో నిండెను. అది నేను చూచి,
“కరుణా! ఆ గుడ్డలు నీకు కావలసియుంటే, బోయీ చేతికి ఇచ్చి
‘పంపింతును” అని చెప్పినప్పటికి, ఆ సోమరి స్త్రీ “వద్దు, వద్దు, ఈ
‘పని నేను చేయలేను. దేవుడు ఇదివరకు ఏలాగున నాకు గుప్పెడు
‘అన్నము ఇచ్చినాడో, ఇకమీదటకూడ ఆలాగుననే ఇత్తును. నీ
‘కుట్టుపని చేయకపోయినందువల్ల మేము చచ్చిపోము” అని పలికెను.
ఈ మాటలు నేను విని,—“నేను నీకు వాస్తవముగా సహాయము చేయ
‘కోరితిని. అయితే నీవు ఈ చొప్పున పలుకుచున్నావు గనుక, నేను
‘ఇకను ఏమి చేయగలను!” అని పలికి, నవీనుని చూచి.—“నేను ఈ దినము
‘ఇక్కడికి రావడము ఎందుకును వినియోగించలేదు. అయితే ఇంక
‘కొంచెము ప్రొద్దు ఉన్నది గనుక, నేను మధువు ఇంటికి వెళ్ల కోరు-
‘చున్నాను. కాబట్టి నీవు జాగుచేయక నాకు దోవ చూపుటకు నాతో
‘కూడ వచ్చితే, నీకు ఒక అణా ఇత్తును” అని చెప్పితిని. నవీనుడు ఇది
విని, నిండ సంతోషించి, గంతులు వేయుచు ముందు నడిచెను. కొంత-
సేపటికి ఒక మిక్కిలి ఎత్తుగల పెంకుటింటి దగ్గర చేరగానే, నవీ-
నుడు “అమ్మా! ఇదే మధువు ఇల్లు” అని చెప్పినమీదట, వానిని
పంపించివేస్తిని. వాడు తన అణా డబ్బులు చేతపట్టుకొని, సంతోష-
ముతో తన యింటికి పరుగెత్తుకొని వెళ్లెను. ఇది నేను చూచి, ఈ
చిన్నవాడు నిన్నటి దినము రోగముతో ఉన్నాడన్న సంగతి యెంత-
మాత్రమును నిజము కాదని అనుకొంటిని.

అప్పుడు నేను ఆ యింటి పెరటి ముంగిట నిలుచుండి, ఒక
స్త్రీయొక్క రోదన ధ్వనిని, ఎవరో ఒక్క రోగియొక్క మూల్గులను
వింటిని. వారికిని నాకును, ఇంతకు పూర్వము పరిచయము లేకపో-

యినప్పటికి, నేను వాకిటి తలుపు నిర్భయముగా తీసి, లోపలికి వెళ్లినాను. ఎందుకంటే, బంగాళీలు రుగ్ణత్తగా ఉండేటప్పుడు, ఎవరైన వచ్చి వారి దగ్గర కూర్చుండి, వారి కష్టములో వారిని ఆదరించితే, వారు నిండ సంతోషింతురని నాకు తెలిసియుండెను. ఇంగ్లండులోనైతే ఈలాగున లేదు. అక్కడ అన్యుడెవడైన ఆకస్మికముగా రోగియొద్దికి వచ్చితే, ఆ రోగియొక్క స్నేహితులును బంధువులును ఆ వచ్చిన వాడు ఏమియు మర్యాద యెరుగనివాడనుకొందురు. అయితే అది యేలాగున ఉంటేనేమి, నేను లోపలికి వెళ్లి చూచితే, పెరడును వాకిలియు జనులతో నిండియుండెను. నన్ను చూచి యెవరును ఆశ్చర్యపడలేదు. ఎందుకంటే, నేను గ్రామాదులలో తిరుగుచుండే సంగతి వారి కందరికిని తెలిసియుండెను. అంతట ఎవరి రోదన ధ్వని అయితే నాకు వినుపించెనో, ఆ ముసలిది నా వద్దికి వచ్చి,—"అమ్మా! మీరు నా పిల్లవాడు ఓపలేక ఉన్న సంగతిని విని 'వచ్చినారు కాబోలును" అని చెప్పెను. అందుకు నేను "లేదు, 'ఆ సంగతి నేను వినియుండలేదు. మిమ్ములను చూచుటకు మాత్ర'మే వచ్చినాను. అయితే నీ కుమారుడు ఎక్కడ! అతనికి ఏ విధము'చేతనైనా సహాయము చేయ గలిగితే, నిశ్చయముగా చేతును" అని చెప్పితిని. వెంటనే ఇరుగు పొరుగువారు నాకు వెళ్లుటకు దోవచేసిరి. ఆ ముసలిది తన కుమారుని మంచము దగ్గర ఒక కురిచీని పెట్టి, "అమ్మా! దీనిమీద మీరు కూర్చుండుండి" అని చెప్పెను. అయ్యోరామా! పూర్వము ఫుల్మని చెప్పగా నేను విన్న దుర్మార్గుడును తాగుబోతునైన మధువు అనే చిన్నవాడు మరణావస్థలో ఉన్నట్టు అప్పుడు చూచితిని. వానికి ఈ ఉదయముండే వరుస విరేచనములు పలుమారులు అయినవి గనుక, నేను వానిని చూచినంతలో, వాడు బాగుపడునని తోస్తుగా అనుకొనలేదు. అప్పుడు నేను ఆ ముసలిదానిని చూచి, "నీవు ఇతనికి ఏ మందు ఇచ్చుచున్నావు" అని అడిగితిని. అందుకు అది "అమ్మా! ఇతనికి ఆకలి

‘మైన మందులు ఇచ్చినాము. ఎవరు ఏమి మందు చెప్పితే, ఆ మందు
‘ఇతనికి ఇచ్చుచున్నాము" అని పలికెను.

అందుకు నేను, "అది ఎంతమాత్రమును సరికాదు. ఎందుకంటే,
‘ఒక మందు ఇంకొక మందుయొక్క గుణములను కొట్టివేయును. నీవు
‘అది ఎరుగవా!" అంటిని. వైద్యుడు ఆ ముసలిదాని దగ్గర నాలుగు
రూపాయిలు పుచ్చుకొని మధువునకు తాగే నిమిత్తము ఒక మందు
ఇచ్చి, వాకిట పొగచుట్ట తాగుచుండెను. నేను చెప్పిన సంగతిని
వినగానే, వాడు లోపలికి వచ్చి, "అమ్మా! మీరు సత్యముగా పలుకు-
‘చున్నారు. ఒక పర్యాయమే మూడు నాలుగు విధముల మందు
‘ఇయ్యవద్దని, ఇంతకు పూర్వమే వారితో చెప్పితిని. అయితే వారు
‘వినకపోయిరి. అమ్మా! బంగాళీ స్త్రీలకు తెలివిలేదు. మీరు తిన్నగా
‘యోజించినట్లు, వారు యోజించలేరు గనుక, ఈ రోగి చచ్చితే, వారి
‘నేరమే కాని, నాదికాదు. నేను ఇచ్చిన మందు తప్ప మరియొక
‘మందు ఇయ్యకుంటే, దీనికి బాగు అయ్యేదే. ఎందుకంటే, రోగు-
‘లందరును ఆ మందువల్ల తప్పకుండా బాగుపడుచు వచ్చినారు. కొన్ని
‘దినముల క్రిందట ఒక మనుష్యుడు తన భార్యను చూడరమ్మని నన్ను
‘పిలిచెను. నేను అతని యింటికి వెళ్లి చూడగా, ఆ స్త్రీకి ధాతువు
‘లేకపోయెను, మాటలును లేకపోయెను. అయినప్పటికిని, నేను
‘ఆమెను బాగు చేసినాను" అని చెప్పెను.

"వద్దు, వద్దు, వైద్యుడా! అలాగున చెప్పవద్దు. ఆమెను బాగు
‘చేసినది నీవు కావు. అయితే నీవు ఇచ్చిన మందులకు దేవుని ఆశీ-
‘ర్వచనము చెందినది గనుక, అది బాగు పడినది" అని చెప్పితిని.
అందుకు వైద్యుడు, "అవును, అమ్మా! అది సత్యమే. దైవానుగ్రహము
‘లేనిది మేము ఏమి చేయగలము!" అని పలికెను.

ఆటుతరువాత నేను మధువు చెయ్యి పట్టుకొని—"ఈ మనుష్యుడు
‘చెప్పేది వింటివా? ఇతడు హిందువు అయి [illegible]

క్షమీకరము లేనిది ఏమి చేయగలమని అనుచున్నాడు. కాబట్టి, ఈ భయంకరమైన సమయమందు, దేవుడు నీకు తోడై యుండి, నిన్ను ఆదరించవలెనని కోరుచున్నాను" అని వానితో చెప్పితిని. అందుకు మధువు "లేదు, లేదు, దేవుడు నాకు తోడై యుండలేదు. అయ్యో-రో! ఆయన నాకు తోడై యుంటే, నా భయమంతయు తొలిగి-పోవును. అయితే ఆయన ఇక్కడ లేడు. ఇక నేమంటే, సైతాను నా చెవి దగ్గర కూర్చుండి, నీ సమస్త దుష్క్రియల ఫలమును ఇప్పుడు నీవు అనుభవించవలసినదని చెప్పుచున్నట్టు కనుపడుచున్నది" అని మారు మాట పలికెను.

ఇది విని, ఇరుగు పొరుగువారు మిక్కిలి భయపడిరి. వారిలో ఇద్దరు ముగ్గురు "ఒక అడకత్తెర కాని, ఒక కత్తియే కాని, ఇనుముతో చేసిన ఏదే కాని, దబ్బున తీసుకొనివచ్చి, యితని తల దగ్గర ఉంచుం-డి" అని పలికిరి.

అయితే మధువు తన కన్నులు తెరచి, "అయ్యోరా, స్నేహితు-లారా! క్రీస్తు మతస్థులైన మీరు ఈ వ్యర్థమైన మూఢ భక్తి నెం-దుకు తలపెట్టుచున్నారు? ఇనుమువల్ల నాకు ఏమియు ప్రయోజన-ము కలుగనేరదు" అని చెప్పెను. ఆటుతరువాత వాడు తన రొమ్ము కొట్టుకొనుచు,—"సైతాను ఇక్కడ నున్నాడు. వాడు ఇక్కడనే యున్నాడు. నా హృదయములో నున్నాడు. అయ్యోరా! నేను ఎటువంటి దౌర్భాగ్యుడను! నేను దయ్యముల అధిపతికి సేవచేయక, దేవునికి సేవచేసియుంటే, సంతోషముగానే చావ కలుగుదును గదా" అని ఏడ్చెను.

మధువు తన హృదయముయొక్క అతి వేదన చేతను, ఈ మాటలను బిగ్గరగా పలికిన తరువాత, వాని బలము అంతకంతకు తగ్గిపోయి, [illegible], [illegible] తల వాల్చుకొని, [illegible] అని [illegible]. అయితే అతని స్నేహితులు "వద్దు, వద్దు,

"నీళ్లు ఇస్తే, రోగము అధికమవును" అని చెప్పిరి. వీరు చెప్పినది నిజము కాదని నాకు బాగుగా తెలిసినప్పటికిని, ముందుకు నామీద ఎవరును నేరము వేయకుండా, నేను వైద్యుని చూచి, "ఇతనికి నీళ్లు ఇచ్చుటవల్ల హాని ఏమైన సంభవించునా?" అని అడిగితిని. అందుకు వైద్యుడు, "వీడు బొత్తుగా బ్రతుకడు గనుక, వీడు కోరినదంతయును వీనికి ఇయ్యండి," అని మెల్లిగా చెప్పెను. అది విని నేను మధువు నోటివద్ద చెంబెడు నీళ్లు పట్టితిని. వాడు ఆ నీళ్లన్నియు తాగి, కొంచెము తెప్పరిల్లినట్టు కనుపించినాడు. అటుతరువాత వాడు మిక్కిలి దీనస్వరముతో "రాణి యెక్కడ?" అని అడిగినాడు. ఆ తొందరలో రాణిని నేను బొత్తుగా మరిచినాను. అయితే నేను మధువుయొక్క ప్రశ్న వినగానే, అతని తల్లిని చూచి,—"నీ కోడలు ఎక్కడ? అది ఇక్కడ లేకపోవడము నాకు ఆశ్చర్యముగా నున్నది. ఇటువంటి సమయములో దాని పెనిమిటి దగ్గర అది యుండవలసినదేకదా," అని చెప్పితే, ఆ ముసలిది అనిన మాట, "నా కోడలు ఇక్కడనే యుండెను గాని ఇందాకనే ఫుల్మనీని పిలుచుకొని రావడమునకు వెళ్లినది. ఎందుకంటే, "ఫుల్మనీ వచ్చి నా పెనిమిటితో మతసంగతులనుగురించి మాటలాడితే, అతనికి మేలు కలుగును" అని అది చెప్పి వెళ్లినది." ఈ ముసలిది ఇది చెప్పుచుండగానే, ఫుల్మనియు రాణియు కలిసి వచ్చినారు. వెంటనే ఫుల్మనీ మధువుయొక్క మంచము దగ్గరకు వెళ్లి, యేడవసాగెను. వాడిలో మునుపు కళ్ల ఉండినట్టు ఇప్పుడు ఏమియు కనుపించలేదు. అయితే ఫుల్మనీ తనచెయ్యి వాని తలక్రింద ఉంచి, అతనిని కొంచెము ఎత్తి, "అయ్యయో, మధువా! నీవు చిన్నతనములో నన్ను అమ్మా అని పిలిచి, నా యింటికి వచ్చి మిఠాయి తినుచుండేటప్పుడు, నిన్ను ఎన్నిమారులు ఎత్తుకొని తిరిగితిని! అయ్యయో, నా కొడుకా! నీవు ఇప్పుడు ఇటువంటి స్థితిలో నున్నావు, హా! మధువా! నీవు [illegible]

'ముము. నీవు వాస్తవముగా పాప సముద్రములో నున్నావు. అయితే
'యేసుక్రీస్తు నిన్ను రక్షించుటకు తన చేతిని చాపుచున్నాడు. హా!
'మధువా! యేసుచేతిని పట్టుకో. ఆయన నిన్ను బయిటికి లాగును.
'హా! నా కొడుకా! ఆయనకు ఒక చిన్న ప్రార్థన మాత్రము అర్పిం-
'చు" అని చెప్పెను.

మధువు ఇదంతయు విని, తన మనోవేదనను సహించలేక, మిక్కిలి
తొందరపడి,—"అయ్యయో! ఫుల్మనీ తల్లీ! నా రక్షణ దినము గతించి
'పోయినది. సైతాను కృష్ణ సర్పమువలెనే నన్ను కరుచుచున్నాడు
'గనుక, నా చావు సమీపించి యున్నదని నాకు బాగుగా తెలుసును.
'హా! ఫుల్మనీ తల్లీ! సైతాను బైబిలులో మహా సర్పమని పిలువబడి
'యుండలేదా!" అని బిగ్గర అరిచి పలికెను. అందుకు ఫుల్మనీ అన్న
మాట—"అవును, సైతాను వాస్తవముగానే ప్రాచీన మహా సర్పమని
'పిలువబడియున్నాడు. ఎందుకంటే, వాడు సర్పాకారముతో మన
'మొదటి తల్లిని మోసపరచి, మన జాతినంతయును సంహరించ వెద-
'కెను. అయితే నేమి? హా! మధువా! నీవు నిరాశ చేసుకొనవద్దు.
'ఇత్తడి సర్పమును గురించిన కథను జ్ఞాపకము చేసుకొని, ప్రభువైన
'యేసు శరణు పొందుము. 'అరణ్యములో మోషే సర్పమును ఏలాగున
'ఎత్తెనో, అలాగు మనుష్య కుమారుడైన ఆయనయందు విశ్వాస-
'ముంచే ప్రతివాడును నశించక నిత్యజీవమును పొందుటకై ఎత్తబడ-
'వలెను' (యోహాను. 3: 15, 16.) అని ఆయనే చెప్పుచున్నాడు"
అనెను.

అందుకు మధువు—"యేసు నా ప్రార్థనలను వినడు. ఇదివరకు
'ఆయనను నేను ప్రార్థించలేదు. అయితే రాణిగారియొక్క క్షమాపణ
'పొంద గోరుదును. ఓ! ప్రియమైన రాణీ! అనేక పర్యాయములు
'నీకు కీడు చేసితిని. అయితే ఇప్పుడు నేను చచ్చుచున్నాను గనుక,
'నీవు నన్ను క్షమించుమని.. నా యిల్లు కాలెను, నాకు కాలి యున్న-

'దంతయును నీది. అయితే నా తల్లి బ్రతికి యున్నన్నినాళ్లు ఆమెకు 'అన్నవస్త్రము లిమ్ము. ఆమె నిన్ను ఒకప్పుడు అశాశ్వతముగా చూచి-'నప్పటికిని, ఆమెను వదిలిపెట్టవద్దు. ఆమె నీ పెనిమిటి తల్లి అని 'జ్ఞాపకము ఉంచుకో" అని చెప్పెను. అటుతరువాత మధువు ఫుల్మనీని చూచి, "అమ్మా! రాణిని నీకు అప్పగించుచున్నాను. మీరు ఏలా-'గున నిజమైన క్రీస్తు మతస్థులై యున్నారో, అలాగున దానిని 'కూడ చేయుండి. మరియు ఈ దినము మీరు మీ శత్రువుల యెడల 'ఏలాగున ప్రేమ చూపుచున్నారో, అలాగుననే ఇది కూడ తన 'శత్రువుల యెడల ప్రేమ చూపేలాగున, దీనికి నేర్పుండి" అనెను. మరి కొంత సేపటికి మధువు తిరిగి చెప్పినది యేమంటే, "హా! ఫుల్మనీ 'తల్లీ! రాణి ప్రసవమైన తరువాత, దానిని దయగా చూడుండి. నా 'పిల్ల కొంచెము పెద్దది అయి, మత బోధను పొంద గలుగగానే, 'అందుకుగాను బోధకుని భార్యయొక్క బడికి పంపించుండి" అనెను. ఈ ప్రకారముగా మాటలాడి, చాలా దప్పిగొని, యేడ్చి, "నేను ఈ 'దాహమునే సహించలేక పోతే, నరకాగ్నిని నిరంతరమును ఏలాగున 'సహింతును? నా లోక వ్యవహారమునంత పరిష్కరించితిని. నా 'నిత్యానంద విషయమై నేను ఏమిచేతును! అయ్యో! నేను నరకము-'నకే వెళ్లవలసినది" అని చెప్పసాగెను.

మధువుయొక్క భార్య ఈ మాటలు వినగానే, వాని రొమ్ముమీద పడి, బిగ్గనగా ఏడ్చి, "నీవు నరకమునకు ఎందుకు వెళ్లవలెను? దేవుడు 'నిన్ను నరకమునకు పంపడు. ఫుల్మనీ చెప్పుచున్న ప్రకారము యేసు-'యొక్క చెయ్యి గట్టిగా పట్టుకో. అప్పుడు ఆయన నిన్ను సంశ-'యము లేకుండా విడిపించును" అని పలికితే, మధువు తన తలను ఊచి,—"లేదు, రాణీ! లేదు. యేసు నన్ను అంగీకరించడు. నా దినము 'దినము గతించి పోయెను. అయ్యో! నేను [illegible] [illegible] పలికి [illegible] [illegible] [illegible] [illegible] [illegible]-

ముగా నుండని ఆ మధువుయొక్క ఆత్మ, లోక విశ్వకర్మకుని స్వాయా-
సనము వద్దికి రప్పించుకొనబడెను.

అయ్యయో! నేను ఇల్లు బయిలుదేరినప్పుడు, ఇటువంటి భయా-
సహితమైన దుఃఖకర కార్యము చూడవలసి యుండునని నాకు
ఏమైనా తోచినదా? వాస్తవముగా నా మనస్సు దీనివల్ల దుఃఖములో
మునిగెను.

రాణియు దాని అత్తయు మధువుయొక్క శవము మీద పడి,
బంగాలీ స్త్రీల వాడుక చొప్పున, కూకలును బొబ్బలును పెట్టి, యేడ్చి,
తలలు కొట్టుకొని, వానియందు వాస్తవముకాని అనేక గుణములను
చెప్పుకొనుచు, వానిని పొగడసాగిరి. ఫుల్లనీ వాకిట కూర్చుండి, తన
బట్ట చెంగుతో ముఖమును కప్పుకొని యేడ్చుచుండెను. ఆ సమ-
యమునందే ఒక మనుష్యుడు ఆ ఆవరణము లోనికి వచ్చెను. వాని
తలమీద కొన్ని నెరిసిన వెంట్రుకలు చూచితిని. వాని ముఖము
మిక్కిలి శాంతము కలదిగా కనుపించెను. ఇంతకు పూర్వము వానిని
నేను చూచి యుండలేదు గాని, వానిని చూడడముతోనే నా మన-
స్సులో వానియెడల సన్మానము కలిగినది. ఆ మనుష్యుడు ఫుల్లనీ
వద్దికి వెళ్లి, ఆమెతో మిక్కిలి దయగా మాటలాడసాగెను. మరియు
తన బట్టతోనే ఆమె కన్నీరును తుడిచివేయగా చూచితిని. అప్పుడు
నేను ఫుల్లనీ హెనిమిటి ఈయనే గదా అని అనుకొంటిని

ఇంటిలో ఇరుగు పొరుగువారందరును ఒకరితో నొకరు మాట-
లాడుకొనుచు, గొప్ప సందడి చేయుచుండిరి. అంతట ఈ మను-
ష్యుడు వారిని చూచి,—"నా అన్నదమ్ములారా! నా అక్క చెల్లెం-
డ్రా! మీరు ఇక్కడనుంచి వెళ్లిపోవడము యుక్తము. ఎందుకంటే,
మీరు ఇక మధువునకు ఏమియును సహాయము చేయజాలరు" అని శాం-
తముతో పలికెను. అప్పుడు ఆ జనులు అది విని వెళ్లి పోసాగిరి. వారు
వెళ్లుచు అనేక విధముల మాటలాడుకొనసాగా వింటిని. ఏమంటే,
ఒకడు—"మధువు, బాగ చదువువల్ల చచ్చిపోయినాడు" అని చెప్పెను.

మరియొకడు—"అలాగున కాదు, వాడు రోగము పుట్టగానే ముంతె-డు పెరుగు కొనుక్కొని తాగినాడు. అందువల్ల చచ్చిపోయినాడు" అని చెప్పెను. అంతట ఒక ముసలిది—"ఆ సంగతిని గురించి మీ కందరికి ఏమి తెలుసును? వైద్యుడు రోగముయొక్క వడిని అణచి-వేసినాడు కాని, ఆ దొరసాని ఇక్కడ ఉండడమువల్ల మంత్రించి-నాడు కాదు. గనుక దయ్యము వానిని పిసికి చంపినది" అని చెప్పె-ను. ఈ సంభాషణ అంతయు నేను విని,—"అయ్యరో! ఈ జను-లలో ఎన్ని వ్యర్థమైన తలంపులున్నవి. చచ్చిపోయిన తమ స్నేహి-తుని మనోవేదనను చూచినారే కాని, పరమందు వాని గతి ఏమై యుండునో అని యెవడును ఆలోచించక పోయెను" అని నా మన-స్సులో అనుకొంటిని.

ఆ జనులనందరను ఇంత మర్యాదగా పంపించివేసిన మనుష్యుడు పుల్లనీయొక్క పెనిమిటియే అని నాకు అప్పుడు తెలిసినది. కొంచెము సేపుటికి అతడు మధువుయొక్క మేనత్త కుమారులను ఇద్దరిని దగ్గర ఉంచుకొని, ఆ శవమును భూస్థాపన కొరకు సిద్ధముచేసెను. అప్పుడు నేను చూడగా, మధువు తల్లికి ద్రవ్యలోపము ఏమియు లేనందునను, మరి ఏ విధముచేతనైన వారికి నేను సహాయము చేయలేక పోయి-నందునను, నేను తిరిగి వత్తునని చెప్పి వెళ్లినాను. నేను ఇల్లు చేరి, ఈ యన్ని సంగతులను గురించి తలపోయగా, మరణమును గురించియు పరలోకమును గురించియు ఈ విధముగా ధ్యానించ నారంభించినా-ను ఏమంటే, ఒక బలము గల పడుచువాడు నా యెదుటనే చచ్చెను, వాడు దుర్మార్గుడు అయినప్పటికిని, దేవునివల్ల క్షమాపణ పొందకయే పరలోకమునకు వెళ్లినాడు. కాబట్టి అయ్యో! వాని ఆత్మకు గతి లేదు అనుకొంటిని. ఒక నరుని యాత్మ విడిపోవుటయనేది యెంత భయంకరమై గంభీరమైన సంగతియో [illegible] చెప్ప చాలను. అయితే అయ్యో! మనుష్యులు దేవుని యాజ్ఞను [illegible] పాపము చేసినను, దేవుడు కరుణ గలవాడు [illegible] [illegible]. తనను [illegible]

లోకములో మంచి పదము ఇచ్చునని అనుకొందురు. దేవుడు సాక్షాత్తుగా కరుణానముద్రుడు గనుక, తన స్వకీయమైన కుమారుడని వెనుకతీయక, ఆయనను మన అందరి కొరకు ఒప్పగించెను అనునది సత్యమేకాని, ఆయనయొక్క మితిలేని కృపను ఇహమందు అలక్ష్యముచేసి, తన పాపేచ్ఛలను తృప్తి పరచుకొనే వాని యెడల, దేవుడు పరమందు ఎంత మాత్రమును కనికరము చూపడు. ఈ సంగతిని గురించి ఆయన స్పష్టముగా నియమించిన ఆజ్ఞ ఏమంటే, 'దుష్టులును దేవుని మరచే జనులందరును నరకములో త్రోయబడుదురు' (కీర్తన. 9: 17.) మరియు 'కుమారుని విశ్వసించనివాడు జీవము చూడడు, దేవుని కోపము వాని మీద నిలుచును' (యోహాను. 3: 36.) అనునవే. దేవుడు పాపమును ద్వేషించుచున్నాడు గనుక, పాపమునుంచి మనుష్యునకు విడుదల కలిగేలాగున, ఆయన ఒక మార్గము నేర్పరచి యున్నాడు. అయితే అతని ప్రేమగల పిలుపును విసర్జించే వాడు, అతని యుగ్రతకు లోనగును.

అయ్యో! దేవుని యొక్కయు ఆయన అభిషేకించిన కుమారుని యొక్కయు నుగ్రతకు లోనైనవాడు, రాబోవు స్థితిలో శ్రమయందు ఎంతగా మునిగి యుండును! అయినప్పటికిని, క్రీస్తు నామము ధరించినవారై యుండియు, ఈ గంభీరమైన సంగతిని గురించి బొత్తిగా ఆలోచింపనివారు అనేకులు కలరు. రోగులకే కాని ఆరోగులకు వైద్యుడు అక్కరలేదు. అయినప్పటికిని, చాల తరబడి మనుష్యులు పాపమనే రోగముచేత పీడితులై యుండియు, స్వస్థముగానే ఉన్నామని అనుకొని, తమ రోగమును కుదర్చ కలిగిన గొప్ప వైద్యుని యొద్దకి వెళ్లరు. కొందరు ఈ చొప్పున మంద బుద్ధిచేతను బాధించుచున్నారు. మనము చాలా కాలము లోకములో బ్రతుకుదుము గనుక, ఇప్పుడప్పుడే పశ్చాత్తాపము ఏమియు అక్కరలేదు అందురు. ఫెలిక్సు వీలాగునప్పుడు, అలాగునపుడే పిలుతును తమకు తగిన

సమయము దొరకగానే, మత సంగతులను తలపెట్టుదుమని నిశ్చయిం-
తురు గాని, ఆ తగిన సమయము రాకముందే మరణము వారికి తట-
స్థించును. అయ్యో! ఈలాగు జాగు చేయుట కేవలము వెఱ్ఱి పని.
లోక వ్యవహారముల విషయమై ఇటువంటి వెఱ్ఱిని ఎవడును కను-
పరచడు. వైశాఖ మాసము రావడముతోనే రయితు పొలము దున్ని,
వెదవేయసాగును. వెదవేయుటకైన యుక్తకాలము దాటనిచ్చే వెఱ్ఱి-
వారు లోకములో అరుదుగా నున్నారు. అయితే కృపా దినముగడిచి
పోవుచుండగా, మనుష్యులు నిర్భయముచేతను, అశ్రద్ధచేతను తమ
విలువలేని ఆత్మలను చెడగొట్టుకొనుచున్నారు! మధువు ఏలాగుననో,
ఆలాగుననే దేవుని సువార్తను బాగుగా గుర్తెరిగియు, దానిని అవలం-
బించని మరి కొందరు ఉన్నారు. వారు పాపము చెడ్డదని బాగుగా
తెలుసుకొనినప్పటికిని, పాపమునే చేయుదురు. క్రీస్తువద్దికి వెళ్లడము-
వల్ల క్షమాపణ పొందవచ్చునని వారికి తెలిసినప్పటికిని, వారు ఆయన
యొద్దకు వెళ్లరు. నరకము వారి యెదుట నున్నది. అయితే వారు
దానిని చూచియు, చూడనట్టుగానే యుందురు. ఈ చొప్పున చివరకు
నాశనము వారికి అకస్మీకముగా సంభవించును. యేసుక్రీస్తుయొక్క
సువార్త నలక్ష్యము చేయడముకంటె ఎక్కువ దుఃఖకరమైన దో-
షములేదు. అయితే అయ్యో! అనుదినమును ఈ పాపముచేసే మను-
ష్యులు ఎందరో యున్నారు. "తన యజమానుని చిత్తము నెరిగి యుం-
'డియు, సిద్ధపడక, అతని చిత్తముచొప్పున జరిగించకయుండే దాసునికి
'అనేకములైన దెబ్బలు తగులును; తెలియక, దెబ్బలకు తగిన వాటిని
చేసినవానికి కొన్ని దెబ్బలు తగులును; ఎవనికి ఎక్కువగా నియ్య-
'బడెనో, వాని యొద్ద ఎక్కువ అడుగబడును" (లూకా. 12:47,48.)
హా! జనులు బుద్ధి కలిగి, ఈ సంగతులను గ్రహింపులోనికి తెచ్చుకొని,
తమ అంత్యకాలమును ఆలోచించుకొందురుగాక! అప్పుడు వారు
ఇహమందును పరమందును చాలా సుఖము పొందుదురు.



## ౪. అధ్యాయము.

మధువును పూడ్చిపెట్టిన రెండు దినములకు, నేను మాట ఇచ్చిన ప్రకారము అతని తల్లి యింటికి తిరిగి వెళ్లినాను. ఈ పర్యాయము దేవుని కృపవల్ల ఈ దిక్కులేని జనులకు కొంత సహాయము చేయగలిగినందుకు నేను నిండ సంతోషించితిని. నేను అక్కడికి వెళ్లినప్పుడు రాణి ప్రసవ వేదనతో మిక్కిలి బాధపడుచుండెనని కనుగొంటిని. దాని అత్త నన్ను చూడగానే,—"నా కోడలు ఈ వేదనచేతను ఒక రాత్రియు ఒక పగలును కష్టపడుచున్నది, అయినప్పటికిని, అది ప్రసవమయ్యే చిహ్న ఇంక నేమియును కనుపడకయున్నది" అని పలికెను. రాణి పెనిమిటి చచ్చినప్పుడు స్త్రీలు ఎంత సందడి చేసిరో, ఇప్పుడును వారు అంత సందడి చేయుచుండిరి; ముఖ్యముగా పది పండ్రెండుమంది స్త్రీలు వచ్చి రాణిచుట్టును నిలుచుండిరి. ఒకతె ఒకటి చెప్పితే, మరియొకతె ఇంకొకటి చెప్పెను. రాణితో "నీవు కింద కూర్చుండుమని" ఒకతె అనెను. మరియొకతె "వద్దు, వద్దు, నీవు నడుచుచుండవలసినది" అని పలికెను. ఇంకొకతె, ఎవరో ఒక తెలివి తక్కువ ముసలిదాని దగ్గరనుంచి తెచ్చిన కొంచెము మందు దానికి ఇచ్చెను. ఈ వ్యర్థమైన క్రియలవల్ల శిశువు మరింత శీఘ్రముగా పుట్టక పోవడమే కాకుండా, దాని పుట్టుకకు ఆటంకమాయెను. ఇంతేకాకుండా, రాణియొక్క శ్రమలు మరింత ఎక్కువాయెను. ఇదిగాక మరియొకసంగతినిపట్టి నేను మిక్కిలి దుఃఖించినాను. ఈ మనుష్యు లందరును పేరుకు మాత్రము క్రీస్తుమతస్థులై యున్నారుగాని, వారిలో మూఢభక్తి విస్తారముగా నున్నదని తెలుసుకొంటిని. మూఢభక్తియంటే నా తాత్పర్యము చెప్పెదను. ఏదయిన ఒక పని చేయబోవునప్పుడు, ఎవరయిన తుమ్మితే ఆ పని అప్పటిలో చేయకుండేవారు అనేకులు కలరు. ఎవ్వరయిన

ప్రయాణము కట్టుకొని బయిలుదేరే సమయమునందు, బల్లికూతను వింటే, వారు ఆ వేళకు ప్రయాణము మానుకొందురు. వారు తెల్లవారి లేవగానే కోతిని చూడరు. సరేకదా, దాని పేరు కూడ ఉచ్చరించరు. చంద్ర గ్రహణము పట్టినప్పుడు, వారు ఏ పనియు చేయరు. వారు అశక్తములో నున్నప్పుడు మెడ చుట్టును మంత్రించిన రక్షను కట్టుకొందురు. ఈ అక్కరకు రానివాడుకలు మధువుయొక్క ఇరుగు పొరుగువారిలో మాత్రమే కాకుండా, అనేక క్రీస్తు మతస్థులలో కూడ బలముగా నున్నవి. "హా! పరిశుద్ధాత్మా! ఇటువంటి మూఢ భక్తి ‘యావత్తును వెఱ్ఱి యాజ్ఞలన్నియు సైతానుయొక్క తంత్రములే" అని తెలివిలేని ఈ జనులు గ్రహించేటట్టును, వాటిని విసర్జించుటకు శక్తి కలవారయ్యేటట్టును, వీరి మనో నేత్రములను ప్రకాశింప చేయుము.

రెండు మూడు నెలలక్రిందటనే, రాణి తన అత్తను చూచి,—"ఈ ‘రాత్రి యొక గుడ్లగూబ నా తలమీదుగా యెగురుచు కూసినది" అని చెప్పియుండెను. ఆ కథ దాని అత్త అప్పుడు జ్ఞాపకము చేసుకొని,— "అలాగున అయితే, ఆ పక్షి తిరిగి వచ్చినంగాని, యిది ప్రసవము ‘కానేరదని" చెప్పెను. ఇందుకు అక్కడి స్త్రీలు అందరును హర్షించిరి. అయితే ఒక ముసలిది మాత్రము అందుకు సమ్మతించక,— "ఆ గుడ్ల‘గూబవల్ల హాని సంభవించునని నాకు తోచదు, ఎందుకంటే ఒకనాడు ‘ఆరు ఏడుగురు స్త్రీలతో కూడ నేను ఆవరణములో కూర్చుండి యుం‘టిని, అప్పుడు మా తలల మీదుగా ఒక గుడ్లగూబ యెగిరి పోయినది. ‘ఆ సమయములో నా చెలియలికి తొమ్మిదవ మాసము గర్భము గనుక, ‘మేమందరమును దాని విషయమై చాలా విచారపడితిమి, అయితే ‘దానికి ఏ కీడును సంభవించక పోవడమే కాకుండా, ఆ పక్షి యెగిరి ‘పోయిన కొన్ని దినములకు, ఆ చిన్నది ఒక గంటసేపు శ్రమపడి ‘కొడుకును కనెను" అని చెప్పగా, విని ఇంకొక స్త్రీ, "ఆ మాటను

నేను బొత్తుగా నమ్మను. ఆ పక్షి తిరిగి వచ్చినంగాని, ప్రసవ వేదన-లో నుండే స్త్రీ కనచాలదని, ప్రతి స్త్రీకిని తెలుసును. ఆ పక్షి వచ్చే యుండును, అయితే ఆ సంగతి నీవు కనిపెట్టలేదు కాబోలును" అని పలికితే, మొదట మాటలాడిన స్త్రీ "లేదు, లేదు, అది తిరిగి రాలేదు. మాకు కన్నులు లేవా? ఇదిగాక ఆ పిల్ల పగలు రెండు జాములకు పుట్టినది. అప్పుడు గుడ్లగూబలు తిరుగుచుండునా? అయితే రాణి-యొక్క ప్రసవమును గురించిన అంకిలి నేను విప్పి చెప్పగలను. కొన్ని దినముల క్రిందట అది పారిపోయినప్పుడు, కాశీపురములో ఒక ముస-లిదాని ఇంటిలో నుండగా, ఆ ముసలిది యేదో యొక మంత్రము ప్ర-యోగించి, రాణికి నిద్ర వచ్చేటట్టు చేసి, దాని నగలన్నియును తీసు-కొనెను. ఆ మంత్రకట్టు లేకపోతే రాణి మేలుకొనేదే. కాబట్టి నాకు ఆ స్త్రీ మంత్రకత్తె అనియు, రాణి ప్రసవించకుండా అది యేదో చేసేయుండుననియు తోచుచున్నది" అని చెప్పెను. ఈ సంగతి ఇం-దాకా చెప్పినదానికంటె మిక్కిలి ఆశ్చర్యమైనది గనుక, అక్కడ నున్న స్త్రీలు అందరును "అవును, అవును, ఈలాగుననే వాస్తవమై యుండవచ్చును," అని చెప్పసాగిరి.

మధువుయొక్క తల్లి అప్పటప్పటికి, "అయ్యో! నా కుమారుని పిల్లను నేను ఎప్పటికైన రొమ్మున అద్దుకొందునా?" అని చెప్పుచు వచ్చెను. అయితే దాని కోడలి గతి యేమగునో యని యది యెం-తో అక్కరపట్టి యున్నట్టు కనుపడలేదు. చివరకు అత్త ఇరుగు పొ-రుగువారి సంభాషణను విని, తన కోడలిని తాను కనుపెట్టకపోతే, అది పిల్లతో కూడనే బొత్తుగా నశించి పోవునని అనుకొనెను. గనుక, ఆ మంత్రకత్తెయొక్క సంగతిని విని, "నేను కాశీపురమునకు ఒక మనుష్యుని పంపించి, ఆ ముసలిదానిని కనుగొని, దానిని తన మంత్ర-కట్టును విప్పి వేయుమలసినదని బతిమాలుకొందును" అని చెప్పగా, రాణి ఆ మాట వినడముతోనే భయపడి, నన్ను చూచి, "హా! అత్త

'గారూ! ఈ అవసరములో నాకు ఇయ్యవలసిన మందు మీరు ఏమియు
'ఎరుగరా? కాళీపురము ఇక్కడికి రెండు దినముల ప్రయాణములో
'నున్నది, అక్కడికి ఒక మనుష్యుడు వెళ్లి వచ్చినదాక నేను బ్రతుక
'లేను. మరియు హా! నా అమ్మా! నాకు ఇకను మంత్రించిన ద్రావక-
'ములును మందులును ఇయ్యవద్దని దయచేసి వారితో చెప్పండి, ఎందు-
'కనిన ఈ మందులే నన్ను బాధ పెట్టుచున్నవి. ఇదిగాక ఇంక
'వాటిని పుచ్చుకోలేను" అని చెప్పితే, ఇది విని ఆ స్త్రీలలో ఒకతె
"అలాగున వద్దు, అమ్మా! నీవు ఈ ద్రావకములను మందులను ఇంక-
'పుచ్చుకొన నక్కరలేదు" అని చెప్పెను. వాటివల్ల ప్రయోజనము
'లేదని నాకు కనుపడుచున్నది. అప్పుడు నేను, "ఇటువంటి వ్యర్థమైన
'క్రియలవల్ల నెవరికి నేమి ప్రయోజనము కలుగును? ఈ ప్రకారము
'చేయడముకంటె, మీరు ఈ రాణికి తినుటకు ఏమైన నిస్తిరట్టాయె-
'నా, అప్పుడు అంతయును బాగుగా నుండునని నాకు తోచుచు-
'న్నది" అనిన దాని అత్త "మంచిది, మంచిది, దాని తిండిని గురించి
'ఆ వెనుక మాటలాడుదము. ముందుగా దీని నాకు పిల్లను ఇయ్య-
'నియ్యుడి" అనెను. ఈ ముసలిది ఈ చొప్పున మాటలాడగా, నేను
విని మిక్కిలి కోపపడి,—"నీవు మిక్కిలి చెడ్డదానవు, అవివేకివి: నీ
'కోడలి ముఖము చూడుము; అది శీఘ్రముగా మూర్ఛిల్లును, అప్పుడు
'నీకు పిల్ల యెక్కడనుంచి వచ్చును!" అని పలికి, ఇరుగు పొరుగువారిని
చూచి, "మీలో నెవరైన ఈ చిన్నదానికి కొంచెము చేపల చారు
'తినుకొని వచ్చి ఇస్తే, దీనికి చాలా ఉపయోగించును" అని చెప్పిన,
ఆ మాట విని, యొక పడుచు స్త్రీ ఆ చారు తెచ్చుటకు తన యింటికి
పరుగెత్తుకొని వెళ్లెను. అయితే ముసలి స్త్రీలు అందరును తమ తమ
తలలు ఆడించి, "ఈ చొప్పున జరిగించడము ఇంగ్లీషు దొరసానులకు
'సరిపడి యుండునుగాని, బంగాళీ స్త్రీలకు వారి ఆచారమే ఉత్తమ
'ము. ప్రసవ వేదనలో నుండే స్త్రీ చాల భాగము కేవలము మరణ
'పొందునే" అనిరి.

అప్పుడే ఆ పనిచు స్త్రీ చారు పట్టుకొని తిరిగి వచ్చినది. అంతట నేను ఆ గిన్నె తీసుకొని రాణికి తాగనిచ్చితిని. అది యంతయు తాగి, "అమ్మా! దీనివల్ల నాకు బలము వచ్చినది. ఇప్పుడు వీరు నన్ను కొంచెము సేపు మాత్రము పరుండనిస్తే, ప్రసవము కావడమునకు అనుకూలమగునని నాకు తోచుచున్నది" అని చెప్పెను. ఈ బుద్ధి హీనులైన స్త్రీలు ఈ చిన్నదానిని మూడు గంటల కాలము మోకాళ్లమీద నుంచిరి. అందువల్ల ఇది చాలా ఆయాసపడి బొత్తిగా బలములేనిదాయెను. ఇది చూచి నేను మంత్రసానితో—"దీనిని కొంచెము సేపు పరుండనిచ్చుటవల్ల నేమి హాని? ఇంగ్లండు దేశములో స్త్రీలు అందరును పరుండే ప్రసవము అగుదురు" అంటిని. మంత్రసాని ఈ మాట విని,—"ఇంగ్లీషు దొరసానులకును బంగాలీ స్త్రీలకును చాలా భేదము కలదు. ఇంగ్లీషువారివిధముగా దీనిని ప్రసవింప చేయడమునకు మీరు వచ్చియుంటే, ఆలాగుననే చేయుండి. మెట్టుకు మేలు సంభవించిన, కీడు సంభవించిన, దానికి నేను ఉత్తరవాదిని కాను" అని కొంచెము కోపముగా పలికినప్పుడు, నేను, "ఆలాగుననే కానిమ్ము. ఇటువంటి సమయములో చేయవలసినది యేమో నాకు బాగుగా తెలుసును గనుక, దేవుని కృపవల్ల ఈ చిన్నదానికి ఏ కీడును సంభవించదు" అని చెప్పి, రాణిని దాని రొమ్ము పక్కను పరుండపెట్టి, ఒక గంటలోగానే మూడు నాలుగు పర్యాయములు దానికి కొంచెము వెచ్చని పాలు తాగనిచ్చితిని. తరువాత దాని నడుము చుట్టును మంత్రసాని ఒక బట్ట గట్టిగా కట్టినట్టు నేను చూచి, వెంటనే ఆ బట్టను విప్పి వేసినాను. అది అక్కడనున్న స్త్రీలందరును చూచి, నాతో "ఇది బొత్తిగా పనికి రాదు. పిల్ల వెనుకకు పోవును," అని చెప్పసాగిరి. అయితే రాణి,—"లేదు, లేదు, ఈ దొరసానికి అది యంతయు తెలుసును. ఈమె ఇష్టము వచ్చినట్టు చేయనియ్యుడి" అని పలికెను. ఇది జరిగిన కొంత సేపటికి ప్రసవము సమీపించినదని వారికందరికిని తెలిసినది. అప్పుడు మంత్రసాని, తాను కొంత కీర్తిని పొందవలెనని, "హా! అమ్మగారూ!

'మీరు నాకు సెలవు ఇస్తే, ఒక క్షణములో ఈ చిన్నదానిని ప్రస-
'వమయ్యేలాగున చేయగలుగుదును" అనెను. అయితే నేను అందుకు,—
"లేదు, లేదు, నీవు ఈ చిన్నదానిని ముమ్మారు అవమానపరచి, దీనికి
'బాధను మాత్రము మరింత చేసినావు. దీని జోలికి రావద్దు. దేవుడే
'దీనికి సహాయము చేయును" అని చెప్పి ముగించగానే, రాణి ఒక
బ్రతికి యుండే ఆడ పిల్లను కనినది. అది నేను చూచి, మిక్కిలి
ఆశ్చర్యము పొందినాను. ఎందుకనిన, అక్కడ నున్న స్త్రీలు అందరును
అడ్డము వచ్చి, రాణిని నిండ బాధించినారు గనుక, దాని పిల్ల నిశ్చ-
యముగా చచ్చి పుట్టునని అనుకొంటిని. బంగాలీ స్త్రీల పిల్లలు, మంత్ర-
సానుల అజ్ఞానముచేతను, పుట్టకముందే తరుచుగా చావడము కలదు.
ఇది నేను కన్నులారా చూచి యున్నాను. అది యేలాగుననైన నుం-
డనిమ్ము. మెట్టుకు దేవుడు రాణిని కనికరించి, దానికి ఒక బ్రతికి
యుండే పిల్లను దయచేసెను. ఆ శిశువు పుట్టిన తరువాత అందరును
నన్ను పొగడి నాకు వందనము చేయసాగిరి. అంతట రాణియొక్క
అత్త తన కొడుకుయొక్క పసిపిల్లను చేతులలోనికి తీసుకొని, తన
కొడుకును తలుచుకొని యేడ్వసాగెను. అంతట అది నన్ను చూచి,
"అమ్మా! మీరే మాకు తల్లి దండ్రులు, మీరే మాకు రక్షకులు," అని
చెప్పెను. అందుకు నేను ఆమెతో "అలాగున కాదు; దేవుడు తన
'అత్యంత కృపవల్ల నీ కోడలిని దాని నొప్పులలోనుంచి విడిపించి,
'దానికి ఈ పిల్లను దయచేసినాడు గనుక, ఆయన పేరును స్తుతించు-
'ము" అని చెప్పితిని.

అప్పుడు నేను—స్త్రీలలో ముఖ్యముగా శకునములను పట్టిన వెర్రి
మాయలును మూఢ భక్తియు ప్రబలముగా నున్నది గనుక ఇక్కడ-
నున్న ఈ స్త్రీలకు వాటినిగురించి కొంత బోధ చేసితే బాగుగా నుం-
డునని నా మనస్సులో అనుకొని, వారిని చూచి, అనిన మాట:—
"చూడుండి! మీరు క్రీస్తు మతమును గైకొని యున్నారు గనుక,
'విగ్రహారాధకులు తలపెట్టే నంగతులయొదల శ్రద్ధ నుంచ కూడదు.

‘ముఖ్యముగా మంచి చెడ్డ శకునములను గుఱించి ఈ కనిపెట్టడమం-
‘తయు దేవుని అవమానించుటకై యున్నది. దేవుడు సర్వ శక్తు-
‘డనియు, మన ప్రాణములు ఆయన చేతిలో నున్నవనియు, ఆయన
‘సెలవు లేనిది మనము ఎవరము హాని పొంద జాలమనియు మీరు
‘ఒప్పుకొని యున్న పక్షమందు, ఒక పక్షి గర్భిణీ స్త్రీయొక్క తల-
‘మీదనుంచి యెగిరిపోయినందుకు, మీరు ఎందుకు ఇంత భయపడు-
‘చున్నారు? ఒక గుడ్లగూబ దాని తలమీద నుంచి యెగిరి పోయినది
‘గనుక, అది ప్రసవము కాచాలదనియు, తల్లియు బిడ్డయు నశింతు-
‘రనియు చెప్పితిరి. ఈ చొప్పున ఆ గుడ్లగూబ, ఒక మార్గముగా
‘యెగిరి పోయినందువల్ల మనుష్యులను చంపగలది గనుకను, అది తిరిగి
‘ఆ మార్గముగానే యెగిరి రావడమువల్ల వారి ప్రాణములను రక్షించ-
‘గలది గనుకను, అదే మీ దేవుడై యుండవలెను గదా! మరియు
‘మీలో ఒకతె కాళీపురములో నుండే యొక మంత్రకత్తె మూలముగా
‘రాణి చచ్చునని చెప్పినది. అయ్యయో! దేవుడు తన సేవకుల ప్రాణ-
‘ములను దుర్మార్గుల చేతిలోనికి ఒప్పగించి యున్నాడా? ఇటువంటి
‘చెడ్డ తలంపు నుంచకుడీ. ప్రభువు శక్తి గల దేవుడై యున్నాడు
‘గనుక, దయ్యమే కాని, భూతమే కాని, మనుష్యుడే కాని, మృగమే
‘కాని, పక్షియే కాని, దేవునికంటె అధికమనియు, లేక శక్తి కలద-
‘నియు, లేక ఆయన లక్షణములు దానికి కలవనియు, ఎవరైన చెప్పే
‘పక్షమందు, ఆ మనుష్యుని దోషము గొప్పదిగా నుండును. దేవుడు
‘క్రీస్తు మతస్థులకు విశేషించి తండ్రియై యుండగా, ఒక పిల్లకు యేది-
‘యైన నొక బాధ సంభవించగానే, ఆ పిల్లవాడు దానిని తన దయగల
‘తండ్రికి తెలుపక, ఒక అన్యుని వద్దికి వెళ్లి సహాయము కోరుట
‘ఎటువంటిదో, ఇది అటువంటిదే. ఇప్పుడు చెప్పిన తండ్రి ఆ
‘పక్షమందు చాలా అవమానము పొంది దుఃఖించక నుండదు
‘గదా. అలాగునవానే మీరందరు తండ్రులలో దేవుడు ఉత్తముడైన
‘తండ్రియని తెలుసుకొనియు, ఆయనను విడిచిపెట్టి, ఆయనవల్ల

'సృజింపబడిన మరి దేనికైన భయపడి, సేవ చేసితే, దేవుని కోపము
'మీ మీద రవులుకొనుననుటకు సందేహము ఏమియు లేదు. ఇంకొక
'మాట. ఈ శకునములను కనుపెట్టి తిరిగేవారు వేల తరబడిగా పొర-
'బాటున పడుచుందురు. చూడుండి! అందుకు నేటి దినము మీకు
'రెండు దృష్టాంతములు కలిగినవి. మీలో నొకతె తన సహోదరి-
'మీదనుంచి గుడ్లగూబ యెగిరి పోయినప్పటికి, అది సురక్షితముగా
'ప్రసవమైనదని చెప్పెను. అలాగుననే రాణికూడ ఆ గుడ్లగూబ తిరిగి
'రాకుండానే సురక్షితముగా ప్రసవించెను. ఈ దృష్టాంతములుగాక,
'ఈ సంగతిని గురించి నా విషయము జరిగిన యొక సంగతి చెప్పెదను.
'నా మొదటి పిల్ల పుట్టక ముందు, కాలము మిక్కిలి వేండ్రముగా
'నుండినందున, రాత్రి అంతయు నాకు బాగుగా నిద్ర పట్టక పోయెను.
'అప్పుడు నేను కిటికీవద్ద పరుండుటకు ఒక మంచము వేయించినప్పు-
'టికి, కొంచెము తక్కువగా రాత్రి అంతయు మేలుకొని యుంటిని.
'ప్రతి రాత్రియు నొక గుడ్లగూబ వచ్చి, కిటికీ అకుల మీద కూర్చుం-
'డుచు వచ్చెను. ఆ అకులు మూసి యున్నప్పుడు, వాటిని నేను విప్పి-
'నదాక, ఆ పక్షి బయట కూర్చుండి కూయుచుండెను. అయినప్పు-
'టికి నాకైన, నా పిల్లకైన, నేమియు హాని సంభవించలేదు. ఇది కేవ-
'లము సత్యమని నేను రూఢిగా పలుకగలను. కాబట్టి ఈ సంగ-
'తులను తెలుసుకొనియు, ఒక గుడ్లగూబకే కాని, ఒక చెడ్డ శకున-
'మునకే కాని, భయపడేవారు మిక్కిలి బుద్ధి హీనులును పామరులునై
'యున్నారు. గనుక, ఇంత బుద్ధి హీనులుగా నుండక, ఈ వ్యర్థ-
'మైన సంగతులనన్నిటినిని రోసి, దేవునికి మాత్రమే భయపడి, ఆయ-
'నయందు మాత్రమే మీ నమ్మికనుంచుండని నేను మిమ్ములను బతి-
'మాలుకొనుచున్నాను" అని ఆ స్త్రీలకు నేను ఉపదేశించి, సెలవు
పుచ్చుకొని, "భద్రముగా నుండుండి. ప్రసవమయ్యే ఇంటిలో
'ఇనుమునే కాని, చెప్పునే కాని, చీపురునే కాని, వ్రేలాడకట్టి
'యుండవలయు నన్ను తిరిగి యెన్నటికిని చూడవచ్చునపుడు, [illegible]

'ములకు భయపడకుడి. అయితే రాణిని దాని పిల్లను జాగ్ర-త్తగా చూడుండి," అని నవ్వుచు చెప్పితిని.

నేను ఇంటికి వెళ్లుచుండేటప్పుడు, ఒక చక్కని చిన్న పూరి యింటి దరిని వెళ్లుచు, రోమాసులో ఆరవ పర్వమును ఒక పిల్ల చదువగా స్పష్టముగా వింటిని. నాకు దేవుని వాక్యమందు నిత్యము ప్రేమ కలదు. మరియు ఆ చిన్న పిల్లయొక్క మృదుస్వరము నా చెవికి మిక్కిలి ఆనందముగా నుండెను గనుక, తక్షణమే ఆ యింటి తలుపు కొంచెము తీసి, లోపలికి రా వచ్చునా అని అడిగితిని. లోపల నున్నవారిలో నెవరో ఒకరు—దయచేసి రండి అని ఉత్తరము ఇయ్య-గానే, నేను లోపలికి వెళ్లి, ఒక మిక్కిలి ముసలిస్త్రీని చూచితిని. దాని వెండ్రుకలు బొత్తుగా నెరిసియుండెను. మరియు నది మిక్కిలి బలహీనముగా నున్నట్టు అగుపడెను. అది నన్ను చూడగానే, లేచి, సలాము చేసి, "అమ్మా! నాతో మీకు ఏమైన పని యున్నదా?" అని యడిగినది. అందుకు నేను "లేదు, విశేషముగా పనియుండి రాలేదు. 'అయితే బైబిలు పుస్తకమును చదివిన ధ్వని నాకు బైట వినుపించెను 'గనుక, ఈ యింటిలో ప్రవేశించితే, దేవునికి భయపడే కొంతమందిని 'కలుసుకొందుననియు, నా ప్రియుమైన రక్షకుని గురించి వారితో 'సంభాషణ కలుగుననియు ననుకొంటిని" అని చెప్పితిని. ఆ ముస-లిది ఇది విని,—"అలాగునసైతే, దయచేసి కూర్చుండుండి. ఎందుకంటే 'బైబిలులో, 'అన్యులకు ఆతిథ్యము చేయుట మరువకండి, దానివల్ల 'కొందరు తెలియక దేవదూతలకు ఆతిథ్యము చేసిరి' (హెబ్రీ. 13: 2.) 'అని వ్రాసియున్నది" అని చెప్పెను.

ఇటువంటి మంచి దయగల మాటలను ఒక బీదయింగాలీ స్త్రీ పలుకగా నేను వినినప్పుడు,— ఈ మర్యాద వాస్తవముగా క్రీస్తుమత ఫలమై యున్నది. ఎందుకనిన ఏ దేశమైతేనేమి, అందులో నెవ-రైన నిజముగా ఆ మతమును పుచ్చుకొందురో, వారు అంతకు ముందు ఎంత మోటుగాను అజ్ఞానముగా నుండినప్పటికి, ఆ మత-

మువల్ల ప్రేమయు దయయు మర్యాదయు కలవారు అగుట ఆ మతమునకు ఒక లక్షణమై యున్నది అని నా మనస్సులో అనుకొంటిని.

నేను ఆ యింటిలో ప్రవేశించగానే; బైబిలును చదువుచుండిన చిన్నది ఆ పుస్తకమును శీఘ్రముగా క్రింద ఉంచి, పరుగెత్తుకొని పోయెను గనుక, అది యెవరైనది మొదట నేను ఆనవాలు పట్టలేక పోతిని గాని, అది ఒక కురిచి మోసుకొని తిరిగి వచ్చిన తరువాత చూచితే, ఆ చిన్నది ఫ్లున్ని కుమార్తెయైన సత్యవతి యని కనుగొంటిని. ఆ ముసలిదాని యింటిలో కురిచి లేనందున, ఆ చిన్నది దాని స్వంత ఇంటిలోనికి పరుగెత్తుకొని పోయి, నేను పూర్వము చెప్పియున్న ఆ పాత కురిచీని నా కొరకు తెచ్చినది. అప్పుడు నేను దానిని చూచి,—"సత్యవతీ! బైబిలు పుస్తకమును ఈ ముసలిదానికి 'నీవు చదివి వినిపించుట మిక్కిలి మంచిపని. అందుకు నేను నిండ 'సంతోషించుచున్నాను" అని చెప్పినప్పుడు, సత్యవతి యీ మెప్పు మాటలు విని,—"అమ్మా! మా అవ్వయైన ఈ ప్యారీకి ఇప్పుడు 'కన్నులు బాగుగా కనుపించవు గనుక, నేను అప్పుడప్పుడు ఈమెకు 'బైబిలు చదివి వినుపించేది. అటకంటె నాకు చదువే ఇష్టము" అని డంబము రవంతలేక పలికెను. అప్పుడు ప్యారీ అనిన మాట;—"అవును, 'అమ్మా! సత్యవతి మిక్కిలి మంచి చిన్నది. అది నా కొరకు చేసే యావ-'త్తునకును ప్రతిగా దేవుడే దానిని బహు కనికరించవలెను. అమ్మా! 'ఏలినవారు ప్రవర్తించినట్టు, దీని తల్లి ప్రభువుయొక్క సమస్తాజ్ఞల 'యందును నిబంధనలయందును నిర్దోషిగా నడుచుకొనుచు, దేవుని 'దృష్టికి నీతి పరురాలై యున్నది; బిడలను కనుపెట్టేవారు శుభవం-'తులు అను ఈ మంచి బోధ అది తన పిల్లకు నేర్పుచున్నది" అనెను. నేను ఆ ముసలిదానికి కలిగ్గి యుండిన వేద వాక్య పరిచయము చూచి ఆశ్చర్యము పొందినాను. అయితే తరువాత దానితో నేను అనేకపర్యాయములు సంభాషించిన పిమ్మట, ప్యారీ చెప్పిని వాక్యమును అన్నాహారములనుగా చూచుకొని, దాని గురించి రాత్రిదాను భగవంతుని ప్రా-

'బుద్ధి పూర్వకముగానే కాకుండ, హృదయ పూర్వకముగాను
'నమ్ముచున్నానని నాకు రూఢిగా తెలియును. గనుక నేను ఆయనను
'నా హృదయములోనికి చేర్చుకొనినందున, ఆయన వాక్యములవల్ల
'నిరంతరమును రక్షించబడుచున్నాను. హా! అమ్మగారూ! ఈ చిన్న
'యింటిలో నేను ఒంటరినిగా కూర్చుండియుండే సమయములలో
'నా ప్రియుడైన రక్షకుడు నాతో కూడ నుండకపోతే, నా శ్రమ
'యెంతో మిక్కుటముగా నుండును! అయితే ఆయన నన్ను ఎన్నటికిని
'వదిలి పెట్టడు. మరియు నేను ఆయనతో ఎల్లప్పుడును సహవా-
సము చేయుచుండగలను. కాబట్టి సుఖము వచ్చిన, దుఃఖము వచ్చి-
'న, నా ఆత్మలో నిత్యమును నెమ్మదియు సంతోషము నుండును"
అని పలికెను.

నేను అది విని, "ప్యారీ! అలాగునైతే, నిన్ను తరుచుగా
'చూడవత్తును, ఎందుకంటే క్రీస్తునందు మనము ఇద్దరము అక్క-
'చెల్లెండ్రవంటివారమనియు, చచ్చిన తరువాతను మనము ఏక మోక్ష-
'మునందే ఏలెదుమనియు నేను ఎరుగుదును" అని చెప్పి, "ప్యారీ! నీవు
'దారిద్ర్యముచేత మిక్కిలి బాధపడుచున్నావని నాకు తోచుచు-
'న్నది. నీకు ఎవరైన బంధువులున్నారా?" అని అడిగితిని. అందుకు అది
'నాకు ఇట్లనెను;—"లేదు అమ్మా! అది అలాగున కాదు. నాకు స్వంత-
'మైన బంధువులు ఎవరును లేరనే మాట సత్యమేకాని కలకత్తాలో
'ఒక దొర యున్నాడు, ఆయన నాకు ఈ చిన్న యిల్లు కట్టించి ఇచ్చి-
'నాడు. ఆయనే నాకు నెలకు మూడు రూపాయీలు పంపుచుండును.
'ఆయనకు చిన్నప్పుడు పాలు ఇచ్చినాను. నా స్వగ్రామము ఇక్క-
'డికి దూరముగా నున్నది. అయితే నేను ఇక్కడికి వచ్చిన విధము
'మీకు తెలియ చెప్పెదను. నేటికి దాదాపు ఏబదిరెండు సంవత్సర-
'ముల క్రిందట, నా స్వదేశమును విడిచి వచ్చి, కలకత్తాయందు ఒక జాతి
'కుటుంబములో దాదిగా ప్రవేశించినాను. ఆ కుటుంబమందు
'ఒక మిక్కిలి భక్తిగలదైన దొరసాని యుండెను. ఆమె క్రీస్తు మత

'మును గురించి నాకు నిండ మంచి బోధ చేసెను. అందువల్ల నేను
'క్రమముగా క్రీస్తుమతము నిజమని ఒప్పుకొంటిని. అయితే అప్ప-
'టిలో ఈ సంగతి హిందువులయెదుట తెలియచేయుటకును, నా
'కులమును విడిచిపెట్టుటకును నాకు చాలా సిగ్గుగా నుండెను. ఈలాగున
'నుండగా, నేను పాలు ఇచ్చిన పిల్లకు సంవత్సరమున్నర ఈడు రాగానే,
'నా దొరసాని నాతో ఓ దాయీ! నా చిన్నవాడు ఎదుగుచున్నాడు
'గనుక, వచ్చే నెలలో నీకు సెలవు ఇచ్చివేయుదునని చెప్పినమీదట,
'నేను వెళ్లి పోవలసి యున్నదని మిక్కిలి దుఃఖపడ్డాను. ఎందుకంటే,
'నేను నా పెంపుడు బిడ్డను మిక్కిలి స్నేహించితిని. అది మొదలు-
'కొని ఆ చిన్నవాని దగ్గర దినమంతయు నుండి, అతనితో ఆడుకొనుచు
'అతనికి బొమ్మలను చూపించుచు నుంటిని గనుక, ఆ చిన్నవానియెడల
'నాకు మునుపటికంటె ఎక్కువ ప్రేమ కలిగెను. మరియు నేను
'ఇంటికి వెళ్లితే, తిరిగి విగ్రహములకు పూజచేయవలసి యుండునని
'అనుకొంటిని. అయితే విగ్రహపూజ కేవలము వ్యర్థమైనదని నాకు
'తెలుసును గనుక, అందులో నేను ప్రవేశించితే, దేవుడు నేను
'ఎరుగనట్టి ఒకానొక విధముచేతను నన్ను చంపునని భయపడితిని.
'ఈ అన్ని సంగతులను గురించి నేను ఆలోచించగా, నాకు నిండ
'విచారము కలిగెను. ఆ సమయములోనే, నేను పాలు ఇచ్చుచుండిన
'చిన్నవానికి వమనవిరేచన జాడ్యము కనుపించెను. అతనికి ఎన్ని
'మందులు ఇచ్చినప్పటికి, ఆ రోగము నష్టు ఇయ్యావందున, ఆ సాయం-
'కాలమందు పిల్ల బాగుపడుననే ఆశ ఏమియు లేదని వైద్యులు చెప్పి-
'నారు. హా! అమ్మా! ఈ సంగతిని నేను వినినప్పుడు, నా గుండె అవిసి-
'నట్టు ఉండెను. అప్పుడు నేను హిందూ దేవుల పేరులను ఉచ్చ-
'రించక, ఆ ప్రియమైన పిల్లను రక్షించుమని క్రీస్తు మతస్థుల దేవుని
'గూర్చియే బిగ్గరగా ప్రార్థించుచుండగా, ఇంతకును నేను చెప్పిన
'యూరప స్త్రీ నన్ను చూచి, ఓ దాయీ! [illegible]
'[illegible] భయముచేతను క్రీస్తు [illegible]

'టకు నీవు భయపడితే, నీ యాపత్కాలములో నీ ప్రార్థనలను దేవుడు
'ఆలకించునని నీవు ఏలాగున అనుకోగలవు?' అని సమయోచితముగా
'చెప్పబడిన ఈ మాట పరిశుద్ధాత్మయొక్క శక్తివల్ల నా దుఃఖ హృద-
'యములో నాటుకొనెను. వెంటనే నేను హిందూ దాయీ ఎదు-
'టను బోయీ ఎదుటను,—'ఓ నా దేవా! నిన్నే నమ్ముచున్నాను.
'నేను క్రీస్తు మతస్థురాలను. కాబట్టి ఇప్పుడు నా ప్రార్థనను వినుము,
'ఎందుకంటే నీవు నీ పిల్లల ప్రార్థనలను విందునని మాట ఇచ్చియు-
'న్నావు' అని యెలుగెత్తి ప్రార్థించితిని. అంతట ఆ క్షణము మొద-
'లుకొని ఆ పిల్ల బాగుపడసాగెను. ఆ క్షణము మొదలుకొని నేనును
'ఆడిన మాట తప్పకున్నాను" అనెను.

ఆ ముసలి స్త్రీ ఇది చెప్పుచుండగా, ఆమె కన్నుల నిండ నీళ్లు
కారెను. అది ఇంక చెప్పసాగినది;—"అవును, అమ్మా! ఆ క్షణము
'మొదలుకొని నేటికి ఏబది సంవత్సరముల వరకును క్రీస్తునే ఆరా-
'ధించుచున్నాను. ఆయన నామము కొరకు తండ్రిని తల్లిని పెని-
'మిటిని ప్రియులైన ముగ్గురు పిల్లలనును విడిచిపెట్టితిని. అయితే
'ఇప్పుడు వారినుంచి నేను ప్రత్యేకమైనానని బొత్తుగా దుఃఖిం-
'చను. ఎందుకంటే, స్వకుటుంబముకంటె యేసు బహు శ్రేష్ఠుడై
'యున్నాడు. నాకు కావలసినది అంతయు ఆయనే దయచేయుచు-
'న్నాడు. పెంపుడు బిడ్డకు స్వస్థమైన తరువాతను, నేను నా యజమా-
'నురాలితో—మీరు నా పెనిమిటిని పిలిపించి, నేను క్రీస్తు మతమును
'అవలంబించుటకు నిండ కోరియున్నానని ఆయనకు దయచేసి తెలియ
'చేయుండని చెప్పినాను. ఆమె ఆ ప్రకారముగానే చేసెను. కాని,
'నా పెనిమిటి ఈ సంగతిని విని, నమ్మక;—'నా భార్య ఎక్కడ? ఈ
'వార్త దాని నోటనే విందును' అని చెప్పెను. అప్పుడు నేను మిక్కిలి
'భయముతో ఆయన దగ్గరకు వెళ్లినాను. అయితే వెంటనే దేవుడు
'నాకు ధైర్యమును కృపనుసు దయచేసినాడు గనుక, నేను ఆయన-
'తో—'వాస్తవమే, నేను విచారించగా క్రీస్తు మతము నిజమని నాకు

'కనుపడుచున్నది, గనుక దానిని అవలంబించవలెనని యున్నాను' అని 'స్పష్టముగా పలికితిని. హా! ఆయన ఈ మాటలు వినగానే, అత్యు- 'గ్రుడై,—'నీవు మతమును కోరినదానవు కావు, నీకు ఒక జాతి పెని- 'మిటి కావలెనని కోరుచున్నావు' అని చెప్పి, నన్ను శపించి, తిట్ట 'సాగి, నా ముఖము మీదను ఉమ్మివేయుండని నా పిల్లలతో చెప్పి- 'నాడు. అయితే వారు వారి తండ్రికంటె మిక్కిలి శాంతము కల- 'వారు గనుక, వారు నా మెడ కట్టుకొని యేడ్చినారు. వారిలో ఒక 'పిల్ల—"అయ్యో! అమ్మా! క్రీస్తు మతములో ప్రవేశించవద్దు; నీ కులము 'పోయిన తరువాత, నీతో కూడ ఎవరును కూర్చుండి తినరు" అని 'చెప్పెను. మరి యొక పిల్ల—"అమ్మా! నీ కొరకు అవ్వ నేడు ఒక 'మంచి పిండి వంట చేయ తలచి యున్నది. ఎందుకంటే ఆమె మాతో 'ఆ దొరసాని మనలను పిలువనంపించుట అనేది, మీ తల్లికి సెలవు 'ఇచ్చివేసుటకే' అని చెప్పెను అని పలికి, 'అయ్యో! అమ్మా! ఈ పిండి 'వంట నీవు తినవలసినది. రా అమ్మా! మాతో కూడా రా" అని 'చెప్పెను. నా పెనిమిటి నన్ను ఆడిన సమస్త కఠినపు మాటలను 'నిందలను సహించ గలిగితిని గాని, నా పిల్లలయొక్క ప్రేమ సూ- 'చకమైన నడవడిని చూచి, నా మనస్సు మిక్కిలి కలతపారి,—నేను 'ఇంటికి వెళ్లి, నా పెనిమిటి యెదుట మాత్రము విగ్రహములకు పూజ 'చేసి, నా పిల్లలకు రహస్యముగా క్రీస్తును గురించి బోధ చేసితినట్లా- 'యెనా, వారు పెద్దవారు అయిన తరువాత, వారును నేనును కలిసి 'క్రీస్తు మతస్థులము కావచ్చునని నేను కొంతసేపటికి అనుకొంటిని. 'అయితే పరిశుద్ధాత్మ నాయందు కృపచేయుంచి, నా మనస్సులోనుంచి 'ఈ చెడ్డ తలంపును పారదోలెను. అప్పుడు నేను నా పిల్లలతో 'నిష్కర్షగా చెప్పిన మాట;—"మీతో కూడ రావడమునకు సిద్ధముగా 'నున్నాను గాని, నేను విగ్రహారాధన చేయ జాలను. నేను క్రీస్తు 'మతములో ప్రవేశించ పోవుచున్నాను గనుక, మీ తండ్రి నన్ను తన యింటికి ఎన్నటికిని రానీయడని నాకు తోచుచున్నది" అనియన్నాను;

'నా పెనిమిటి అది విని మరింత కోపపడి,—"నిన్ను ఎవరు చేర్చుకొం-
'దురు! నీవు చచ్చితే సంతోషింతును" అని చెప్పి, తన పిల్లల చేతులు
'పట్టుకొని, వారిని ఈడ్చుకొని పోయెను. నా చిన్న ఆడపిల్ల నాతో
'కూడ ఉండవలెనని చాలా కోరి, నా మెడ కట్టుకొని యేడ్చెను.
'అయితే దాని తండ్రి నన్ను త్రోసి, నా కౌగిటనున్న పిల్లను లాగు-
'కొని, దానిని తీసుకొని వెళ్లెను. వాడు మొదలుకొని నేటిదాకా,
'వారిలో ఒకరినైన నేను బొత్తుగా చూచి యుండలేదు. హా!
'అమ్మా! ఇప్పుడు నేను ఏమి చెప్పుదును? పది పండ్రెండు దినముల
'దాకా నాకు పిచ్చియెత్తినట్టు ఉండి, అన్నము తినలేక పోయినాను.
'ఆ సమయములో నా దొరసానియొక్క కుటుంబీకులు నన్ను మిక్కిలి
'ప్రేమగా చూడకపోతే, నేను సైతానుయొక్క వలలో పడి, నా
'పిల్లల యొద్దకు వెళ్లేదానసే. అయితే నా యజమానురాలును ఆ యౌ-
'వన స్త్రీయును నాకు బోధ చేసి, నా మనస్సుకు నెమ్మది పుట్టేలాగున
'చేసిరి గనుక, కొన్ని దినములు గతించిన తరువాత, దేవుని అత్యంత
'కృపవల్ల నా మనస్సు స్థిమితపడి, నేను క్రీస్తు సంఘములో చేర్చ-
'బడితిని. అటుతరువాత ఆ యౌవన స్త్రీ ఒక బోధకునిని వివాహము
'చేసుకొనినందున, నేను ఆమె కొలువులో ఇరువది అయిదు సంవ-
'త్సరములు అయానుగా నుంటిని. అటుతరువాత నేను పాలు ఇచ్చిన
'చిన్నవాడు పెద్దవాడై, సీమనుంచి వచ్చి, ఒక గొప్ప ఉద్యో-
'గములో ప్రవేశించినాడు. అయినప్పటికిని, ఆయన తన దాయీని
'అయిన నన్ను మరువక, తాను వివాహము చేసుకొనిన తరువాత,
'నన్ను తన యింటికి రప్పించుకొనెను. గనుక, ఆయనకు ఏడుగురు
'పిల్లలు పుట్టినదాకా అక్కడనే ఉంటిని. రెండు సంవత్సరముల
'క్రిందట ఆయన నన్ను చూచి,—'ఓ దాయీ! నీవు ఇప్పుడు ముసలి
'మనుష్యురాలవు. నీవు ఇకను పనిచేయ లేవు గనుక, నీవు వెళ్లి, [illegible]-
'రైన, కొందరు క్రీస్తు మతస్థులు ఉంటే, వారితో కూడ ఉండుము.
ఎందుకంటే, [illegible], నాకు నిన్ను [illegible] చూచి, కను-

'పెట్టుదురు' అని పిలవిచ్చెను. ఇందుకు నేను సమ్మతించినాను. ఈ
'చొప్పున నేను పాలు ఇచ్చి పెంచిన దొర నన్ను ఇక్కడికి తెచ్చి,
'నా కొరకు ఈ యిల్లు కట్టించి, నా విషయమై ఇక్కడి బోధకునితో
'చెప్పవలసిన మాటలు చెప్పి, నన్ను ఆయనకు ఒప్పగించి యున్నాడు.
'ఈ బోధకునియొక్క భార్య నాయెడల నిండు దయ కనుపరుచుచు,
'తానే నా దొర నాకొరకు పంపే మూడు రూపాయలు తెచ్చి
'ఇచ్చుచు, నాతో ధైర్యమును ఆదరణను కలుగచేసే అనేకమైన
'మాటలను చెప్పుచుండును. ఇదిగాక పుల్లనీయు దాని పెనిమిటియు
'దాని పిల్లలును నాయెడల ఎంత దయగా నున్నారని చెప్పచాలను.
'సత్యవతియొక్క తండ్రి నన్ను అమ్మా అనియు ఆయన పిల్లలు నన్ను
'అవ్వా అనియు పిలుతురు. ఈ చొప్పున పిలుచుట పేరునకు మా-
'త్రమే కాదు; వారు కేవలమును స్వంత కుమారుని కుమార్తెయును
'వలెను నాయెడల ప్రేమను ఉంచుచున్నారు. ఒక పర్యాయము
'నా దొర ఈశాన్య ఖండములకు ఆరోగ్య నిమిత్తము వెళ్లుచు, నన్ను
'చూడ వచ్చి, ఈ చిన్న ఇంటిలో చాలా సేపు కూర్చుండి, నాతో
'మత సంగతులను గురించి మాటలాడి, వెళ్లేటప్పుడు నాతో కూడ
'ప్రార్థించినాడు" అని చెప్పెను.

ఈ చరిత్ర అంతయు ప్యారి ముగించి,—"మీరు నేడు వెళ్లక
'ముందు, ఒక చిన్న ప్రార్థనను చేసితే, నేను నిండ సంతోషింతును"
అని చేసిన మనవికి నేను ధారాళముగా ఒప్పుకొని, ఉభయులమును
మోకాళ్లూని, దేవునిగూర్చి ప్రార్థించినాము. ప్రార్థించుచు, నేను
ఈ మనవి చేసుకొన్నాను;—'ప్రభువా! ఇక మీదట మా ఉభయులకును
'జరగబోయే సంకోచమైన మాటలముగా మేము ఇంతకంటె బాగుపడేలా-
'గున, నీ ఆశీర్వచనము దయ చేయుము' అని. ఈ ప్రార్థన కాగానే,
ప్యారి ఇప్పుడు ప్రార్థించిన మాటలను జ్ఞాపకము చేసుకొని,—"ఓ
'అమ్మా! మీరు అప్పుడప్పుడు నాకంటె పెద మునిషిగాని ఇంటిలోనికి
'వచ్చి, నాతో కూడ మత సంగతులను గురించి మాటలాడి, నాకు చెవ

'వాక్యముల అర్థమును వెల్లడి చేసితే, నేను ఎంత కృతార్థురాల నా- 'దును అని చెప్పుదును. అప్పుడు నా గిన్నె నిండి పొర్లుచున్నదని 'రాజైన దావీదుతో చెప్ప కలుగుదును" అనెను. (కీర్తన. 23: 5.)

క్రీస్తుయొక్క ఈ ముసలి సేవకురాలు నాకు చెప్పిన ప్రకారము ఆమెయొక్క ఆనందకరమైన చరిత్రను వ్రాసినాను. ఆమెను గురించి నేను విశేషించి చెప్ప నక్కరలేదు. ఆ దినము ఆమె వద్ద ఎంత దయతో సెలవు పుచ్చుకొని వెళ్లితినో, ఆ సంగతి ఈ గ్రంథ- ము చదివేవారు సులభముగా గ్రహించవచ్చును. దప్పిచేత డస్సి మార్గాయాసము గల యాత్రికుడు, ఇసుక పాంద్రలో నీటి యూ- టను కనుగొంటే, ఎంత సంతోషించునో, నేనును అజ్ఞానమనే చీకటి కమ్ముకొని యున్న ఈ ప్రదేశమందు ఇంత కాంతి గల భక్తి జ్వాలను చూచి, అంతగా సంతోషించినాను. మరియు నా హృద- యము ఈ ముసలిదానియందు వెంటనే లీయమై పోయి, ప్రేమ బంధములతో బంధించబడెను. హా! ఈ చొప్పున మనము క్రీస్తు జనులతో అనురాగముగా కలిసి యుండి, మన పరలోకపు తండ్రి- యొక్క పోలికను ధరించి యుండే వారియెడల ప్రేమ ఉంచితే, అప్పుడు మనము వాస్తవముగా క్రీస్తు జనులమని మనో రూఢి చేసు- కొన వచ్చును. అయితే ఈ చొప్పున నుండక, క్రీస్తు జనులయె- డల కోపమును గిట్టమియు పగయును ఉంచితే, మనము దేవుని జను- లము బొత్తుగా కాము. ఇహమందు ఏకోదరులు తమకు తండ్రి యొక్కడే అని తెలుసుకొని పరస్పర ప్రేమ కలిగియుందురు. ఆ ప్రకారముగానే ఏక దేవుడే తమకు తండ్రి అని చెప్పి, ఏక రక్షకు- నిని తమకు అన్నగా భావించే నిజమైన క్రీస్తు మతస్థులును పరస్పర ప్రేమ కలిగి యుందురు గాక. క్రీస్తు మత జనులలో పుట్టే స్నే- హము భూ సంబంధమైన ప్రేమకంటె ఎక్కువ అయినది. ఎందు- కంటే, ఆ ప్రేమ ఈ లోకమునందు మాత్రమే ఉపయోగించకుండా, పరలోకములో కూడ దృఢపడి యుండును. ముసలిదియైన ప్యారి

యెడల నాకు కలిగిన ప్రేమ ఇటువంటిదే, మరియు ఎంతో కాలము కాకమునుపు పరలోకరాజ్యములో మనము కలిసి కూర్చుండి, మన యొక్క సముదాయ రక్షకుని కీర్తిని పాడుచుందుము అనే నిశ్చయత మిక్కిలి ఆనందకరమై యున్నది.

## ౫. అధ్యాయము.

వెనుక చెప్పిన సంగతి జరిగిన కొంత కాలమునకు, నేను ఒకనాడు కరుణ యింటికి తిరిగి వెళ్ల తలచినాను. అయితే నేను ఈ మధ్యను దానిని మరచి పోలేదుగాని, పడిపోవుచు నుండే దాని యిల్లు, దాని మైలబట్టలు, వీటిని గురించి అనుదినము ఆలోచించుకొనుచుంటిని. మరియు దేవుడు దాని హృదయమును భేదించి, దానిని యుక్త మార్గములోనికి తెచ్చునని అనుదినము కృపా సింహాసనము నొద్ద దానిని స్మరించుచు, ఆయనను ప్రార్థించుచుంటిని. కరుణయొక్క ఇబ్బందిని తొలిగించే సదుపాయము కనుగొనవలెనని చింతించుచుంటిని గనుక, దాని దగ్గరకు అతి శీఘ్రముగా వెళ్లక, కొన్ని దినములదాకా కాచుకొని యుంటిని. దాని చిన్నకుమారుడైన నవీనునియొక్క గుణగతులను చూచినంతలో, ఎవరైన వానిని హద్దులో ఉంచి, చదువు నేర్పితే, వాడు మంచి గట్టివాడు కాగలడని నాకు తోచెను. కరుణకు ఎదిగిన మరి యొక కుమారుడుకూడ నుండెనని జనులవల్ల తెలుసుకొంటిని. కాబట్టి ఈ యిద్దరు చిన్నవాండ్లకు కొంత పనిపెట్టి, వారిని చురుకును శ్రద్ధయును గల వారినిగా చేయ కలిగితే, వారు కొంచెము గొప్ప సంపాదన చేయుటవల్ల, వారి దౌర్భాగ్యపు తల్లికి కొంత సహాయము చేయవచ్చును. ఈ హేతువుచేత కరుణ సమ్మతించిన పక్షమందు, దాని ఇద్దరు కొడుకులను నా యింటికి తీసుకొని వచ్చి, వారికి తోటపనియు మేటిపనియు నేర్పింతునని నిశ్చయిం-

చితిని. ఇటువంటి భావముతో కరుణ ఇంటికి వెళ్లినాను. అయ్యొ-రామా! నేను అక్కడ ప్రవేశించగానే, నేను చూచిన సంగతి ఎంత దుఃఖకరమై యున్నదని చెప్పుదును! కరుణ వాకిటి మెట్ల మీద కూర్చుండి, మూలుగుచుండగా, దాని తలకు తగిలిన ఒక పెద్దగాయ-మువల్ల నెత్తురు కాలువ కట్టి కారుచుండెను. అది నన్ను చూడ-గానే,—"హా! అమ్మా! మీరు నేడు మంచి సమయమునకు దయ చేసి-'నారు. నా దుఃఖకరమైన స్థితిని మీ కన్నులారా చూచుచున్నారు. 'ఇటువంటి దిక్కుమాలినది అయిన నావంటిది ఒక చక్కని ఇల్లును 'తెల్లని బట్టలును ఏలాగున సంపాదించుకో గలదో మీరే విచారిం-'చుండి. హా! అమ్మా! ఇంటివారు నాతో మంచి మాటలు ఆడిన 'పక్షమందు, నేను రెండు మూడు దినములు ఉపవాసమును కూడ 'సహింతును గాని, ఈ నిత్యమయిన జగడమును దెబ్బలును నేను 'ఇకను సహించలేను. హా! నేను చచ్చితే మేలు" అని చెప్పసాగెను.

దొడ్డిలో మంచి నీళ్లతో కుండ ఉండగా, నేను తక్షణమే నా చేతి గుడ్డ ఆ నీళ్లలో ముంచి, కరుణయొక్క తలకు తగిలిన గాయమునకు అద్దితిని. ఈ చొప్పున కొన్నిమారులు అద్దిన మీదట, ఆ నెత్తురు కట్టుకొనినది. అంతట నేను దానిని దయగా చూచి, నీకు ఈ దెబ్బ ఏలాగున తగిలినదని అడిగితిని! అందుకు అది చెప్పినది;—"అమ్మా! 'మీకు తెలియ చెప్పుదును, వినుండి. నేడు అంతయు నాకు తిను-'టకు ఏమియు లేక, సాయంకాలము మూడు గంటలప్పుడు ఫుల్లనీ 'ఇంటికి వెళ్లి, రెండు డబ్బులు అడిగి పుచ్చుకొంటిని. వాటిని పెట్టు-'కొని, కొన్ని చిన్న చేపలను కొనుక్కొని, రాత్రి వండుకొన వలెనని 'వాటిని కోసి, కడిగి, ఒక చోట ఉంచితిని. అప్పుడే నా పెనిమిటి 'ఇంక ఇద్దరు మనుష్యులను వెంట పెట్టుకొని, ఇంటికి వచ్చెను. వారు 'అందరును కొంచెముగా తాగి యుండిరి. అప్పుడు నా పెనిమిటి 'నిండ కోపముగా నుండి, అన్నము సిద్ధముగా ఉన్నదా? అని అడుగ-'సాగెను. అందుకు నేను—నాలుగు గంటలకే అన్నము ఎక్కడ

'నుంచి వచ్చును! నీవు నిండ తాగి యున్నావు గనుక, నీవు చెప్పేది
'నీవే ఎరుగకున్నావు. మరియు అన్నము అడుగ రావడమునకు
'నీవు ఎవడవు! అందుకు నీవు నాకు ఏమైన సొమ్ము ఇచ్చి యు-
'న్నావా! అంటిని. అతడు ఇది విని, చేప ముక్కలను ఉంచిన
'తట్టను తన్ని, ఆ తట్టను చేపలతో కూడ తూపురాసిలో పడద్రోసి,—
'నీవు ఈ చొప్పున మాటలాడుచున్నావా! నేను నీకు డబ్బులు
'ఇయ్యక పోతే, నీ కొరకు నీవు దాచుకొనియున్న ఈ చేపలను
'ఏలాగున సంపాదించ కలిగినావు!' అని పలికి, ఈ చొప్పున నన్ను
'నిందించి, తన తాగుబోతు సహవాసులను చూచి,—'అన్నలారా
'రండి, మనకు సొమ్ము లోపములేదు. ఈ చిన్నది మనకు తినుటకు
'ఏమియును ఇయ్యక పోయినప్పటికి, ఏమి మునిగి పోయినది!
'మనము ఇతర స్త్రీలను ఎరుగకున్నామా!' అని చెప్పి, నన్ను లెస్సగా
'కొట్టెను. తరువాత వారందరును వెళ్లిపోయినారు" అనెను.

ఈ వృత్తాంతము వినిన తరువాత నేను కరుణను చూచి,—"నీ పెని-
'మిటి చేపలను పడద్రోయక ముందు, నీవు వానిని ఏమియు అనలే-
'దా!" అని అడిగితే, కరుణ—"నిజమే అమ్మా! నేను ఏలాగున ఊర-
'కుందును! అతనిని బాగుగానే తిట్టినాను. ఇటువంటి చేష్టలను ఇటు-
'వంటి మాటలను సహించ శక్యమా! వానికి సొమ్ము లేనప్పుడెల్ల నేను
'ఇచ్చేదంతయు మెదలక తినేవాడు. అయితే అతనికి నాలుగు
'అయిదు అణాలు దొరికినప్పుడెల్ల, ఇదిగో ఈ చొప్పుననే నా
'మెడల జరిగించేవాడు. రేపటిదాకా అతని దగ్గర ఒక దమ్మిడీ అయిన
'నిలువ యుండదు, అతడు ఒక రాత్రిలోనే తాగడమందు తగని వ్యా-
'పారమందును అంతయు వ్రయము చేయును" అని ఉత్తరము ఇచ్చిన-
మీదట, నేను కరుణను చూచి;—"కరుణా! ఆలోచించుము. నీ పెని-
'మిటి తాగి యుంటెను గనుక, వాడు ఏమి చెప్పినాడో, ఏమి చేసి-
'నాడో వానికి తెలియదు. ఆ సమయములో వానికి బుద్ధిలేదు, అందు-

'వంటి సమయములో వానిని గద్దించుట చెరుపునకు హేతువు. మరి-
'యు తిట్టు అనేది యెప్పటికిని మంచిది కాదు. దానివల్ల ఎన్నటికిని
'మేలురాదు. నీవు వానిని తిట్టి, వాని కోపమును రేపక పోతే, వాడు
'నిన్ను కొట్టకయే పోవును" అని చెప్పితిని. అందుకు కరుణ—"అమ్మా!
'ఫుల్లనీ కూడ ఈ చొప్పుననే నాతో ఎల్లప్పుడును చెప్పుచుండును
'గనుక, నేను ఒక్కొక్కప్పుడు నా పెనిమిటితో దయగల మాటలనే
'మాటలాడి, దానివల్ల అతనిని సాధువునుగా చేసుకొందునేమో అని
'ఊహించుకొనేదానను గాని, అతడు నిండ తాగి ఇంటికి వచ్చి-
'నప్పుడు, దయగల మాటలు నా మనస్సుకు బొత్తుగా తోచక, కోపపు
'మాటలే బయలుదేరును. ఈ సంగతులనన్నిటిని విచారించని వారు
'నిందను అంతయు నా మీదనే మోపి, నా పెనిమిటిని మంచి వాడని
'అనుకొందురు. అయితే ఇది నాకు నిండ దుఃఖకరమై యున్నది. రెండు
'దినముల క్రిందటను ఫుల్లనీ నాతో ఇట్లనెను;—'ఓ ప్రియమైన కరుణా!
'నీ పెనిమిటి గుణము సాధువును ప్రేమయును కలది గనుక, నీవు
'అతనియెడల కొంచెము గౌరవము చూపితే, అతడు నీయందు
'ప్రేమ ఉంచకుండలేడు' అనెను. అయితే ఈ మాట చెప్పుటకు
'ఫుల్లనీ ఏమి చూచెనో నాకు తెలియదు. ఎందుకంటే, నా పెని
'మిటి నన్ను ఎప్పుడును దయగా చూడడములేదు. మరియు నా
'దుఃఖమును గురించి ఫుల్లనికి ఏమి తెలుసును! ఆమె పెనిమిటి మిక్కిలి
'మంచివాడయినందున, ఆమె కోరినది అంతయు ఆమెకు ఇచ్చేవాడు.
'అయితే ఆమె నావంటి అదృష్టహీనురాలై యుంటే ఆమె మరి-
'యొక విధముగా పలుకును" అనెను.

అంతట నేను చెప్పిన మాట—"కరుణా! నీ పెనిమిటి చెడ్డవాడనేది
'స్పష్టమే. అయినప్పటికి, అతడు నిన్ను వివాహమైన నీ భర్త గనుకను,
'నీవు అతనిమంచి ఏ విధముచేతనైన తెలుపరచబడ నేరవు గనుకను,
'అతను దేని మూలముగా క్రమ క్రమముగా మంచివాడు అగునో,
'అటువంటి సాధనమును వెదుకుట నీకు విధి అయ్యున్నదని నీవు గట్టి

‘నిష్కర్ష చేసుకొనవలసినది. అయితే కరుణా! మనకు హాని చేసిన
‘వానియందు ప్రేమ ఉంచుట మిక్కిలి కఠినమైన సంగతి యని
‘నాకు తెలుసును. అయితే తన శత్రువుల కొరకు తన ప్రాణమును
‘ఇచ్చిన ఆయనయందు ఉండిన మనస్సు, అనగా, క్రీస్తునందు ఉండిన
‘మనస్సు మనకును ఉంటేనే తప్ప, అటువంటి ప్రేమను మనము ఎన్న-
‘టికిని చూపజాలము. ఓ కరుణా! నీవు క్రీస్తు మతమును నిజముగా
‘గైకొని యుంటే, నీ పెనిమిటి తన దుర్మార్గతను విడిచి, క్రమముగా
‘మంచివాడు అగునని నాకు కొంతమట్టుకు నమ్మిక కలదు. ఎందుకంటే,
‘దేవుని వాక్యములు సత్యముగానే నిలిచి యుండవలసినది. ఏమంటే,
‘మృదువైన ఉత్తరము క్రోధము తిప్పి వేయును (సామెతలు. 15: 1.)
‘అనియు, నీతిమంతునియొక్క దృఢమైన ప్రార్థన చాలా వినియోగిం-
‘చును (యాకోబు. 5: 16.) అనియు, విశ్వాసములేని పెనిమిటి విశ్వ-
‘సించిన భార్యవల్ల పరిశుద్ధపరచబడియున్నాడు (1 కొరింథి. 7: 14.).
‘అనియు వేదములో చెప్పియున్నది. చూడు, నీవు దేవుని జనులలో
‘వాస్తవముగా ఒకతెవై యుంటే, నీ పెనిమిటిలో నుండే కీడును
‘మేలు అయ్యేటట్టుచేసి జయింతువు. ఇంతే కాక, అతని కొరకు
‘ప్రార్థింతువు. అప్పుడు దేవుడు నీ ప్రార్థనలను చిత్తగించి, అత-
‘నిని గుణపరుచును. అయితే ఇటువంటి శుభకరమైన ఫలము లభించక
‘పోయినప్పటికి, దేవుడు నీ నిమిత్తము ఈ దుష్కార్యములు చేయ-
‘కుండేటట్టు అయినా, నీ పెనిమిటిని మానిపించును” అంటిని.

అంతట కరుణ ఏడువ నారంభించి,—“లేదు, లేదు, అమ్మా! అతడు
‘దుర్మార్గతను విడిచిపెట్టును అనే మాట స్వప్నములోనైన అనుకొన
‘గిట్టదు. ఇటువంటి మాట సెలవు ఇయ్యకుండి. అయితే నిజమైన
‘క్రీస్తు మతస్థురాలనై యుండుటకు నాకు నిండ కోరిక యున్నది.
‘ఎందుకంటే, ఈ లోకములో నేను ఎంత దుఃఖమును సహించవలసి
‘యున్నదో, ఆ సంగతి దేవునికే తెలుసును. పరలోకములో సుఖము
‘కలుగును అనే ఆశ నాకు ఉన్నట్టయితే, నాకు కొంచెము గొప్ప

'ఆదరణీయము బలమును దొరుకును. అయితే క్రీస్తుయొక్క సేవ 'మిక్కిలి కఠినమైనది. ఆయన ఆజ్ఞలనన్నిటిని కాపాడుటకు నాకు శక్తి 'ఎంతమాత్రమును లేదు" అని చెప్పెను.

అందుకు నేను—"ఓ కరుణా! క్రీస్తు సేవ కఠినమైనదని చెప్పితివి- 'గదా. నీ తాత్పర్యము ఏమి? ప్రభువైన యేసుక్రీస్తునందు నమ్మికను 'ఉంచుము; అప్పుడు నీవు రక్షణను పొందుదువు అని బైబిలులో వ్రాసి- 'యున్నది. ఇదిగాక,—'నా కాడి సుళువును నా భారము తేలిక- 'యునై యున్నది" అని ఆయనే చెప్పుచున్నాడ'ని పలికితిని. అందుకు 'కరుణ—"ఒక సంగతి వాస్తవమే. నమ్ముట మిక్కిలి సుళువే. నేను 'నమ్మడము లేదా? అయితే క్రీస్తుయొక్క ఆజ్ఞల ప్రకారము నడుచు- 'కొనుట మాత్రము నాచేత కాదు" అని మారు మాట పలికెను.

అప్పుడు నేను అనినదేమంటే, "అయ్యో! కరుణా! నీవు లోక 'రీతిగా మాటలాడే మనుష్యుని వలెనే పలుకుచున్నావు. క్రీస్తుయొక్క 'ఆత్మ క్రీస్తుయొక్క సంగతులను పుచ్చుకొని, వాటిని నీకు కనుపరచ 'వలెనని నేను ప్రార్థించుచున్నాను. నమ్ముచున్నాను అని చెప్పితివే. 'మంచిది దేనిని నమ్ముచున్నావు? నీవు పాపాత్మురాలవై, దురవస్థలో 'నుండి, నరకమునకు సిద్ధముగా నుండగా, క్రీస్తు తన విలువలేని రక్త 'ము పెట్టి నిన్ను కొనుక్కొని రక్షించెనని నమ్ముచున్నావా? నీవు ఇదం- 'తయు నమ్మియుంటే, అప్పుడు నీ విశ్వాసముతో కూడనే ప్రేమ 'పుట్టును. మరియు క్రీస్తునందు ప్రేమ ఉంచిన తరువాతను, ఆయన 'ఆజ్ఞలను భారముగా ఎంచవు. ఓ కరుణా! నీ విశ్వాసము నిష్క- 'ళంకమైన విశ్వాసము కాదని తలంచుచున్నాను. విశ్వాసము రెండు 'విధములు. ఇందుకు నేను నీకు ఒక దృష్టాంతము చెప్పెదను. ఒకా- 'నొక గ్రామములో ఒక మనుష్యుడు ఒక పెద్ద రోగము కలవాడై 'యుండెను, తనకు రోగము ఉండెనని బొత్తిగా అనుకొనలేదు. 'వాని స్నేహితులును బంధువులును వాడు చిక్కిపోవుచుండగా చూచి, వానితో—మన గ్రామములో ఒక గట్టి వైద్యుడున్నాడనే

‘సంగతి నీవు ఎరుగుదువుగదా, అతని యొద్దకు త్వరగా వెళ్లి, అతని
‘యొద్ద ఔషధము పుచ్చుకొనుము, లేకపోతే, నీవు శీఘ్రముగా చచ్చి-
‘పోదువు’ అని చెప్పితే, ఆ రోగి ఇది విని నవ్వి,—‘ఆ వైద్యుడన్న మాట
‘నేను ఎరుగుదును. వాడు గట్టివైద్యుడని కూడ నేను నమ్ముచున్నాను.
‘అయితే నాకు రోగము ఎంతమాత్రము లేదు. గనుక, నేను వాని
‘యొద్దకు ఎందుకు వెళ్లవలెను’ అని పలికెను. చూడు కరుణా! వైద్యుడు
‘గ్రామములోనున్న సంగతి ఆ బుద్ధిహీనుడు నమ్మినప్పటికి, తనకు
‘వైద్యుడు లేనట్టుగానే ఉండెను గనుక, వాడు కొద్ది రోజులలోనే
‘చచ్చిపోయినాడు. అయితే ఆ గ్రామములోనే మరియొక రోగి
‘యుండెను. వాడు అన్య వైద్యులవల్ల వివిధములైన ఔషధములు
‘పుచ్చుకొనినప్పటికి, నానాటికి కృశించి, చచ్చుటకు సిద్ధముగా నుండి-
‘నప్పుడు, అతని యొద్దకు ఒక మనుష్యుడు వచ్చి, ఇందాక చెప్పిన ఆ
‘మంచి వైద్యునియొక్క యోగ్యతలన్నిటిని గురించి అతనికి తెలిపెను.
‘ఆ రోగి, తాను వినినదంతయు సంతోషముగా నమ్మి, తక్షణమే
‘ఆ వైద్యుని పిలిపించి, అతనిచేత ఔషధము పుచ్చుకొనిన మీదట,
‘ఆ రోగము పోయినది. ఈ రోగి ఆ వైద్యునివల్ల కలిగిన మేలు
‘ఎరిగి, తన జీవిత కాలమంతయు అతనియందు శక్యమైనంత ప్రేమ
‘ఉంచెను. ఇప్పుడు కరుణా! చూడు, ఈ ఇద్దరు రోగులును ఆ-
‘పల్లెలో ఒక గట్టివైద్యుడు ఉండెనని సమానముగానే నమ్మిరి. అయితే
‘మొదటివాడు అతనియొద్దకు వెళ్లకపోయినందున, అతనివల్ల లాభము
‘కలుగచేసుకొనక పోయినందునను, అతనియందు బొత్తుగా ప్రేమ
‘ఉంచక పోయెను. ఈ చొప్పున ఈ మనుష్యుని విశ్వాసము నిష్ఫల-
‘మాయెను. అయితే రెండవవానియొక్క విశ్వాసము ఇటువంటిదిగా
‘నుండక, తన విశ్వాసానుగుణముగా, వాడు ఆ వైద్యుని పిలిపించి,
‘స్వస్థతను పొందెను. అటుతరువాత వాడు తన్ను రక్షించినవాని-
‘యందు ఎంత ప్రేమ ఉంచినాడంటే, అతడు తనకు ఏమేమి ఆజ్ఞలు

‘విధించునో, వాటిని ఉల్లాసముగా గైకొనును. ఇంతే కాకుండా, ‘నాడు ఆ వైద్యుని కీర్తి ఇతరులతో ప్రకటన చేయుచుండును. వైద్యుని-‘యందు ఈ రెండవవానికి ఉండిన విశ్వాసము వలెనే, క్రీస్తునందు ‘మన విశ్వాసము ఉంటేనే కాని, మనము దేవుని రాజ్యము లోనికి ‘ప్రవేశించలేము. హా! కరుణా! నీవును నేనును లోకములోని ప్రతి ‘మనుష్యుడును పాపము అనే రోగముతో తీసుకొనియున్నాము ‘గనుక, నేను నీకు చెప్పే బుద్ధి మాటలను వినుము. నీ రోగముపట్టి ‘నీకు అనుభవ జ్ఞానము కలిగేలాగున, పరిశుద్ధాత్మను ప్రార్థించుము. ‘నీకు ఆ జ్ఞానము కలిగిన తరువాత, వైద్యశ్రేష్ఠునియొద్దకు వెళ్లి, రక్షణ ‘కొరకు వేడుకొనేటట్టు ప్రేరేపించబడుదువు. ఆయన నిన్ను పాప ‘వేదననుంచి విడిపించిన తరువాత, తన ఆజ్ఞల చొప్పున నడుచుకొను-‘టకు, నీకు కృపను బలమును కృతజ్ఞతను దయచేయును” అని చెప్పితిని.

కరుణ తల వంచుకొని, ఈ మాటలకు ఏమియు ఉత్తరము ఇయ్యలేదు. దేవుడు దానియెడల దయ తలచెను గనుక, అది మొ-దట శ్రమ అనే నిప్పులో శోధింపబడి, నిర్మలమయిన వెండివలెనే పవిత్రము కాగలందులకు, అవశ్యమై యుండెను. మేము మాటలాడు-కొనినప్పుడు, ఇంటిలో మేము ఉభయులము మాత్రమే ఉంటిమి. అయితే మేము మాటలాడి ముగించగానే, కరుణయొక్క పిల్లలు పరు-గెత్తుచు వచ్చిరి. నవీనుడు నన్ను చూడగానే, సలాము చేసెను. వాని అన్న ఒక బల్లమీదనుంచి ఒక ఉత్తబుడ్డి తీసుకొని, త్వరగా పారి పోవుచుండగా, వాని తల్లి వాని చెయ్యి పట్టుకొని, “హా! వంశీ! ‘నీయొద్ద డబ్బులు ఉంటే, వాటిని నాకు ఇమ్ము. వాటితో ఆహారము ‘కొందును. నేడు మనకు తినుటకు ఏమియు లేదు. నీవు ఏమి ‘చేసిన సరే, అయితే నా బిడ్డా! నీ తండ్రివలెనే నీవును సారాయి ‘మాత్రము కొనుకొని తాగి మత్తుడవు కావద్దు” అని చెప్పెను.

అందుకు ఆ చెడ్డ చిన్నవాడు—"నీవు చెప్పినది మిక్కిలి మంచి 'మాటే పో! నీకు ఇచ్చుటకేయా ఈ రెండు అణాలు ఆటలోనుంచి 'గెలిచి నేను తెచ్చుకొంటిని? వాటిని పెట్టుకొని నేను ఇప్పుడు వెళ్లి 'సారాయీ తాగుదును. నాకు అన్నము లేకపోతే, అట్టే పోయెను. 'నీ మట్టుకు నీవే చూచుకొమ్ము" అని చెప్పి, ఆ చిన్నవాడు తనచేతిని తల్లి పట్టునుంచి విడిపించుకొని, వెళ్లిపోయినాడు. వాడు పదియేను లేక పదియారు సంవత్సరములకంటె ఎక్కువ ఈడు కలవాడు కాక-పోయినప్పటికి, వాని ముఖము వైఖరియు చూడగా, వాడు మిక్కిలి దుర్మార్గుడును దుర్వ్యయకుడునై యున్నట్టు నాకు స్పష్టముగా కనుప-డెను. నవీనుడు తన అన్న జరగించిన విధమును చూచి, అతని వెంట వెళ్లుచుండగా, నేను వానిని తిరిగి పిలిచి, వానితో—"నవీనుడా! 'నీ అన్న మిక్కిలి దుర్మార్గపు చిన్నవాడు. వాడు చెప్పిన మాటలకు 'నీ తల్లి ఏలాగున ఏడ్చుచున్నదో చూడుము. నీవును వాని వలెనే నడు-'చుకొంటే, నీ తల్లి యేమైపోవును!" అంటిని. అందుకు నవీనుడు—"నా 'యొద్ద డబ్బులు ఉంటే, వాటిని మా అమ్మకు ఇత్తును. క్రిందట మీకు 'మధువు యిల్లు చూపినందుకు మీరు నాకు ఇచ్చిన రెండు అణాలలో 'నేను ఆమెకు ఒక అణా ఇచ్చినాను. ఇప్పుడు నాయొద్ద ఒక దమ్మిడీ 'అయిన లేదు. నేను ఆటలో ఎప్పటికి గెలవకుండా ఓడిపోయే-'వాడను" అనెను. ఇది నేను విని వానితో—"ఇది నాకు చాలా 'సంతోషమే. ఎందుకంటే ఇందువల్ల జూదము ఆడడముకంటె 'డబ్బు సంపాదించుకోవడమునకు ఒక మిక్కిలి యుక్తమైన మార్గము 'ఉన్నదని నీవు బోధ చేసుకొనవచ్చును" అని చెప్పితిని. అప్పుడు నవీ-'నుడు—"అమ్మా! డబ్బు సంపాదించుకొనుటకు నేను ఏమి చేయవలెను. 'ఒకానొకప్పుడు దొరల ఇండ్లకు అంగడినుంచి వెచ్చములు నా నెత్తిని 'మోసి తీసుకొని వెళ్లుచుందును గాని, దీనివల్ల నాకు ఏమియు లాభ-'ములేదు. ఎందుకంటే బోట్లేరులు అందుకు నాకు మూడు డబ్బులు

'ఇత్తుమని మొదట మాట ఇచ్చి, అటుతరువాతను ఒక డబ్బు మాత్రము 'చేతిలో పెట్టి, నన్ను తోలివేతురు" అని పలికినప్పుడు, నేను— "మంచిది నవీనుడా! ఎవరైన నీకు కూలిపని చెప్పక, ఒక యింటి 'కొలువు నిర్ణయించి, నీకు ఒక పాగయు, ఒక అంగియు ఒక లాగును 'ఇచ్చేటట్టయితే, సంతోషించవా!" అని అడిగితే, నవీనుడు ఈ మాట విని, ముఖోల్లాసుడై నవ్వి,— "అవును, నేను నిండ సంతోషించక 'యుందునా! మీరు నాకు ఆ పని ఇచ్చేటట్టయితే, మీతో కూడ ఇప్ప-'డే వత్తును" అని చెప్పెను. అప్పుడు వాని తల్లియు నన్ను చూచి,— "అవును, అమ్మా! మీరు దయచేసి ఇతనికి ఆ పని ఇచ్చేటట్టయితే, మాకు 'చాలా ఉపయోగించును" అనెను. నవీనుని ప్రయోజనార్థమై నేను యోచించినది ఈ చొప్పున సులభముగా సఫలమైనందున, నేను మిక్కిలి సంతోషించి,—"మంచిది, నవీనుని నా యింటికి రానిమ్ము. 'నేను వానికి అన్న వస్త్రములు ఇచ్చి, వానికి మేటీపని నేర్పుదును. 'వాడు తిన్నగా నడుచుకొని, డబ్బులాట బొత్తుగా వదిలిపెట్టితే, 'మూడు నెలలలోగా వానికి నెలకు రూపాయీ చొప్పున ఇత్తును" అని చెప్పితిని. నవీనుడు ఇందుకు హర్షించి,— "నాకు నెలకు రూపాయీ 'దొరికితే, నేను ఇకను డబ్బులాట ఎందుకు ఆడవలెను!" అని చెప్పెను. అటుతరువాత నేను కరుణను చూచి,—"నీ కుమారుని నా యొద్దకు రేపటి 'దినము తీసుకొని రా. వంశికూడ పని సంపాదించుకొనవలెనని కోరి, 'నా ఆజ్ఞా ప్రకారము నడుచుకొనుటకు మనస్సు కలిగి యుంటే, 'నేను అతనిని కూడ మూడు నెలల పర్యంతము ఉంచుకొని చూతును. 'అయితే వాడు ఇప్పుడు జరిగించినది చూచినంతలో, నాకు నిండ 'ఆయాసము కలుగ చేయునని భయపడుచున్నాను" అంటిని. అప్పుడు కరుణ నిట్టూర్పు విడిచి, ఇట్లనెను,—"అయ్యో అమ్మా! వంశి ఏ పని-'యును చేయడు. వాడు స్వాభావికముగా దుర్మార్గపు చిన్నవాడు. 'ఎందుకంటే, నా అత్త బ్రతికి యున్నంత కాలము, వంశి తండ్రి

'ఏలాగునసైతేనేమి, వాకు అన్న వస్త్రము మాత్రము ఇచ్చివాడు.
'అయితే వా బిడ్డ నాయందు అంతమాత్రపు ప్రేమకూడ లేనివాడై
'యున్నాడు. వాస్తవముగా వానిని బొత్తుగా వెళ్లగొట్టుట వానికి
'తగిన శిక్ష అయ్యుండును. అయితే వాడు నా కడుపున పుట్టిన పిల్ల-
'వాడు. వానిని ఇంతగా ఏలాగున శిక్షించ గలను" అనెను. అందుకు
నేను—"కరుణా! నేను వినినది అంతయు పట్టి విచారిస్తే, నీ విషయమై
'నేను నిండ దుఃఖించుచున్నాను. అయితే ఇది నీ అవ్యక్తతచేతనే
'నీకు సంభవించినది. నేను నీ యింటికి మొదట వచ్చినప్పుడు, నవీ-
'నుడు సత్యము పలికితే, అందుకు నీవు వానిని గట్టిగా కొట్టి, అబద్ధి-
కునిగా చేసితివి. ఆ సంగతి నాకు బాగుగా జ్ఞాపకములో నున్నది.
'తండ్రి అయిన, తల్లి అయిన ఈ చొప్పున జరిగిస్తే, వారి పిల్లలు ఏ
'చొప్పున మంచివారు కాగలరు!" అని అడిగితే, కరుణ నిట్టూర్పు
విడిచి,—"హా! ఇది నా తప్పితమే అయ్యుండవచ్చును. అయితే ఈ
'వంశి నా ప్రథమ పుత్రుడు. అయిదు సంవత్సరముల పర్యంతము
'నాకు తిరిగి పిల్లలు కలుగలేదు. కాబట్టి గారాబమునుంచి వానిని
'బొత్తుగా శిక్షించలేకపోతిని. ఈ హేతువుచేతనే వాడు ఇప్పుడు
'స్వాధీనముకాకుండ ఉన్నాడు" అనెను. అందుకు నేను అనిన మాట,—
"కరుణా! మనము దేవుని ఆజ్ఞలను అలక్ష్యము చేసితే, దుర్మార్గమున
'ఉందుము. 'బాలుని దండించుటకు వెనుక తీయకుము. ఏమంటే,
'నీవు చువ్వతో వానిని కొట్టినందువల్ల వాడు చావడు. నీవు వానిని
'చువ్వతో కొట్టినను, వాని యాత్మను నరకమునుంచి తప్పింతువు.'
'(సామెతలు. 23: 13, 14.) అని దేవుడు పలికియుండగా, నీవు ఇది
'మరియొక లాగున యోజించి, ఆయన ఆజ్ఞాప్రకారము జరిగించక
'పోతివి. కాబట్టి, నీ ప్రేమకు తగినవాడని యెంచి, నీవు పెరిపిన కుమా-
'రుడు ఇప్పుడు నీ యెడల ద్వేషబుద్ధితోనే పెరిగి, నిన్ను అలక్ష్య-
'ముచేసి, ఇప్పుడే ఇంతగా దుర్మార్గతయందు మించి యున్నాడంటే,

'వానిని చూచుటకే భయముగా నున్నది. కాబట్టి, వానిని స్వాధీన-
'ములోనికి తెచ్చుట అసాధ్యమై యుండునని భయపడుచున్నాను.
'అయితే వానిని గురించి నేను నా పెనిమిటితో మాటలాడుదును.
'వారు వాని మేలుకొరకు ఏమైన చేయగలిగితే, దానిని నిశ్చయముగా
'చేతురు" అంటిని.

నేను సెలవు తీసుకొని వెళ్లుటకు కాలమైనది గనుక, కరుణకు ఆ దినము ఏమాత్రమైన సొమ్ము ఇయ్యవచ్చునో, ఇయ్యకూడదో అని నేను యోజించుచుండగా, అదే భయపడుచు,—"అమ్మా! మీరు పూర్వ-
'ము అంచు కుట్టుటకు కొన్ని తుడుపు గుడ్డలు నాకు ఇయ్య గోరితిరి.
'అవి మీవద్ద ఇంక నున్నవా?" అని అడిగినందుకు, నేను—"లేవు,
'చాలా దినములక్రిందటనే వాటిని కుట్టించినాను. అయితే నీవు
'ఎందుకు అడుగుచున్నావు?" అని అడిగిన మీదట, కరుణ అనిన-
మాట;—"ఆ తుడుపు గుడ్డలు మీయొద్ద ఇంక ఉండినట్టయితే, ఇప్పుడు
'నేను వాటిని కుట్టుదును. ఎందుకంటే, నా పెనిమిటియు నా కుమా-
'రుడును నాకు సహాయము చేయరనేది స్పష్టముగా కనుపించుచు-
'న్నది. కాబట్టి, నాయంతట నేను పని చేసుకొనకపోతే, మేమం-
'దరమును చెడిపోదుము" అనెను. కరుణ పూర్వము ఈ చొప్పున మాటలాడలేదు. అయితే ఇప్పుడు అది ఆడిన మాట విని సంతోషించినాను. మరియు ఇందువల్ల బీదల కొరకు ఆలోచన లేకుండా సొమ్ము ఇచ్చినట్టయితే, వారికి చాలా హాని తటస్థించునని నేను మునుపటికంటె మరి బాగుగా తెలుసుకొంటిని. ఏలాగుననంటే, పూర్వము కరుణయొక్క ఇబ్బందిని చూచి, దానికి రూపాయీలనే కాని, డబ్బులనే కాని, ఇచ్చియుంటే, అది ఇప్పుడు నన్ను పని నిమిత్తము అడుగక, ఊరకనే ఇంక భిక్షము అడుగుచునే యుండును. పని చేసుకొని సహాయము పొందే విధము బీదలకు నేర్పుట వారికి, చేసే ఇతర సహాయములకంటె, మిక్కిలి ఉపయోగకరమైనది. ఇది నాకు

తెలుసును గనుక, కరుణను ప్రోత్సాహ పెట్టుటకు నేను దానితో,— "ఆ తుడుపు గుడ్డలన్నియు కుట్టబడి యున్నవి. కాని ఇప్పుడు నా 'యొద్ద ఒక కోరా బట్ట ఉన్నది. దానిని కత్తిరించి, పరుపుల మీద 'పరిచే దుప్పటముల క్రింద చేయబోవుచున్నాను గనుక, రేపటి దిన- 'ము నీవు నవీనుని నా యింటికి తీసుకొని వచ్చినప్పుడు, ఈ దుప్ప- 'టములను అన్నిటినిని అంచు కుట్టుటకు నీకు ఇత్తును. నీవు పని 'చేసుకోవలెనని యున్నావు గనుక, నేను నిండ సంతోషించుచుం- 'న్నాను. అయితే నేటి దినము నీ యింటిలో నీకు ఏమియు లేదు 'గనుక, ఇదిగో ఈ ఒక రూపాయీ పుచ్చుకొని, నీ కుట్టు పని అయిన 'తరువాతను, దానిని నాకు తిరిగి ఇయ్యవలెను" అని చెప్పితిని. కరుణ రూపాయీ చూడడముతోనే సంతోషించి, సలాము చేసి, దానిని తీసుకొనినది. నేను సాధువు నిమిత్తమును సత్యవతి నిమిత్తమును కొంచెము మిఠాయీ తెచ్చితిని గనుక, ఇంటికి వెళ్లకమునుపు, దానిని వారికి ఇచ్చుటకు వెళ్లితిని. సాధువు తండ్రి అయిన ప్రేమచందు ఇంటి దగ్గర నుండెను. అతడు తన భార్యయొద్ద కూర్చుండి యుండెను. వారు ఉభయులును కొన్ని రూపాయీలను డబ్బులనును ఎంచుకొ- నుచున్నందున, వారి దృష్టి అంతయు దాని మీదనే యుండెను గనుక, నేను మొదట ఇంటిలో ప్రవేశించిన సంగతి వారికి తెలియ- కపోయెను. అయితే ఫుల్మనీ నన్ను చూడగానే, త్వరగా లేచి, సలా- ము చేసి, రూపాయీలను డబ్బులనును పోగుచేసి, ఒక దరిగా త్రోసి,— "అమ్మగారూ! నా పెనిమిటికి నేడు జీతము దొరికినది గనుక, ఈ 'నెల వెచ్చముల నిమిత్తము ఏలాగున జాగ్రత్త పడవచ్చునో అని 'విచారించుకొనుచుంటిమి" అనెను. అందుకు నేను—"అలాగున- 'నైతే, మీరు దయచేసి లెక్కలను సమాప్తము చేసుకొనుడి, ఎందు- 'కంటే, మీ గృహ కృత్యమును గురించి ఏ యాటంకమునైన పెట్టు- 'టకు నాకు మనస్సులేదు. ఇదిగాక, నీ పొరుగుననున్న కరుణకు,

'సొమ్ము చూచి వాడుకో వలసిన రీతిని నేను నేర్పగలిగేటట్టుగా,
'ఒక బంగాళీ ఇంటి వ్రయ భాగమును గురించి కొంతమట్టుకు నేర్చు-
'కొనుటకు మిక్కిలి ఆశ కలిగియున్నాను" అని చెప్పితిని. ఇది
వినియు, ప్రేమచందును ఫుల్లనియు నా యెదుట తమ లెక్కలు ఉంచి
చూచుకొనుటకు ఒక మాత్రమున ఒప్పక యుండగా, వారిని నేను
చాలాగా బతిమాలిన మీదట, వారు తిరిగి తమ లెక్కలను చూచు-
కొన నారంభించిరి. ప్రేమచందు తన భార్యను చూచి,—"నా యేడు
'రూపాయీల జీతములోనుంచి ఒక రూపాయీ తీసి, బోధకుని యొద్ద
'దాచి పెట్టినాను. గనుక ఈ రూపాయీతో కూడ ఇప్పటిమట్టుకు
'పదునాలుగు రూపాయీలు వారి యొద్ద పెట్టుబడిగా నున్నవి. ఇది-
'గో! ఇప్పుడు ఆరు రూపాయీలు తెచ్చినాను. ఇప్పుడు నీవు ఎంత
'సొమ్ము సంపాదించినావో చూతము" అని చెప్పితే, "నేను పాలు
'అమ్మికొని మూడు రూపాయీల పన్నెండు అణాలు సంపాదించి-
'నాను. అందులోనుంచి ఆవు మేతకొరకు ఒక రూపాయీ పన్నెం-
'డు అణాలు ఇస్తిని గనుక, దానిని మనము లెక్కలోనికి తేనక్కర-
'లేదు. శేషించినవి సరిగా రెండు రూపాయీలు ఉన్నవి" అని ఫుల్లనీ
చెప్పెను. అందుకు ప్రేమచందు—"అయితే నా ప్రియురాలా! ఈ
'డబ్బులు నీకు ఎక్కడనుంచి వచ్చినవి?" అని అడుగగా, ఫుల్లనీ చెప్పినది,-
"మూడు నెలలనుంచి కరుణ నిమిత్తము ఒక ముతక కోక కొనుటకు
'పది అణాలు కూడబెట్టితిని. ఈ దౌర్భాగ్యపు స్త్రీకి బట్టల విషయమై
'కలిగి యుండే ఇబ్బందిని చూడలేకుండ ఉన్నాను. మహేంద్ర
'బాబుయొక్క భార్య నిమిత్తము మూడు కుడతాలను కుట్టి యిచ్చి,
'అందుకు ఆరు అణాలు సంపాదన చేసుకొంటిని. ఈ దొరసాని సాధు-
'వునకును సత్యవతికిని చెరి నాలుగు అణాలు దయచేసి ఇచ్చినది.
'అందులోనుంచి వారు చెరి రెండు అణాలు ఈ కోక కొనే నిమి-
'త్తము నాకు ఇచ్చిరి. దానితో పది అణాలు ఆయెను" అనెను.

అందుకు ప్రేమచందు ఇట్లనెను;—"ఫుల్మనీ! నీవు బాగుగా జరిగించి-
'నావు. రేపటిదినము ఒక బట్ట తీసుకొని వత్తును. దానిని నీవు కరు-
'ణకు ఇచ్చేటప్పుడు దానితో— 'నీకు ఈ కోక దొరికినది గనుక,
'ఇంతటినుంచి నీవు ప్రతి ఆదివారమును దేవాలయమునకు వెళ్లుమని'
'చెప్పవలసినది. ఎందుకంటే నేను దానితో దేవాలయమునకు వెళ్లడ-
'మును గురించి మాటలాడినప్పుడెల్ల, బట్టలు లేవు అనే నెపమును కల్పన
'చేయుచువచ్చును. అయితే అది అలాగున ఉండనిమ్ము. ఇప్పుడు
'లెక్కలు వ్రాయ నారంభింతును. సొమ్ము అంతయు పోగుచేస్తే, మనకు
'తొమ్మిది రూపాయీల పది అణాలు ఉన్నవి. ఇందులోనుంచి ఒక
'రూపాయీ దొరగారియొద్ద ఉంచి యున్నాను. పది అణాలు కరుణ-
'యొక్క కోక నిమిత్తము ఉంచుదము. రెండు అణాలు ప్రభు భో-
'జన సమయమునందు అయ్యే చందా నిమిత్తమును, రెండు అణాలు
'బోధకుల సభకుగాను ప్రతి మాసము ఇచ్చే చందా నిమిత్తమును
'ఇయ్యవలసినది. ఇవి అన్నియు రూపాయీ పదునాలుగు అణాలు
'అగును. ఇకను ఏడు రూపాయీల పన్నెండు అణాలు నిలువ యున్నవి.
'ఫుల్మనీ! ఈ లెక్క సరే కదా?" అనెను. ఫుల్మనీ కొంతసేపు లెక్క
చూచుకొని,—"సరిగానే ఉన్నది, అయితే సాధువు నిమిత్తము ఒక
'పెద్దబైబిలు పుస్తకమును కొనుటకు ప్రతిమాసమును రెండు అణాల
'చొప్పున ఉంచుచుండే లెక్కను మరచి పోతిమి" అని చెప్పగా,
ప్రేమచందు—"అవును వాస్తవమే. ఈ రెండు అణాలు గాక ఒక
'హిందూస్త్రీ నిమిత్తము ఇంక నాలుగు అణాలు పుచ్చుకొందును. ఈ
'దినము దొరగారి పనిమీదను శేఘురీ అనే గ్రామమునకు వెళ్లవలసి
'వచ్చెను. అక్కడికి నేను వెళ్లగానే, ఒక చెట్టుక్రింద ఒక విధవస్త్రీ
'ప్రసవవేదన పడుచుండగా చూస్తిని. అయితే ఆమెకు సాహాయ్యమైనను
'ఇచ్చుటకు ఎవరును లేకపోయిరి గనుక, నేను ఒక దుకాణము దగ్గ-
'రకు వెళ్లి, ఆమె నిమిత్తము రెండు అణాలు అప్పుచేస్తిని. కాబట్టి రేపు

'నేను తిరిగి వెళ్లి ఆ రెండు అణాలు ఆ మనుష్యునకు ఇచ్చి వేసి, ఆ 'దిక్కులేని స్త్రీకికూడ రెండు అణాలు ఇచ్చి వత్తునని" చెప్పెను. అందుకు ఫుల్మని,—"మంచిది, అలాగుననే చేయుడి. అప్పుడు ఇంటి వ్రయము నిమిత్తము ఏడు రూపాయీల ఆరు అణాలు నిల్వ యున్నవి" అని చెప్పినప్పుడు, ప్రేమచందు-"అవును ప్రియురాలా! అది చాలదా!" అని అడిగెను. అతని భార్య నవ్వుచు,—"జాగ్రత్తగా వాడుకొంటే, ఎందుకు చాలదు! ఉన్నకష్టము ఏమంటే, ఈ నెల ప్రియనాధుని నిమిత్తము రెండు అంగీలు కొనవలెను. అయితే నేమి, నేను అతని కొరకు బట్టలు కొనే నిమిత్తము కొంత కుట్టుపని చేసుకొనవలెను" అనిచెప్పెను. ఈ సంభాషణను ముగించిన తరువాత, ప్రేమచందు రూపాయీలను డబ్బులను వరుసగా వేటికి వాటిని ఉంచి, ధర్మకార్యముల నిమిత్తమైన సొమ్ము తన చేతిలో ఉంచుకొని, మిగిలిన దానిని ఫుల్మనీకి ఇచ్చి,—"ప్రభువు మనలను మేపెడివాడు, మనకు లేమి కలుగదు. మనకు నానాటికి తగిన అన్నము పెట్టుచున్నాడు" అని చెప్పెను.

ఈ భక్తిగల కుటుంబముయొక్క మంచి నడతను సంతోషమును నేను చూచి, కరుణయొక్క దుఃఖమును జ్ఞాపకము చేసుకొనక ఉండలేకపోతిని. అటుతరువాత దేవుని సేవకులు వాస్తవముగా నెమ్మదిగల మార్గమున నడుచుచున్నారనియు, వారి త్రోవలన్నియు రమ్యముగా నున్నవనియు, నా మనస్సులో అనుకొంటిని. అయితే దుర్మార్గులు కల్లగల సముద్రమువలెనే యున్నారు. అది నిమ్మళించలేక, దాని జలములు బురదను మైలనును పైకి లేవనెత్తుచున్నవి. దుర్మార్గులకు క్షేమము లేదని నా దేవుడు పలుకుచున్నాడు. (యెషయా. 57: 21.)

అటుతరువాత ఫుల్మనీ కొంచెము తొందరపడి,—"వేళ అయినది. ఈ దినము పిల్లలు బడినుంచి ఎందుకు రాకపోయిరి!" అని పలికెను. ఇది విని ప్రేమచందు వారిని వెదకే నిమిత్తము వాకిలి బయటికి వెళ్లెను. కొంచెము సేపటికి అతడు మిక్కిలి దుఃఖముతో తిరిగి వచ్చి, బల్ల

మీదనుంచి ఒక బెత్తము తీవ్రముగా తీసి, దానిని చేతపట్టుకొని బయటికి పరుగెత్తెను. దీనివల్ల అతడు ఏదో ఒక దుఃఖకరమైన సంగ-తిని చూచి యుండెనని నేను అనుకొంటిని. ఎందుకంటే, ఇంతకు ముందు ఎప్పుడును ప్రేమచంద్రుయొక్క నిర్మలమయిన ముఖమునందు ఇటువంటి కోప చిహ్నాను నేను చూచి యుండలేదు. అప్పుడు ఫుల్లనీ కిటికీ విప్పి, బయట చూడగానే,—"ఓ దేవా! నా పిల్లను సైతాను చేతి-లోనుంచి విడిపించుము" అని యెలుగెత్తి పలికెను. భార్య భర్తల-మనస్సులు మిక్కిలి కలతగా నుండడము చూచి, నేను చాలా భయపడి, ఏమి సంభవించినదో అని చూచుటకు బయటికి త్వరగా వెళ్లితిని. అప్పుడు నేను సాధువును సత్యవతియు గ్రామములో-నికి రావడము చూచితిని గాని, కరుణయొక్క కుమారుడైన వంశి వా-రితో కూడ నడుచుచు, డబ్బులు ఎగరవేసి వాటిని పట్టుకొనుచు నుండెను. సాధువును వాటిని పట్టుకొనుటకు ప్రయత్నము చేయు-చుండెను. ప్రేమచందు వారి యొద్దకు పరుగెత్తి, సాధువును బెత్తముతో రెండు మూడు దెబ్బలు కొట్టి, వాని చెయ్యి పట్టుకొని, ఇంటిలోనికి లాగుకొని వచ్చెను. అప్పుడు సాధువు,—"అయ్యా! కోపపడకుడి, ఈ విషయములో నేరము నాది కాదని వాస్తవముగా మీతో చెప్పుచు-న్నాను"అని చెప్పెను. అందుకు అతనితండ్రి,—"నీనోరు ముయ్యుము సాధువూ! నీ తప్పితము దాచ కోరడమువల్ల నీ పాపమును పెంపు చేయుచున్నావు. నీవు ఒక దుర్మార్గపు చిన్నవానితో సహవాసము చేసి, జూద మాడుటకు నేర్చుకొనుచున్నావు. ఇందులో ఏమియు తప్పితము లేదని చెప్పుచున్నావా!" అని కఠినముగా పలికెను.

అటుతరువాత సత్యవతి ఏడ్చుచు, తన సహోదరుని మెడ కౌగ-లించుకొని,—"అయ్యో! అన్నా! దుర్మార్గుడైన ఆ వంశి నీ డబ్బులు తీసుకొనకపోతే, ఈ ఆపత్తు అంతయు సంభవించకయే పోవును" అనెను. సాధువు బెత్తపు దెబ్బలు తిని యేడవలేదు గాని, తన చెలి-

యలియొక్క ప్రేమ సూచకమైన నడవడి చూచి, వెక్కి వెక్కి యేడవ సాగెను. అంతట ప్రేమచందు-"సత్యవతీ! నీవు ఒక చెంపను కూర్చుండు 'నేను సాధువునకు చెప్పవలసినది కొంత ఉన్నది" అని చెప్పగా, సత్యవతి తన తండ్రి ఆజ్ఞలకు విధేయురాలై పుల్లనీని కౌగలించుకొని యేడ్చెను. ప్రేమచందు సాధువును చూచి,—"నీవు ఈ దుర్మార్గపు చిన్న'వానితో ఎందుకు నడుచుచుంటివి?" అని అడిగెను. అందుకు సాధువు "అయ్యా! నేను అతని యొద్దకు వెళ్లలేదు. అతనే మాయొద్దకు వచ్చి,మాతో 'కూడ నడువసాగెను" అని పలికెను. అందుకు ప్రేమచందు—"అలా'గుననైతే, నీవు వానిని తక్షణమే విడిచి, యింటికి ఎందుకు రాలేదు!" అంటే, సాధువు—"అయ్యా! నావి కొన్ని డబ్బులు వాని దగ్గర నుండెను. 'నాకు ఈ దినము బడిలో బహుమాన పూర్వకముగా నాలుగు డబ్బు'లు దొరికెను. ఈ డబ్బులను వంశి నా చేతిలోనుంచి ఊడలాగికొ'నెను" అనెను. అందుకు ప్రేమచందు—"సాధువూ! జాగ్రత్తపడుము, 'నీవు సొమ్ముతో జూదమాడుచుండగా, నా నేత్రములతో నేను చూ'డలేదా!" అని అడిగినందుకు, సాధువు అనిన మాట,—"అయ్యా! లేదు. 'నేను అలాగున చేయనేలేదు. 'రా, డబ్బులాట ఆడుదము. నీ అదృ'ష్టము తిన్నగా నుంటే, నీవు నీ నాలుగు డబ్బులుమాత్రమే కాకుండ, 'వాటితో కూడ నా నాలుగు డబ్బులును గెలువ వచ్చును" అని వం[illegible] 'చెప్పెను గాని, నేను అలాగున చేయలేదు. అయితే నా స్వకీయ'మైన డబ్బులు అతని చేతిలోనుంచి తిరిగి లాగుకొనుటకు ప్రయత్నము 'మాత్రము చేసినాను" అనెను. ప్రేమచందు ఈ వెల్లడి అయిన సంగతి నంతయు విని,—"మంచిది, సాధువు. నేను అనుకొనినట్టు, నీవు అంత'గా నేరముచేసి యుండలేదు. ఇందుకు దేవుడు స్తుతింపబడుగాక. 'అయినప్పటికి, నీవు ఈ దుర్మార్గపు చిన్నవానితో ఏ హేతువుచేతనైన 'ఒక నిమిషమైన ఉండడమువల్ల అపరాధివి అయితివి. ఎందుకంటే 'కీడుయొక్క సూచనలను విసర్జించుమని వ్రాసి యున్నది. మరియు

'నీవు డబ్బు సంపాదించుకొనుటకు దేవుని ఆజ్ఞలను అతిక్రమించడము-
'కంటె, నీ డబ్బులను బొత్తుగా పోగొట్టుకొనడము మేలైయుండును.
'ఇదిగాక చూడుము. వంశి నీకంటె రెండంతల పెద్దవాడును బలము
'గలవాడును అయ్యుండగా, వానియొద్దనుంచి నీ డబ్బులు బలాత్కా-
'రముగా రాబట్టుకొన గలుదునని ఏలాగున అనుకొంటివి? కాబట్టి
'నేను అనేది యేమంటే, సొమ్ము పోతే పోయినది, మేతే" అని పలికెను.

సాధువు తల్లియు తలపోయుచు,—"హా! సాధువూ! నీ డబ్బులు పోయి-
'నప్పటికిని, నీవు ఇంటికి మాత్రము వచ్చినట్టయితే, బాగుగా ఉం-
'డెదే. ఎందుకంటే, వంశితో బొత్తుగా సహవాసము చేయవద్దని నీ
'తండ్రి నీతో ఇదివరకు ఎన్నిమారులు చెప్పియున్నాడు. ద్రవ్యా-
'పేక్ష సమస్తమైన కీడునకును ఒక మూలమై యున్నదని నీవు బా-
'గుగానే యెరుగుదువుగదా. అయితే నీవు డబ్బుమీదను నిండ ఆశ-
'గా నున్నట్టు నాకు తోచుచున్నది" అని చెప్పెను. అందుకు సాధువు—
"లేదు, లేదు, నాకు డబ్బుమీద ఆశలేదు. అయితే వంశి నా డబ్బు-
'లను బలవంతముగా తీసుకొనెను గనుక, నేను కోపపడి, వాటిని తిరిగి
'రాబట్టుకొనుటకు ప్రయత్నము చేస్తిని. అమ్మా! ఈ అంశమందు
'వంశియే నిండ అపరాధి అని స్పష్టము కాదా?" అని చెప్పితే, పుల్లని
అన్న మాట;—"వాడు అపరాధి అనుటకు సందేహము ఏమియు
'లేదు. అయితే వాడు అపరాధి అనగా, నీవు నిరపరాధివి కాలేదు.
'నీవు నేటి ఉదయమందు, ఓ దేవా! నన్ను శోధనలోనికి తేవద్దని
'ప్రార్థించియు, నీకై నీవు శోధనలోనికి ప్రవేశించితివి. మరియు, నీ
"తండ్రి నిన్ను చూడక, అందులోనుంచి నిన్ను లాగి తీసుకొని రాక-
'పోతే, చివరకు నీవు జూదము ఆడసాగి, వేరే ఘోరమైన పాపము-
'లో పడిపోవక ఉందువని యెవరు చెప్పగలరు?" అనెను. సాధువు
తన తల్లి ఈ చొప్పున మాటలాడుట విని, తన్ను తాను నీతిమం-
తునిగా చేసుకో వలెననే తాత్పర్యమును వదిలి,—"హా! అయ్యో!

'ఈ పర్యాయము నన్ను క్షమించుము. నేను ఇప్పుడు జరిగించినది తిరిగి 'యెప్పటికిని జరిగించనని" చెప్పెను. అటుతరువాత ప్రేమచందును ఫుల్లనియును సాధువుయొక్క చెయ్యి పట్టుకొని, లోపలి గదిలోనికి తీసుకొని వెళ్లిరి. సత్యవతి అప్పుడు నెమ్మది గని, కన్నులు తుడుచుకొని, నన్ను చూచి,—"అమ్మా! ఇప్పుడు నా తల్లియు నా తండ్రియు సాధు- 'వుతో కూడ ప్రార్థించి, దేవుడు అతనిని క్షమించవలసినదని అడుగు- 'కొందురు. అటుతరువాత అంతయు పరిష్కారమై, వారు వానియందు 'యథాప్రకారముగా ప్రేమ ఉంతురు. మేము ఏది అయిన తప్పి- 'తము చేసితే, మా తల్లియు మా తండ్రియు ఎప్పుడును ఈ చొప్పున 'మాతో కూడ ప్రార్థింతురు" అని చెప్పెను.

ఓ బంగాళీ క్రీస్తు మతస్థులైన తల్లి దండ్రులారా! మీరందరును వెళ్లి, ఈలాగుననే చేయుడి.

ప్రేమచందు యొక్కయు ఫుల్లని యొక్కయు మనస్సు ఇప్పుడు జరిగినదానివల్ల కొంతమట్టుకు కల్త పారినదని చూచి, ఇప్పటికి వెళ్లి- పోవడమే ఉత్తమమని అనుకొని, నేను తెచ్చిన మిఠాయీ సత్యవతి- యొక్క చేతులలో పెట్టి,—"నా సలాము నీ తల్లి తండ్రులకు చెప్ప- 'వలసినది" అని చెప్పి, నేను ఇంటికి వెళ్లుటకు బయలుదేరినాను.

తలిదండ్రులు తమ పిల్లలయొక్క నిత్యాత్మలను నీతిమార్గమున నడపవలసినదని, తమకు దేవుడు యిచ్చియున్న గొప్ప ఆజ్ఞను నెరవేర్చి- నట్టయితే, ఎంత సంతోషముగా నుండును. ఓ తలిదండ్రులారా! మేలును గురించియు కీడును గురించియు మీ పిల్లలకు బోధించడము- వల్ల, దేవుని దృష్టికి మీరు ఉత్తరవాదులని మీరు బాగుగా ఎరుగుదురు. కాబట్టి మీరు మీ ప్రియమైన చిన్న పిల్లలను దండించుడి. వారి- కొరకు ప్రార్థించుడి. మీరు చేతనైనంతమట్టుకు కీడునుంచి వారిని విడిపించుడి. వారిని నీతి మార్గమునకు కొంచు పొండి. ఏది పాప- మో, ఏది పాపము కాదో, వారికి తెలుపుడి. విశేషముగ వారు

మీ చక్కని నడతను చూచి, మిమ్ములను పోలి యుండుటకు ప్రయత్న
పడేలాగున, మీరును తిన్నగానే నడుచుకొనుడి.



## ౬. అధ్యాయము.



మరునాడు చీకటితోనే కుట్టువాఁడైన నవీనుడును వాని తల్లియు నా యింటికి వచ్చిరి. అప్పుడు నేను ఆ చిన్నవానికి నాలుగు లాగులను, నాలుఁగు చొక్కాలనును అవ్యవధానముగా చేయవలసినదని నా దర్జీతో చెప్పితిని. అందుకు అతడు ఆ చిన్నవాని కొల పుచ్చుకొనుచుండఁగా, ఆ చిన్నవాని గర్వము చూచి, నవ్వు అణుచుకొనలేక పోయినాను. ఎందుకంటే, ఈ బీద చిన్నవాఁడు, ఒక చింపిరి గుడ్డ తప్ప, ఇంకొకటి ఎప్పుడును కట్టుకొని యుండలేదు. కాబట్టి వీడు దర్జీ చేతిలోనున్న సన్నపు బట్టను ఎఱ్ఱ గోటునను చూచి, ఆ బట్ట ధరించడములోనే, తాను ఒక దొరను అగుదును గదా అనుకొనెను. కరుణ తలపోయుచు, మనోవ్యాకులముచేత మౌనముగానుండి, తనకు దొరికిన కొన్ని దుస్పటములను మడత పెట్టుకొని, ఇంటికి వెళ్లనైయుండి;—"హా! అమ్మా! నవీనుని మీకు బొత్తుగా ఇచ్చివేయుచున్నాను. 'వీడు ఇకను నా కుమారుడు కాడు, మీ కుమారుడే. ఇకను వీని విష-'యమై నాకు ఏ విధమైన చింతయు లేదు. అయితే మీరు నా కొ-'రకు దేవుని అప్పుడప్పుడు ప్రార్థింతురని మాత్రము కోరుకొను-'చున్నాను" అని చెప్పెను. అందుకు నేను ఇట్లంటిని,—"కరుణా! నీవు 'పుల్లనియొక్క ఇంటిలోనుండి గులాబీ చెట్టును విరిచిన దినము మొద-'లుకొని, నీకొరకు దేవుని ప్రార్థించుచు వచ్చుచున్నాను. నీవు 'చివరకు నిజమైన క్రీస్తు మతస్థురాలవై, నీ పెనిమిటితో కూడ సుఖ-'ముగా నుందువని నాకు రూఢిగా తోచియున్నది. మంచిది, అతడు

'రాత్రి ఇంటికి వచ్చినాడా?" అంటిని. అందుకు కరుణ—"అమ్మా! నిన్నటి 'దినము ఆయన తిరిగి యెందుకు వచ్చును? అయితే నేడుసాయంకాల- 'మందు తిరిగి వచ్చి, అన్నముకొరకు అల్లరి చేయును. అన్నము ఉంటే 'బాగుగానే యుండును. లేకపోతే నాకు తిరిగి దెబ్బలు తగులును" అని చెప్పెను. అందుకు నేను అన్న మాట;—"నీకు నేడు దెబ్బలు తగల- 'నక్కరలేదు. నీకు ఒక రూపాయి యున్నది గదా. దానితో మంచి 'చేపలను కొని, రుచి గల కూరను వండుకొనవచ్చును. అయితే ఒకటి 'చెప్పుచున్నాను. ఆ చొప్పున చేయుదునని నీవు నాకు ఇప్పుడు 'మాట ఇయ్యవలసినది. అది యేదంటే, నీవు ఇల్లు శుభ్రము చేసి, 'చక్కగా సవరించి, నీ పెనిమిటి వచ్చేటప్పుడు, అతనిని నవ్వుమొగ- 'ముతో ఎదురుకొని, అతనితో దయగా మాటలాడుము. నీవు ఈ 'చొప్పున చేసితే, అతడు నిన్ను దయగా చూడక మానడు. నా మా- 'టలు వాస్తమైనవో, కావో, పరీక్షించి చూడుము" అంటిని. కరుణ నిట్టూర్పు విడిచి,—"మంచిది, అమ్మా! మిమ్ములను సంతోష పెట్టుటకు, 'మీరు చెప్పిన బుద్ధి మాట ప్రకారము జరిగించుదును గాని, నా పెని- 'మిటి యెప్పటికిని దారికి రాడనేమాట నాకు బాగుగా తెలుసును" అంటే, అందుకు నేను—"అలాగున మాటలాడవద్దు, నీకు అక్కర పట్టి- 'నట్టయితే, ఎటువంటిగానినైన నెరవేర్చవచ్చును. మరియు దేవునికి 'అసాధ్యమైనది ఒకటియు లేదని జ్ఞాపకము ఉంచుకో" అని చెప్పితిని.

కరుణ సెలవు పుచ్చుకొని వెళ్లిపోయి, వెంటనే తిరిగి వచ్చి,—"అమ్మా! 'నేను ఒక ముఖ్యమైన సంగతిని మరచిపోయినాను. ప్యారి మిక్కిలి 'రుగ్మత్తగా నుండి, మీరు ఆమెను వచ్చి చూచేలాగున, నన్ను మీతో 'చెప్పుమని బతిమాలినది" అని చెప్పెను. నేను ఇది విని,—"అయ్యో! 'ఈ సంగతి నాకు ఇంతకు పూర్వము తెలిసినట్టయితే, బాగుగా నుం- 'డును. అయితే జరిగినదానికి ఏమి చేయగలము. ఈ సాయంకాలమే 'నేను వెళ్లి ఆమెను చూతును" అని చెప్పితిని. ప్యారితో నేను

స్నేహము చేసినది మొదలుకొని, ఆమె ఇంటికి తరుచుగా వెళ్లి, ఆమెతో అనేకముగా మాటలాడియుంటిని. అందువల్ల ఆమెయెడల నుండే నా ప్రేమ వృద్ధిపొంది యుండెను గనుక, సాయంకాలము కాగానే, ప్యారినిమిత్తము కొన్ని దానిమ్మపండ్లు పుచ్చుకొని, వాటిని మోసుకొని నాతో కూడ రాగలందులకు ఆయాను పిలిచి, క్రీస్తు మతస్థులు ఉండే పల్లెకు వెళ్లితిని.

ఇప్పుడు నేను ఆయాను గురించి కొంత కథ చెప్పవలెను. మునుపు అది క్రీస్తు మతములో నుండే అనేకాంశములను ఆక్షేపించుచు వచ్చెను. అయితే అది పుల్లనియొక్క పరిచయము కలిగినది మొదలుకొని, రాగా రాగా వ్యర్థమైన ఆక్షేపణలు చేయడము మాని, చాలామట్టుకు ఉపశాంతి కలదై యుండెను. నాకు తెలియకుండానే, అది అనేక పర్యాయములు పుల్లని యింటికి వెళ్లుచు వచ్చెనని వింటిని. మరియు సాధువును సత్యవతియును దాని యింటికి తరుచుగా వచ్చి, రొట్టెను మిఠాయినిని తీసుకొని పోవుచుండగా, కన్నులారా చూచినాను. ఈ చిహ్నలవల్లను అది అందరియెడల శాంతముగా ప్రవర్తించడము నేనే చూచుచుండుటవల్లను, దేవుని ఆత్మ దాని హృదయములో తనవాక్యమనే విత్తనమును క్రమముగా అంకురింప చేయుచున్నాడని అనుకొంటిని. అయితే ఇదంతయు నేను చూచి యున్నప్పటికి, అప్పటిలో ఈ సంగతిని గురించి ఆయాతో ఏమియు చెప్పలేదు. ఎందుకంటే, పూర్వము నేను క్రీస్తు మతమును గురించి దానితో మాటలాడినప్పుడు, నేను దానికి యజమానురాలనైన సంగతి దానికి తెలిసి యుండెను గనుక, అది భయముచేతను తన నోటి మాటలతో మాత్రమే నేను చెప్పినదంతయు ఒప్పుకొనేది గాని, వాస్తవముగా దాని మనస్సులో అనేకాక్షేపణలు ఉండెను. ఇదంతయు నాకు తెలిసినది గనుక, పుల్లనియు దాని పిల్లలును నాకంటె బాగుగా ఈ ఆయాకు నేర్పగలరని అనుకొంటిని. అయితే దాని మనస్సు

క్రీస్తు మతమునకు అనుకూల పడేలాగున, నేను ఎల్లప్పుడును ప్యారి-యింటి నిజమైన క్రీస్తు మతస్థులను చూడ వెళ్లినప్పుడెల్ల, దానిని నాతో కూడ వెంట బెట్టుకొని వెళ్లుటకు ప్రయత్నము చేసేదానను. ఎందు-కంటే, మనము ఆడేమాటలవల్ల కాకుండ, మన మంచి నడతవల్లనే ఇతరులకు మన మతముయొక్క సత్యము బోధ కావచ్చునని నేను బా-గుగా తెలుసుకొని యుంటిని.

నేను ప్యారియొక్క ఇల్లు చేరగానే, ముంగిట పుల్లని తన ముసలి స్నేహితురాలికొరకు కొంత సగ్గు బియ్యము వండుచుండడము చూ-స్తిని. ముసలి ప్యారి తన రుగ్మతవల్ల మిక్కిలి బలహీనురాలై యున్న-ప్పటికి, నన్ను చూడడముతోనే సంతోషపడి,—"అమ్మా! ఈ వ్యాధి 'కుదిరేది కాదు. ఇప్పుడు పరలోకమునందుండే నా తండ్రియొక్క 'ఇల్లు చేరుదునని అనుకొనుచున్నాను" అనెను. అప్పుడు నేను,—"ప్యారీ! దేవునిచిత్తము ఈ చొప్పున నుంటే, నీవు అక్కడికి వెళ్లు-'టకు మనస్సు కలిగి యున్నావా, లేదా!" అని అడిగినందుకు, ఆమె అన్నమాట;—"హా! పరలోకమునకు వెళ్లుటకు నాకు ఇష్టము లేకుండ 'ఉందునా? తమరు విచారించుడి. ఇక్కడ ఈ చిన్న పూరి యిం-'టిలో నున్నాను. అక్కడ యేసుతోకూడ ఏలుదును. ఇక్కడ శరీర 'బలహీనముచేతను పాప స్వభావముచేతను దేవునకు విరోధముగా 'అనుదినమును పాపము చేయుచున్నాను. అక్కడ ఈ మర్త్య శరీ-'రము అమరత్వమును ధరించునప్పుడు, దేవుని సింహాసనము నెదుట 'నిరపరాధినిగా నిలుతును. హా! అమ్మా! పరలోకములో ఎంతమా-'త్రమును పాపము లేదు. పాపము లేని చోటు ఎంత సంతోషకరమైన 'చోటై యుండవచ్చును!" అనెను. అందుకు నేను,—"అవును, ప్యారీ! 'అది వాస్తవమే. ఎందుకంటే, ఇహమందు పాపము సమస్త దుఃఖ-'మునకును మూలమై యున్నది. అయితే నిన్ను ఒక సంగతి నన్ను 'అడుగనిమ్ము. నీవు మరణచ్ఛాయయొక్క లోయగుండ నడిచి పోవు-

'మన్నావు గదా? నిన్ను పాప బంధమునుంచి విడిపించి, మోక్ష నిరీ-
'క్షణము నీకు కలుగ చేసియున్న ఆయనయందు ఇప్పుడు నీకు చాలా
'ప్రేమ కద్దా?" అని అడిగితిని. అందుకు ప్యారి ఇట్లనెను;—"అవును,
'అమ్మా! నా రక్షకుడు పదివేలమందిలో శ్రేష్ఠుడై యుండి, కేవలమును
'ప్రియుడై యున్నాడు. ఆయన నాతోకూడ నివాసముగా నుండి,
'నాకు నెమ్మది నిచ్చుచున్నాడు. మరియు ఆయనయొక్క మరణ-
'మునందు తప్ప, నాకు దేనియందును ఆస్పదము లేదు. నీ నామము
'స్తుతింపబడుగాక! స్తుతింపబడుగాక! ఎందుకంటే, నీవు నీ విలువ-
'లేని నెత్తురువల్ల సైతాను చేతిలోనుంచి నన్ను విడిపించి యు-
'న్నావు. ఓ యేసూ! నీ ప్రేమ ఎంతో ఆశ్చర్యకరమైనది! ఆ ప్రేమ
'యొక్క నిడివిని వెడల్పును లోతును ఎత్తును ఎవరు వివరించ
'గలరు!" అనెను.

ప్యారి ఇది ఊతముగా పలికి, అలసిపోయి, తలగడ మీదను తల
వెనుకకు వ్రేల వేసుకొనెను. ఇది చూచి, నా ఆయా ఆమెకొరకు
ఒక దానిమ్మపండు విరిచి, కొన్ని గింజలు ఆమెకు ఇయ్య సాగెను.
ఆమె దానిచేతిలోనుంచి వాటిని పుచ్చుకొని, దాని ముఖమును తేరి
చూచి,—"ప్రియమైన ఆయా! నీవు క్రీస్తు మతస్థురాలవు కావు కాబో-
'లును" అని అక్కరగా పలికెను. అందుకు ఆయా,—"కాను. నేను
'తురకదానను" అనెను. అది ఆ ప్రకారముగా చెప్పగానే, ఈ ము-
సలిస్త్రీ లేచి కూర్చుండి,—"ఓ ప్రియమైన ఆయా! నీవు క్రీస్తు మతస్థు-
'రాలవు కావు గనుక, నా మాటకు చెవి నొగ్గుము. నాకు బలము-
'న్నంతమట్టుకు ప్రభువైన యేసుక్రీస్తు నిజమైన రక్షకుడని సాక్ష్య-
'మిచ్చి, ఈ సంగతి నీయెదుట చెప్పుటకు నాకు సమయము దొరికి
'నందుకు, నేను దేవుని స్తుతించుచున్నాను. ఓ ఆయా! నన్ను చూడుము.
'రెండు మూడు దినములలోగా జనులు వచ్చి, నన్ను తీసుకొని వెళ్లి
'పాతి పెట్టుదురు. అయితే నేను అందుకు ఏమాత్రమును జడియను.

'మరియు మీలో ఎవరైన నాకు వేలతరబడి రూపాయిలు ఇచ్చి, ఈ
'లోకములో ఉండుమని నన్ను బోధపరచినప్పటికిని, చచ్చిపోవలె-
'ననే కోరుదును. ఈ కోరిక నాకు ఎందుకు ఉన్నదో, ఆ సంగతి
'నీకు చెప్పుదును. ఏమంటే, పుణ్య కార్యములవల్ల మోక్షము సంపా-
'దించితినని కాదు. ఓ అయా! పుణ్య కార్యములు చేసితే, మీకు
'మోక్షము దొరుకుననియు, పాపము చేసితే, నరకములోనికి త్రో-
'యబడుదురనియు, మీ ఖురానులో వ్రాసి యున్నది. తురకలలో
'మోక్షము సంపాదించుకొనే మార్గము ఇది తప్ప, మరి యొకటి
'లేదు. కాబట్టి ఓ అయా! దేవుడు ఈ కఠినమైన నిబంధనవల్ల విమ-
'ర్శించే పక్షమునకు, ఆయన యెదుట ఎవడు నిరపరాధిగా నుండగ-
'లడో, ఆ సంగతి విచారించుము. నీవే కాని, నేనే కాని, ఆ విమ-
'ర్శలో ఎన్నటికిని ఆగచాలము, ఎందుకంటే, దేవుని దృష్టికి మనము
'దోషులమై యున్నాము. మనయంతట మనము ఏ సత్కార్యము
'నయిన చేయలేము గనుక, మనుష్యులు బొత్తుగా చేయలేని దానిని
'చేసినంగాని, వారికి మోక్షము కలుగదు. ఎవడైన ఒకడు ఒక కుంటి-
'వానిని చూచి, దుముకుము, నడువుము, అలాగున చేయకపోతే, నిన్ను
'నరుకుదుననియైనను, లేక ఒక గుడ్డివానిని చూచి, ఇదిగో ఈ
'మేడను చూడుము, దీనికి సరిగా పటము వ్రాయుము, లేకపోతే,
'నీ ప్రాణమును పుచ్చుకొందును అనియైనను చెప్పితే, వీరు ప్రాణ-
'ములు పోవుననే భయముచేతను దుముకుదురా? పటము వ్రాయ
'కలుగుదురా? ఈ సంగతి యోజించుము. వారు ఆ ప్రకారముగా
'బొత్తుగా చేయలేరు. ఈ పనులను చేయలేము అనే తెలివిచేతను
'చచ్చిపోవుటకు సిద్ధముగా నుందురే కాని, మరి యొకటి కాదు. ఈ
'చొప్పుననే, మహమ్మదు, మోక్షము సంపాదించుకొనుటకు, సత్క్రి-
'యలు చేయుమని చెప్పుటకంటె, మరియొక మార్గము నీకు చూ-
'పలేదు. కాబట్టి నీవు ఉపకారముతో చేరిన క్రియలను లోపము

'లేకుండ చేసి యుండలేదు గనుక, నరక బాధలను పొందుటకు నీవు 'సిద్ధముగా నుండవలెను. అయితే నేను మరియొక మాట మాత్రము 'చెప్పెదును, వినుము. కొందరు తురకలు, దేవుడు నిండ కనికరము 'గలవాడు గనుక, మన పాపములను క్షమించునని చెప్పెదరు. ఇం- 'దుకు నేను చెప్పేది యేమంటే, దేవుడు తగిన ప్రాయశ్చిత్తము లేనిది, 'ఒక పాపమునైన క్షమించినట్టయితే, ఆయన ముఖ్యమైన లక్షణము- 'లలో ఒక దానికి లోపము వచ్చును. ఆ లక్షణము ఏదంటే, ఆయన- 'యొక్క న్యాయమనేదే. ఇందుకు నేను నీకు ఒక దృష్టాంతమును 'చెప్పెదును, వినుము. ఈ ఖండపు న్యాయాధిపతి దొంగలయొక్క యే- 'డ్పును మొఱ్ఱను విని వారిలో ఒకనినైన విడుదల చేసితే, అందుకు 'జనులు ఆయనను మెచ్చుకొందురా? మెచ్చుకొనరు. ఏమాత్రమును 'మెచ్చుకొనరు గనుక, ఆయన కేవలము చేతగాని న్యాయాధిపతి యని 'జనులు ఆయనను నిందించి, మా ఖండమునకు ఇంతకంటె మంచి 'న్యాయాధిపతిని పంపించవలసినదనియు, లేకపోతే దొంగల బలము 'అంతకంతకు ఎక్కువ అగుననియు, పై అధికారులకు తెలుపుదురు 'గదా? ఇందువల్ల పరలోకమునకును భూమికిని ఏర్పడి యున్న ఆ 'గొప్ప న్యాయాధిపతి యెవరి పాపములనైన ఎన్నటికిని అన్యాయ- 'ముగా క్షమించడని సులభముగా తెలుసుకొనవచ్చును" అని ఈ ప్ర- కారముగా ప్యారి మాటలాడిన అంతసేపు ఆయా మిక్కిలి శ్రద్ధగా వినెను. అయితే ప్యారి చాలా బలహీనముగా నుండెను గనుక, అది నేను కనుకొని, ఆమెను చాలించుమని చెప్పితిని. అయితే ఆమె—"లేదు అమ్మా! నేను చాలించను. ఈ ఆయాకు తురకల మత- 'ములో నుండే పొరబాటులను మాత్రమే తెలిపితిని, ఇప్పుడు దానికి 'క్రీస్తు మతముయొక్క శ్రేష్ఠతను నన్ను తెలుపనియ్యుడి" అని చెప్పెను.

పుల్లని సగ్గు బియ్యము వండి, లోపలికి తెచ్చినందున, ప్యారి అందులో కొంచెము పుచ్చుకొని, బలము పొందెను. అప్పుడు ఆమె

చెప్పినది యేమంటే,—"వినుము, అయా! వినుము. యేసుక్రీస్తు దేవుని 'కుమారుడై యున్నాడు. ఆయనే దేవుడును కరుణాసముద్రుడునై 'యున్నాడు. కాబట్టి మనుష్యులు స్వభావ సిద్ధముగా పాపాత్ములై 'యుండి, దేవుని ఆజ్ఞల ప్రకారము నడుచుకొనలేక, నరకములోనికి 'పడిపోవలసి యున్నదని ఆయన తెలుసుకొని, పాపాత్ముల కొరకు 'తన ప్రాణమును ఇచ్చి ప్రాయశ్చిత్తము చేయుటకు, పరలోకము-'లోనుంచి కిందికి వచ్చి, మనుష్య స్వభావమును స్వీకరించెను. అనీతి-'మంతులకు ప్రతిగా నీతిమంతుడైన ఆయన మరణముపొందెను. ఇది-'గాక, క్రీస్తు తప్ప మరి యెవరును ఇంత గొప్ప ప్రాయశ్చిత్తమును 'చేయచాలరని ఇంక చెప్పుచున్నాను. ఎందుకంటే, ప్రతి మనుష్యు-'డును తన పాపములను గురించి లెక్క ఒప్పగించవలసి యున్నది 'పరలోకపు దూతలును పాపము నిమిత్తము ప్రాయశ్చిత్తము చేయ-'చాలరు. ఎందుకంటే, దూతలు దేవునిచేత సృజింపబడినవారే 'అయితే ప్రభువైన యేసు క్రీస్తు అన్ని దేశములలోనుండే ప్రజలను 'రక్షించవలెనని కోరి, లక్షలతరబడి మనుష్యులయొక్క ప్రాణముల-'కంటె ఎక్కువ విలువ గల తన ప్రాణమును ఇచ్చి, మనయొక్క సమస్త 'పాపములనే అప్పును దేవునికి తీర్చెను. హా! అయా! ఇటువంటి విచి-'త్రమైన ప్రేమ నీకు ఎక్కడ దొరుకును!" అని పలికెను.

## కందపద్యము.

పరిక్రీస్తుప్రేమకొందే। నరయుదు నొకటిగినవస్తు వందునకొందే।
నరికానొకటియులేదిం। తొరుదున్మధురమ్మునైన యుదిపరమందుక్॥

యేసు తన శత్రువుల కొరకు చచ్చెను. హా! ప్రతి మనుష్యుడును ఇది ఒప్పుకొని, ఈ చొప్పున ప్రార్థించును గాక, ఏమంటే:—"ఓ దేవా! 'నేను దౌర్భాగ్య పాపాత్ముడను. యేసునందే నా నమ్మిక యున్నది. 'నా అప్పు తీర్చినవాడు ఆయనే గనుక, ఆయన పుణ్యకార్యముల

నిమిత్తమై నా పాపములను క్షమించుము" అని ప్రార్థించుగాక! అప్పుడు దేవుడు ఆ మనుష్యునియొక్క అన్ని పాపములను క్షమించి, అతనిని నీతిపరునిగా అంగీకరించును.

అటుతరువాత ప్యారి ఆయాతో ఊతముగా చెప్పినది యేమంటే,—"ఓ ఆయా! క్రీస్తు మతస్థురాలవు కమ్ము. యేసునందు నమ్మిక నుంచుము. ఆయన నీ పాపములకై ప్రాయశ్చిత్తము చేసెనని ఒప్పుకొనుము. ఆయన నా పాప దోషమును తన మీదను పెట్టుకొనెననే సంగతి నాకు రూఢిగా తెలుసును గనుక, నా న్యాయాధిపతిని ఎదురుకొనుటకు నాకు ఎంతమాత్రమును భయము లేదు. ఆయన నాకు శిక్ష విధించడు, ఆయన నాకు రక్షకుడై యుండి, యింతకు పూర్వమే చాలా దినముల క్రిందట, నా దోషమునకు తగిన శిక్షను వహించెను. లేదు, ఆయా! నాకు భయము లేదు; ఇక నేమంటే, నేను సంతోషముగానే యున్నాను. ఎందుకంటే యేసు నన్ను చూచి, నిశ్చయముగా చెప్పబోయేది యేమంటే,—"నా తండ్రిచేతను ఆశీర్వదింపబడిన మీరు, మీ కొరకు లోకోత్పత్తి మొదలుకొని సిద్ధము చేయబడిన రాజ్యమును స్వతంత్రించుకొనుటకు రండి" అని చెప్పును. హా! ఆయా! నిన్ను పరలోకములో కలుసుకొనుటకు నాకు చాలా ఆశ యున్నది" అని చెప్పెను. అప్పుడు ఆయా ఇది విని విస్తారముగా ఏడవ నారంభించి,—"ఓ అవ్వా! నీవును ఘల్లనియును, ఘల్లనియొక్క పిల్లలును కూడి, నన్ను కొంచెము హెచ్చు తగ్గగా క్రీస్తు మతస్థురాలినిగా చేసియున్నారు. అయితే నేను వాస్తవముగా క్రీస్తు మతస్థురాలను అగుదునో, కానో, ఇప్పుడు చెప్పలేను. అయితే అది అలాగున ఉండనిమ్ము. నా చావు నీ చావు వంటిదిగా నుంటే, నాకు గొప్ప మేలుగా నుండును" అనెను. అందుకు ప్యారి—"ఓ ప్రియమైన ఆయా! నీవు భక్తిగల జనులవలెనే నెమ్మదితో చావ కోరితే, నీవు విశ్వాసినివై యుండవలెను" అని పలికెను. ఈ చొప్పున ఆమె మాటలాడగానే,

మూర్ఛిల్లి, వెనుకకు తలగడమీద పడిపోయినది. అప్పుడు నేను ప్యారియొక్క సంకటమును గురించి ఫుల్మనిని అడిగితే, ఆమె ఇట్లనెను; "అమ్మా! మీరు నిన్నటి దినము ఇంటికి వెళ్లిపోయిన తరువాతను, ప్యారి 'నన్ను పిలువనంపించెను. నేను ఇక్కడికి వచ్చి చూచినంతలో, ఆమె 'దినమంతయును జ్వరముతో పడి యుండియు, ఎవరితోను చెప్పక 'యుండినట్టు కనుగొంటిని. అంతట నేను సాధువు తండ్రిచేత బోధకుని 'యొద్దకు వర్తమానము పంపించితిని. ఆయన ప్యారియొక్క భక్తిని పట్టి ఈ 'ఊరి జాతి వైద్యుని పిలిపించెను. ఆయన ఈ ఉదయమున వచ్చి, ఈ 'మెకు ఆయా ఔషధములు ఇచ్చెను గాని, ఆయన బోధకుని చూచి,— "ప్యారి నిండ ముసలిది. ఆమె మంచము మీదనుంచి లేచునని నాకు 'తోచలేదు" అనెనని చెప్పెను.. ఫుల్మని ఇంక నాతో చెప్పినది యేమంటే,—"గ్రామములో నుండే స్త్రీలందరును ఈ దినము వచ్చి, ప్యారి 'నిమిత్తము కొంచెము గొప్ప ఉపచారము చేసిరి గనుక, ఆమె ఒక 'నిమిషమైన ఒంటరిగా నుండలేదు" అని చెప్పెను. ఫుల్మని ఆమెతో కూడ రాత్రి అంతయు ఉండినట్టును, మరుసటి రాత్రి రాణి యుండునని చెప్పినట్టును, నాకు తెలిసినది. రాణి పేరు వినడముతోనే, నేను ఫుల్మనిని చూచి,—"ఇప్పుడు రాణి ఏలాగున నడుచుకొనుచున్నది? 'దాదాపు రెండు నెలలనుంచి దానిని నేను చూడలేదు" అని చెప్పినందుకు, ఫుల్మని—"అమ్మా! రాణి బహు యుక్తముగానే నడుచు'కొనుచున్నది. అది తిరిగి జన్మించి నిజమైన క్రీస్తు మతస్థురాలై 'యున్నదని అనుకొనుచున్నాను. మీ బోధవల్ల తనకు చాలా 'మేలు కలిగినట్టు అది నాతో తరుచుగా చెప్పుచుండును. అమ్మా! ఈ 'మేలును రాణి మాత్రమే పొంది యుండలేదు. ఈ గ్రామములో 'నుండే చాలా మంది మీ బోధ విని, మునుపటికంటె ఎక్కువగా 'మత విషయమై శ్రద్ధ కలిగి యున్నారు" అని చెప్పెను. అందుకు నేను అన్నమాట; — "దేవుని కృప కొరకును సత్యము కొరకును మనకు

'కాకుండ ఆయనకే ఘనాభి వృద్ధి కలుగుగాక. అయినప్పటికిని,
'ఫుల్మనీ! ఇచ్చకమాడి నిన్ను సంతోషపెట్టుటకు నాకు ఇష్టము లేదు
'గాని, ఒకటి మాత్రము నేను చెప్పక విధిలేదు. నేను విత్తినటువంటి
'విత్తనమునకు నీవు మంచి ఆలోచనము చెప్పడమువల్లను, ప్రార్థించడ-
'మువల్లను, నీరు పోత పోయక పోతే, ఆ విత్తనము అంకురించక, చచ్చి-
'పొయ్యేదే అని అనుకొనుచున్నాను. హా! ఫుల్మనీ! నీవంటి భక్తి గల
'స్త్రీలు మన బంగాళీ సంఘములలో, ఇప్పుడు ఉన్నవారికంటె నెక్కు-
'వగా నుంటే, వారివల్ల క్రైస్తవుల సమూహము ఎంత శీఘ్రముగా
'వృద్ధి అగును. సంఘములో జ్ఞానము లేనివారికి ఉపదేశించి, బల-
'హీనులైన శిష్యులకు సహాయము చేయ గలిగే స్త్రీలు పలువరు
'కావలసి యున్నారు. నీవు దిన దినమును హిందువులతో కలుసు
'కొని మాటలాడుచున్నావు గదా. కాబట్టి అటువంటివారికి ఉపదే-
'శించుట క్రైస్తవ స్త్రీలకు విధి అయ్యున్నది. వారు ఆలాగున చేసితే,
'ఇంగ్లీషువారు చెప్పే మాటలకంటె, వారి స్వదేశస్థులు చెప్పే మా
'టలకు హిందువులు చెవి నిత్తురని తలంచుచున్నాను. వారు ఏమి
'విచారింతురంటే, వీరును పూర్వము మనవలెనే హిందువులై యుం-
'డిరి. అయితే వీరు ఈ క్రొత్త మతమును పరిశోధించి చూచినంతలో,
'మునుపటిదానికంటె ఇదే మేలుగా వారు కనుగొని యున్నారని,
'నిశ్చయముగా యోజింతురు" అని చెప్పితిని.

అందుకు ఫుల్మనీ అనిన మాట;—"అమ్మా! ఇది నిజమే. అయితే సంఘు-
'మునందు మతాభిలాష గల స్త్రీలు చాలామంది లేరనే సంగతి దుఃఖ-
'కరమైనదే. ఇట్టివంటివారు ఇతరులకు ఏలాగున బోధించ గలరు?
'వారు తమకు తామె క్రీస్తు మతముయొక్క తీపిని రుచి చూచియుం-
'టే, ఇతరులను ఈ మార్గమందు ప్రవేశపెట్టుటకు ప్రయత్నము
'చేయక నుండరు. అయ్యో! అమ్మా! ఒక చెడ్డ రోగము గల మను-
'ష్యుడు ఒక వైద్యునివల్ల స్వస్థత పొంది యుంటే, వాడు ఆ వైద్యుని

'గురించి తన ఇరుగు పొరుగులవారికి తెలియ చేయడా? కాబట్టి, ప్రభు-
'వైన ఆ గొప్ప వైద్యునివల్ల పాపమనే రోగమునుండి రక్షింపబడి,
'నెమ్మది సంపాదించుకొనేవాడు ఆ వైద్యునియొక్క సుగుణములను
'ఇతర పాపాత్ముల యెదుట కొనియాడక విధి లేదు. కాబట్టి ఒకానొక
'క్రైస్తవుడు తన మతమును గురించి యెవరితోనైనను హెచ్చరించక
'నోరు మూసుకొంటె, ఆ మనుష్యుడు వాస్తవమైన క్రీస్తు మతస్థుడు
'బొత్తుగా కాడని అనుకొనుచున్నాను" అనెను.

అందుకు నేను—"ఫుల్మనీ! నీవు బాగుగా చెప్పుచున్నావు; ఎందు-
'కంటే, కొందరు క్రీస్తు మతస్థులు భయముచేతను మతమును గురించి
'మాటలాడుటకు సంకోచించినప్పటికిని, దుర్మార్గులు దేవుని ఆజ్ఞను బా-
'హాటముగా అతిక్రమించినప్పుడు, ఆ క్రైస్తవులే భయస్థులై యున్నను,
'మౌనముగా నుండలేరు" అంటిని.

మేము మాటలాడుచుండగా, ముసలి ప్యారి గాఢ నిద్రలో ప్రవే-
శించినది. అప్పుడు ఆమెను బాగుగా చూచేవారు చాలామంది
యుండిరి గనుక, నేను ఫుల్మనీ చేతిలో రెండు రూపాయిలు పెట్టి,
ఆ ముసలిది తినుటకు కొన్ని మంచి వస్తువులను కొనుమని చెప్పి వచ్చి-
నాను. నేను మార్గమున వెళ్లుచు, 'సమాధానమును మీకు విడిచి-
'పెట్టుచున్నాను, నా సమాధానమును మీకు ఇచ్చుచున్నాను. లో-
'కము ఇచ్చే ప్రకారము నేను మీకు ఇయ్యను. మీ హృదయము
'కలతపడ నియ్యకుడి, భయపడ నియ్యకుడి' (యోహాను. 14: 27.)
అని క్రీస్తు తన జనులకు చేసియున్న వాగ్దత్తము తన ముసలి సేవకు-
రాలి యెడల నెంత విచిత్రముగా నెరవేరినది అని ధ్యానించుచుంటిని.

నేను కరుణ ఇంటి దగ్గరనుంచి వెళ్లవలసి, దాని పెనిమిటి తిరిగి
వచ్చినాడో, లేదో, అని కనుకొనుటకు లోపలికి వెళ్లితిని. నేను
లోపల ప్రవేశించగానే, వంశి తండ్రి ముంగిట కూర్చుండి భోజనము
చేయుచుండగా, అతని భార్య అతనియొద్ద కూర్చుండి, నవీనుని గురిం-

చియు, నా పెద్ద మేడను గురించియు, జరిగిన కథనంతయును అతనితో చెప్పుచుండగా నేను వింటిని.

కరుణ నన్ను చూడడముతోనే త్వరగా లేచి, క్రొత్తదైన వెదురుబొంగులతో చేసిన ఒక పీట బయటికి తెచ్చి,—"మీరు నాకు ఇచ్చిన రూపాయీ మార్చి, నాలుగు డబ్బులకు ఈ పీట, మీరు ఇక్కడికి వచ్చినప్పుడు, కూర్చుండడమునకై కొంటిని" అని చెప్పెను. ఇది స్వల్పమైన సంగతే కాని, అది విని మిక్కిలి సంతోషించినాను. ఎందుకంటే, కరుణ నన్ను చూచుటకు మిక్కిలి ఆసక్తి కలిగి యున్నట్లు, ఇందువల్ల నాకు తెలిసినది. అయితే అదియు దాని పెనిమిటియు స్నేహముగా నుండిరి గనుక, ఆ దినము వారిని ఆయాసపెట్టుట యుక్తమని తోచలేదు గనుక, నేను కూర్చుండక, కరుణను చూచి,—"నీ నవీనుడు నా ఇంటిలో నుండుటకు సంతోషించుచున్నాడు. నేను ఇల్లు బయలుదేరినప్పుడు, మసాల్జీయొద్ద కత్తులును ముళ్లను తోమడము నేర్చుకొనుచుండెను" అని చెప్పి, ఇంటికి వెళ్లుదునని బయలుదేరినాను. కరుణ మునుపటికంటె బాగుగా నడుచుకొనెను గనుక, నేను చూచి మిక్కిలి సంతోషించి, 'ఓ దేవా! నీ క్రియ నీ సేవకురాలికి అగుపడేటట్టు చేసి, నీ చేతుల పని విసర్జించ వద్దు' అని దాని కొరకు దేవుని వేడుకొంటిని. అయితే అప్పటిలో కరుణ విషయమైన నా ప్రార్థనకు దేవుడు ఎటువంటి దుఃఖ భీకరమైన అపత్తు కలుగ జేసి, యుత్తరము ఇయ్య తలచెనో, అది అప్పటిలో నాకు తెలియకపోయెను.

మరునాడు చీకటితోనే నేను లేచి, గాలి నిమిత్తము యథాప్రకారము బయలుదేరి, బండి పైకి ఎక్కుచుండగా, చిన్నవాడైన నవీనుడు నా యొద్దకు వచ్చి, చాలా ఏడుచుచు,—"హా! అమ్మగారూ! నాకు ఇంటికి సెలవు దయచేయుడి; మా పల్లెనుంచి ఒక చిన్నవాడు ఇప్పుడే వచ్చి, నా అన్న ఈ రాత్రి నీళ్లలో పడి చచ్చిపోయినాడని

చెప్పెను" అనెను. ఇది వినడములోనే నేను ఆ భక్తి హీనుడైన
దుర్మార్గపు చిన్నవాని నడతను జ్ఞాపకము తెచ్చుకొని, పరమందు వాని
గతి యేమైయుండునో అని అనుకొనుచు, వణికితిని గాని, నవీనుని-
తో ఈ సంగతిని గురించి యేమియు చెప్పక, వానిని చూచి,—"నీవు
పైకి ఎక్కి, గుఱ్ఱములను తోలేవానియొద్ద కూర్చుండు"మని చెప్పి,
క్రీస్తు మతస్థుల పల్లెయొద్దకు త్వరగా తోలుమని ఆ బండివానికి ఆజ్ఞా-
పించినాను. నేను కరుణ ఇంటికి వెళ్లుచునే అక్కడ కూడుకొని-
యున్న ఒక పెద్ద గుంపును చూచితిని. ఆ గుంపులో కూడ కొంత-
మంది ఠాణా బంట్రౌతులును పోలీసు బంట్రౌతులును నిలుచుండి
యుండిరి. వారందరును నిండ గల్లంతు చేయుచు, కన్నమును గురిం-
చియు దొంగతనమును గురించియు నరహత్యను గురించియు మాట-
లాడుకొనుచు నుండగా, అందులో ఒకమనుష్యుడు—"ఏమి? ఈ క్రీస్తు
మతస్థులు ఇటువంటి పనులు చేయడమనేది వారికి మతము లేదా?"
అని పలికెను. మేము అక్కడ ప్రవేశించడములోనే, నవీనుడు
ఇంటిలోనికి త్వరగా పరుగెత్తుకొని పోయెను. అయితే నేను ఆ
గుంపులోనికి వెళ్లుటకు మనస్సులేక, ఒక చెంపగా నిలుచుండి, ఈ
గల్లంతుకు కారణము తెలుసుకొందునని, ఒక బంట్రౌతును పిలిచి,—
"ఈ క్రీస్తు మతస్థుల చిన్నవాడు వాస్తవముగా నీళ్లలో పడి చచ్చి-
'నాడా?" అని అడిగినప్పుడు, వాడు ఇట్లనెను;—"అవును అమ్మా! వాని
'శవమును ఈ ఉదయమందు ఇంటికి తెచ్చిరి. ఈ రాత్రి ఒక హిందు
'మనుష్యుడు ఈ చిన్నవానిని వెంట తీసుకొని, మహేంద్రబాబు
'ఇంటికి కన్నము వేసి చొరబడెను. ఆ మనుష్యునకు మార్గము చూ-
'పుటకే వంశి వెళ్లినట్టు తోచుచున్నది. ఎందుకంటే, వంశియును ఆ
'బాబును ఏక కులస్థులు గనుక, వాడు ఆ ఇంటియొక్క మర్మమంత-
'యును బాగుగా తెలుసుకొని యుండవచ్చును. మెట్టుకు వారి-
'ద్దరును లోపల జొరబడి, బాబుయొక్క భార్య ఒంటను ఉండిన

‘నగలను తీయసాగిరి. ఆమె అప్పుడు నిద్రబోవుచుండెను. అయితే
‘నిద్రాభంగమై, వెంటనే ఆమె మేలుకొని లేచి అరిచెను. అప్పుడు
‘ఆ దొంగలలలో ఒకడు ఆమె రొమ్ము మీదను ఒక దెబ్బ వేసెను.
‘అప్పుడే ఆ బాబుకూడ మేలుకొని, లేచి, ఆ దొంగలను పట్టుకొను-
‘టకు ప్రయత్నము చేసెను. వారు పారిపోవుచుండగా, ఆ బాబును
‘వారి వెంట పరుగెత్తెను. రాత్రి మంచు విస్తారముగా కురియు-
‘చుండెను గనుక, బయట ఏ వస్తువును చూచుటకు శక్యమై యుండ
‘లేదు. అయితే ఆ బాబు ధ్వనిని పట్టి, దొంగలు వెళ్లుచున్న మా-
‘ర్గము ఇదే గదా అని, వారి వెంటనే వెళ్లెను. వారు పరుగెత్తుచుం-
‘డగా, వారిలో ఒకడు ఆకస్మికముగా నీళ్లలో పడెను. ఈ శబ్దము
‘విని, బయట ఉన్న పెద్ద మడుగుయొక్క అంచు వద్దకు వస్తిని గదా
‘అని, ఆ బాబు తెలుసుకొనెను. రెండవ దొంగకూడ కాలు జారి
‘ఆ మడుగుయొక్క ఇటుక మెట్లమీదను పడెను. అప్పుడు ఆ బాబు
‘వానిని పట్టుకొనెను. ఆ సమయములో మేము వచ్చి వానిని ఠా-
‘ణాలోనికి తీసుకొని వెళ్లినాము. రాత్రి మడుగులో పడ్డవాడు ఈది
‘తప్పించుకొని పోయినాడని అనుకొంటిమి. అయితే ఈ ఉదయ-
‘మందు అతని శవము ఆ మడుగులో తేలియుండగా, అతని తండ్రి
‘వచ్చి, ఇది నా కుమారునిదే అని చెప్పి, ఆ శవమును ఇంటికి తీసు-
‘కొని వచ్చినాడు. వీని తండ్రి తన కుమారుడు దొంగిలుటకు వెళ్లిన
‘సంగతి తాను బొత్తుగా ఎరుగనని చెప్పుచున్నాడుగాని, అతడు
‘ఏమంటే నేమి, మేము వానిని న్యాయాధిపతి యెదుటికి తీసుకొని
‘వెళ్లవలెను. ఠాణాలో భద్రము చేయబడ్డ ఆ దొంగను గురించి
‘అయితే, దొరవారు వానికి అవ్యవధానముగా ఉరి నియమించిన పక్ష-
‘మునకు బాగుగా నుండును. ఎందుకంటే, వాడు ఇంతకు పూర్వము
‘అయిదు సంవత్సరములు సంకెలలలో నుండినప్పటికిని, వానికి ఎంత-
‘మాత్రమును బుద్ధి రాలేదు. ఆ బాబుయొక్క భార్యకు తగిలిన దెబ్బ-

వల్ల ఆమె చాలా హానిని పొందియున్నది గనుక, అందువల్ల ఆమె
'బ్రతుకు బహు సంశయముగా నున్నది. అయితే తన ప్రాణమును
'కాపాడుకొనుటకు, ఆ దుర్మార్గుడు, తాను ఆమెను కొట్టలేదనియు,
'వంశియే కొట్టెననియు, చెప్పుచున్నాడు. అయితే ఇదంతయును
'అసత్యమని అనుకొనుచున్నాము. ఎందుకంటే, వంశి చిన్నవాడగుట-
'వల్ల, ఖూనీకి తెగించునని చెప్ప వల్ల కాదు. కాబట్టి వీని జత దొంగే
'ఈ పని చేసినట్టు స్పష్టమై యున్నది" అని చెప్పెను.

ఈ దుఃఖకరమైన కథ ఆ బంట్రౌతువల్ల నేను తెలుసుకొని నేను కరుణయొక్క దుస్సహమైన దుఃఖమును ఏలాగున చూడ గలను అనుకొని, అది లోపల నుండి ఏడ్చిన ఏడుపును దుఃఖాలాపములను విని, నా ఇంటికి తిరిగి వెళ్ల కోరితిని. అయితే ఇంక కొంతసేపు ఆలోచించగా, ఆలాగున చేయడము యుక్తము కాదు, ఎందుకంటే, ఇప్పుడు కరుణ నిండ దుఃఖములో నున్నది. దాని దగ్గరకు వెళ్లుట దుఃఖకరమైనప్పటికిని, దానిని ఓదార్చడము నాకు విధి అయ్యున్నది. ఈ ఆపత్తు ఒక సంవత్సరము క్రిందట సంభవించి యుంటే, దీనికి ఇంత దుఃఖము ఉండకయే పోవును. అప్పుడు దీని దుఃఖము, సాధారణముగా అందరును కుమారుడు పోతే ఎంత దుఃఖింతురో, అంతే అయ్యుండును. మరియు దీని కుమారుడు దొంగగా పట్టుబడినందువల్ల, సంభవించిన అపకీర్తికే దుఃఖించును గాని, వాని యుత్తర స్థితిని గురించి తలచకయే పోవును. ఇప్పుడైతే, దీని మనోనేత్రములు కొంచెముగా తెరువబడి యున్నందువల్ల, తన కుమారునకు తాను పూర్వము పొందియుండిన మతోపదేశమును చేయలేదు గనుక, నిండ కలతపడుననుకొని, లోపలికి వెళ్లి, కరుణను చూడగానే, అది తన అపారమైన మనోవ్యాకులతచేత తన వెంట్రుకలను విరియబోసి, లాగికొని, వెర్రియెత్తినదానివలె నుండి,—"నా పిల్ల ఖూనీ చేసినాడని
'ఎవరు అనుకొనుచున్నారు? లేదు, లేదు, వాడు ఖూనీ చేయలేదు,

'ఖూనీ చేసినది నేనే. నన్ను న్యాయాధిపతి యొద్దకు తీసుకొని
'వెళ్లు. ఆయన నన్ను ఉరి తీయించుగాక. దేవుని దృష్టికి నేను
'నరహత్య చేసితిని. కాబట్టి ఆయన నన్ను ఇప్పుడే నరకమునకు
'పంపించితే, ఆ శిక్షకు నేను లెస్సగా తగి యుందును. అయ్యో!
'నేను తల్లినై యుండియు, నా పిల్లయొక్క శరీరమునే కాకుండా,
'ఆత్మను కూడ పాడు చేసితిని! మంచి మార్గమందు నడుచుటకు వానిని
'నేను శిక్షించలేదు. వాడు దేవుని ఆజ్ఞలను అతిక్రమించినప్పుడు,
'నేను వానితో వద్దన లేదు. కోపము, పగ, మొదలైన దుర్గుణములు
'వాని హృదయములో అంతకంతకు మొదట వృద్ధి పొందినవి గనుక,
'తరువాత వాటిని వదిలిపెట్టుటకు వానికి బుద్ధి చెప్పలేక పోతిని.
'వాడు నాయొద్ద డబ్బులు దొంగిలి, తన తమ్ముని యెడల అన్యాయ-
'ముగా ప్రవర్తించినప్పుడు, వానియందు నాకు కలిగియున్న ప్రేమ
'వల్ల, నీవు ఇటువంటి పనులు చేస్తే, బొత్తుగా చెడిపోదువని, ఒక
'పర్యాయమైన వీనితో నేను చెప్పియుండలేదు. అయ్యో! దీనికేయా
'ప్రేమ అని పేరు పెట్టి పిలిచేది! ఇటువంటి కాని ప్రేమ ఉండుట
'ఎందుకు? దీనివల్ల నా పిల్లకు చేటు సంభవించెను. అయ్యయో! నేను
'ఏమిచేతును? నేను ఇకను మనుష్యుల ముఖమును ఏలాగున చూడ
'గలను? నేను దేవుని ప్రార్థించుటకు ఇకను తెగించలేను. ఈ లోక-
'ములో నాకు సౌఖ్యము ఉండదు, మరియొక లోకమునకు వెళ్లుటకు
'భయపడుచున్నాను, ఎందుకంటే, అక్కడ నా పిల్ల నన్ను చూచి,
'తనకు నేను బోధించక పోయినందుకు, నా మీద నేరము మోపును.
'హా! దేవా! నీ యాత్మను విడిచి నేను ఎక్కడికి పోవుదును? నీ సమ్ము-
'ఖమునుంచి నేను ఎక్కడికి పారి పోవుదును? అని చెప్పి, తన చిన్న
'కుమారుని చూచి, 'ప్రియుడవైన నవీనుడా! నేను నీ సహోదరుని
'ఆత్మను నశింప చేసితిని. అయితే నీ యాత్మను చంపను. నిన్ను ఆ
'దొరసానిగారికి బొత్తుగా వదలి పెట్టి వేసినాను; ఆమె నీకు మంచి

'బోధ చేయును, అది నావల్ల కాదు. అయ్యో! నాయొద్ద ఒక పిల్ల 'అయిన ఉండుటకు నేను తగినదాని కానే" అని ప్రలాపించుచుండెను.

వంశియొక్క శవమును చూచుటకు అందరికిని ప్రీవముగా ఉం-డెను. అయినప్పటికిని, వాని తల్లి, నేను ఇప్పుడు చెప్పినట్టు, ప్రలా-పించుచు, ఆ శవముయొక్క తలను తన రొమ్మున చేర్చి, ము-ఖము ముద్దు పెట్టుకొని, ఘోరముగా ఏడ్చి,—"ఏ తల్లియొక్క శిశువు 'తన యొడికట్టులో చచ్చునో, ఆ తల్లి సంతోషించుగాక. అది 'ఆ శిశువుయొక్క శవమును కడిగి, దాని శిరస్సుమీదను నూనె పోసి, 'దాని చావుపెట్టె మీదను పువ్వులు జల్లిన తరువాత, నా శిశువు 'పెండ్లి విందుకు వెళ్లుచున్నాననుకొనుగాక. మరియు బంధు-'వులును స్నేహితులును ఆ శవమును తీసుకొని వెళ్లి, సమాధిలో ఉం-'చితే, ఆమె కూడ పాతిపెట్టే చోటుకు వెళ్లి, సంతోషించుగాక. 'ఎందుకంటే, ఆమె పిల్లయొక్క దుఃఖములు సమాప్తము పొందియు-'న్నవి. ఆ పిల్ల పరలోకమందుండే తన తండ్రియొక్క బంగారపు 'మేడలో కాపాడబడును. కాబట్టి దాని తల్లి దుఃఖించక ఉండును 'గాక. అయితే, అయ్యో! ప్రపంచమంతయును వెదకినను, నా దుఃఖ-'మువంటి దుఃఖము మీకు కనుపించదు. అయ్యో! నా వంశీ! ఇప్పుడు 'నీవు ఎక్కడ నున్నావు? అయ్యో! నా బిడ్డా! నీ యాత్మను చెరిపినది 'ఎవరు? నేనే. నేను తల్లినై యుండియు, నా పిల్లయొక్క శరీరా-'త్మలను రెంటినిని పాడు చేసితిని గనుక, నేను బ్రతుకనేల!" అని ఏడుచుచుండెను.

ఈ చొప్పున ప్రలాపించి, దౌర్భాగ్యపు కరుణ తన మనోవేద-నకు సహించలేక, మూర్ఛిల్లి, నేల మీద పడిపోయెను. ఆ సమయ-ములో ఒక శబ్దమైన వినబడలేదు. ప్రతి స్త్రీయొక్క కంటినుంచియు నీరు ఒలికెను. ప్రతి పురుషుడును పరలోకపు వైపునకు కన్నులెత్తి, తన తన కుటుంబమునకు ఇటువంటి ఆపత్తు సంభవించక ఉండును

గాకని తన తనహృదయమునందు ప్రార్థించెను. ఈ సమయములో భక్తి హీనత ఫలితము స్పష్టముగా విశదమాయెను. వంశి తండ్రి రాత్రి ఇంటి-యొద్దనే యుండి, సారాయీ తాగకుండానే యుండెను గనుక, సంభ-వించినదంతయు వాడు బాగుగా తెలుసుకొని యుండెను. అయి-నప్పటికిని, తన భార్య దుఃఖించినట్లు, తాను దుఃఖించలేదు. ఎందు-కంటే, తన చిన్నవాని కొరకు చాలా దుఃఖించినాడు గాని, తనవల్ల నేరమున్నట్టు అనుకొనక,—"నేను ఏమి చేతును? దేవుడు తనకు ఇష్టము వచ్చినట్టు జరిగించుచున్నాడు" అని చెప్పి కరుణయొక్క స్థితిని చూచి, నిట్టూర్పు విడిచి, దానిని నేలనుంచి లేవనెత్తెను. నేను దాని ముఖము మీదను చల్లని నీళ్లు పోసి, దాని ముక్కుకు వాసన చూచే ఉప్పు తగి-లించి, అది తెప్పిరిల్లులాగున ప్రయత్నము చేసితిని, కొంత సేపటికి అది కన్నులు తెరచి, చుట్టును చూచెను. అప్పుడు దాని పెనిమిటి— "ఓ నా ప్రియురాలా! నీవు బుద్ధిహీనురాలవైన స్త్రీవలెనే మాటలా-'డుచుంటివి. ఇతరుల కుమారులు నీళ్లలో పడి చచ్చినట్టే, మన చిన్న-'వాడును చచ్చిపోయినాడు. నేరము మనది ఏలాగున అగును? అది 'దేవుని చిత్తము" అని పలికినందుకు, కరుణ అతని చూచి,—"లేదు, 'లేదు, నేను బుద్ధి హీనురాలను కాను. నీతిపరుడైన యేలీయొక్క 'కుమారులు దుర్మార్గముగా ప్రవర్తించినప్పుడు, అది అతనికి తెలిసి-'యుండియు, అతడు వారిని అడ్డగించక పోయినందుకు, దేవుడు అతని 'వంశమునంతను నాశము చేసెనని, బైబిలులో నిన్నటి దినము 'చదువుకొంటిని. ఈ చరిత్రను నీవు చదివితే, నన్ను బుద్ధి హీనురా-'లవని పిలువకపోదువు. అయితే నేమి? నా యెదలో నేను ఒక 'నిప్పు రాజవేసినాను, అది అక్కడ నిరంతరమును మండుచుండును" అని చెప్పెను.

ఆ సమయములోనే ఫుల్మనీ ఆ ఇంటిలోనికి ప్రవేశించి,—"అమ్మా! 'పాపము! కరుణకు సంభవించిన ఆపత్తును గురించి నాకు తెలిసినది

'గాని, నేను ప్యారిని వదిలి పెట్టి, యింతకు ముందుగా రాలేక పోతిని.
'ఎందుకంటే, ఆమె ఇంక బ్రతుకుటకు ఎక్కువ కాలము లేదు గనుక,
'మిమ్మును పిలుచుకొని రమ్మని నన్ను పంపినది. మరియు, అమ్మా!
'మీరు కరుణను అక్కడికి తీసుకొని రా గలిగితే, ప్యారియొక్క
'దివ్యమైన ఆదరణపు పలుకులను వినడమువల్ల, దాని మనస్సు
'శాంచెను గొప్ప శాంతము పొందవచ్చునని నాకు తోచుచున్నది.
'మెట్టుకు మనము త్వరగా వెళ్లవలెను, ఎందుకంటే, మీ ఆయా
'తప్ప, ప్యారియొద్ద మరి యెవరును లేరు. ఈ గ్రామమంతయును
'వంశి నిమిత్తము మిక్కిలి అల్లరిపడి గల్లంతుగా నున్నది" అని నా
చెవిలో మెల్లగా పలికెను.

నా ఆయా అక్కడ నున్న సంగతి నేను విని, ఆశ్చర్యపడి,—"నేను 'ఆయాను ఇంటి యొద్దను ఉంచి వస్తినే, అది యిక్కడికి ఎప్పుడు 'వచ్చినది?" అని అడిగితిని. అందుకు ఫుల్మనీ—"అది వచ్చి దాదాపు అరగంట కావచ్చును. ఎండిపోయిన భూమి ఆకాశమునుంచి కురిసే వర్షమును ఏలాగున పీల్చునో, అంత ఆసక్తిగా మీ ఆయా 'ఇదివరకు ప్యారియొక్క జీవ ప్రదమైన మాటలను స్వీకరించుచున్నది" అనెను. ఫుల్మనీ మాటలాడుచుండగా, ఆమె పెనిమిటి అయిన ప్రేమచందు వచ్చినాడు. అతడు మూడు దినముల క్రిందట బోధకుని పని మీద కలకత్తాకు వెళ్లి, అప్పుడే తిరిగి వచ్చినాడు. అయితే వంశి మరణమును గురించి విని, మిక్కిలి దుఃఖించి, వెంటనే వాని ఇంటికి వచ్చి, అక్కడ ప్యారిని గురించి ఫుల్మనీవల్ల తెలుసుకొని, ప్రేమచందు మాతో కూడ వచ్చి, ఇక నొక పర్యాయము ఆమెను చూడ గోరెను. అప్పుడు నేను—"మంచిది ప్రేమచందూ! నీవును 'ఫుల్మనియును ఈ కరుణను వెంటపెట్టుకొని తీసుకొని రండి" అని చెప్పితిని. అప్పుడు అతడు కరుణయొద్దకు వెళ్లి, దాని చెయ్యి పట్టుకొని, తీసుకొని రాగా మేమందరమును కూడి ప్యారి ఇంటికి

వెళ్లితిమి. కరుణ నిరాశగా కూర్చుండి, తన చనిపోయిన కుమారుని ముఖమును తేరి చూచుచుండెను. మేము దానిని లేవనెత్తినప్పుడు, నన్ను ఎక్కడికి తీసుకొని వెళ్లుచున్నారని అది అడుగక, మౌనముగానే మాతో కూడ వచ్చెను. వంశి తండ్రి కూడ ఏమియును చెప్పక, ఇంటిలోనే ఊరక కూర్చుండెను. అయితే నవీనుడు మాతో కూడ ప్యారియొక్క ఇంటికి వచ్చెను. అక్కడ మేము ప్రవేశించగానే, ప్యారి తన కన్నులను తెరచి,—"హా! అమ్మా! మీరు నా మరణమును చూడ వస్తిరి" అని దీన స్వరముతో చెప్పెను. అందుకు నేను—"ప్యారీ! అవును, నీకు శుభము చెప్పుటకు వస్తిమి. మనము పరలోకమందుండే మన తండ్రి ఇంటిలో కూడుదుము" అని చెప్పితిని. అంతట నేను ప్యారియొక్క మరణ కాలము సమీపించెనని స్పష్టముగా కనుగొంటిని. ఎందుకంటే, ఆమె మాటికి నాలుగు అయిదు పలుకులకంటె ఎక్కువ మాటలాడలేక పోయెను. అది కూడ బలహీనమైన స్వరముతోనే మాటలాడెను.

అటువంటి సమయములో వంశి మరణమును గురించి చెప్పి, ప్యారియొక్క మనస్సు కలతపెట్టుట యుక్తముగా నుండదని, ఫుల్లని బాగుగా యోజించినందున, ప్యారి నాటి ఉదయమందు జరిగిన సంగతులను గురించి బొత్తుగా తెలుసుకొనకయే యుండెను. అయినప్పటికిని, కరుణను చూచి, ఒక్క ఆదరణపు మాటనైన ప్యారి పలుకునని నాకు నిండ ఆసక్తి కలిగి, ఆమె చెయ్యి పట్టుకొని నేను చెప్పినది ఏమంటే,—"ప్యారీ! ఇదుగో, ఒక స్త్రీ వచ్చి యున్నది. తాను మిక్కిలి పాపాత్మురాలనని తెలుసుకొని యున్నది గనుక, దేవుడు తన్ను క్షమించడని అనుకొనుచున్నది. అటువంటి స్త్రీకి నీవు ఏమి బుద్ధి చెప్పుదువు!" అంటిని. ప్యారి కరుణను గుర్తుపట్టలేక, తలయెత్తి దానికి శేషించిన కొలది బలముతో—"హా! యేసు క్రీస్తును గట్టిగా నమ్ము. అప్పుడు యేసు, కొయ్యకు మేకులతో

'గుచ్చబడిన తన నెత్తుటి చేతితో, దేవుని లెక్క పుస్తకమున వ్రాసి
'యున్నది తుడుపు పెట్టును. అప్పుడు నీ పాపములను వ్రాసిపెట్టి
'యుండిన స్థలమందు, క్రీస్తుయొక్క నెత్తురు గాక మరి యేమియు
'దేవుడు చూడడు గనుక, ఆయన నిన్ను నీతిపరురాలినిగా చూచు-
'కొనును" అని చెప్పెను. కరుణ ఇది విని,—"లేదు, లేదు, నా పాపము
'మిక్కిలి బాధకరమై యున్నది. ఆయన నన్ను నీతిపరురాలినిగా
'ఎన్నటికిని చూడడని నేను ఎరుగుదును. నేను నరకమునకు వెళ్లవలసి
'యున్నదని నాకు నిశ్చయముగా తెలుసును" అని నిరాశగా పలికెను.
అందుకు ప్యారి—"బొత్తుగా కాదు. మీ పాపములు రక్తవర్ణముగా
'నున్నప్పటికిని, అవి మంచు వలెనే ధావళ్యముగా నుండును. సిం-
'ధూరము వలె నున్నప్పటికిని, అవి గొఱ్ఱె బొచ్చువలె నగును అని
దేవుడే ఆనతిచ్చెను" అనెను. (యెషయా. 1: 18.)

ఈ చొప్పున పలికి, ప్యారి కన్నులు మూసుకొని, కొంత
సేపు ఊరకుండెను. అటుతరువాత ఆమె అతి దీన స్వరముతో
మెల్లగా పలుకుచుండగా, "ఓ యేసూ! నీవు ఎంత ప్రియుడవై
'యున్నావు. హా! పరలోకమనేది యెంత ఆనందకరమై యున్నది!
'యేసూ! నీ విలువలేని రక్తము నా సుందరమైన వస్త్రమై యున్నది!
'ప్రపంచమంతయు గతించి పోయినప్పటికిని, ఈ నా నమ్మకమనేది
'నిలకడగ నుండును. ఓ మరణమా! నీ ముల్లు ఎక్కడ? ఓ సమాధీ!
'నీ జయము ఎక్కడ? యేసు క్రీస్తుగుండ నేను జయ శీలురాలనై
'యున్నాను" అని పలికెను.

ఆ సమయములోనే ఆయా కూర్చుండి విస్తారముగా ఏడుచు-
చుండెను. అంతట అది ప్యారి చెయ్యి పట్టుకొని,—"ఓ ప్రియమైన
'తల్లీ! వినుము, వినుము. నీవు ధైర్యముగా చచ్చిపోవుచున్న సంగతి
'నేను చూచుచున్నాను గనుక, నేను క్రీస్తు మతస్థురాలనై యు-
'న్నాను" అని చెప్పెను. అది చెప్పిన మాట ప్యారికి బోధ అయినట్టు

గ్రహించితిని. ఎందుకంటే, అప్పుడు ఆమె వాడిపోయిన ముఖము తేటనొంది, రపలోకము వైపుచూచి,—"అలాగున అయితే, ఓ తండ్రీ! 'నిన్ను స్తుతించుచున్నాను. ఓ ఆయా! నిన్ను పరలోకములో కలు-'సుకొందును" అనెను. అంతట ప్యారి ఫుల్లనీ వైపునకు తిరిగి,—"నేను 'వెళ్లి పోవుచున్నాను. నా తల నీ రొమ్మున ఆనుకొని చచ్చిపోవ 'కోరుచున్నాను. నీకును నీ బంధువుల కందరికిని మేలు కలుగుగాక! 'మరియు, ఓ అమ్మా! మిమ్ములను కూడ దేవుడు దీవించుగాక! ఓ 'ప్రభువైన యేసూ! రమ్ము. ఆయన యెడమ చెయ్యి నా తల క్రింద 'నున్నది, ఆయన కుడిచెయ్యి నన్ను కౌగలించుచున్నది. హా! దేవుని 'ప్రియమైన జనులకు ఎంత నెమ్మది, ఎంత సౌఖ్యము!" అని పలికెను.

ముసలి ప్యారి పలికిన చివర మాటలు ఇవే. ఈ మాటలు పలికి, ఈ నమ్మకమైన సేవకురాలు తన ప్రభువు యొక్క ఆనందములో పాలు పొంద వెళ్లెను. ఆమె శవము యొక్క నిర్మలమైన ముఖమును తేరి చూడగా, నేను ఏడవ లేక పోతిని గాని, ఆ శరీరమును వదిలి-పెట్టి పోయిన ఆత్మ, ఇప్పుడు సౌఖ్యముయొక్కయు నెమ్మదియొక్క-యు మహిమయొక్కయు స్థితిలో నుండెను గనుక, నేను సంతో-షించితిని. ఇప్పుడును వేలతరబడి దూతలు ప్యారిని పరలోకపు గుమ్మముల యొద్ద నుండి, రమ్మనుచున్నారు. యేసు ఆమెను బంగారపు కిరీటముతో అలంకరించుచున్నాడు. దేవుడు తానే ఆమె కంటి నీళ్లను నీరంతయును తుడిచివేయుచున్నాడు అనుకొంటిని. దీని గురించి నేను బాగుగా నిశ్చయిస్తిని గనుక, నేను సంతోషముగాను బిగ్గర-గాను—"నా చావు నీతిపరుల చావు వలెను, నా అంత్యకాలము వారిది వలెను ఉండుగాక" అని పలికితిని. అంతట మేమందరము చచ్చి పోయిన మా స్నేహితురాలియొక్క మంచము వద్ద మోకాలు ఊని, "ఓ మా తండ్రివైన దేవా! నేడు జరిగిన రెండు సంగతులను మేము 'ఎప్పటికిని మరచి పోక యుందుము గాక. ముఖ్యముగా నిన్ను ఇప్పుడు

'వెదకుచుండే ఈ యిద్దరు మనుష్యులను మరవక నుందుము గాక. వీరికి 'నెమ్మదిని సంతోషమును దయచేసి, యిప్పుడు ఈ లోకము విడిచి 'వెళ్లిపోయిన నీ సేవకురాలి వలెనే, దేవుని ప్రియులైన జనులకు 'ఎంత నెమ్మది, ఎంత సంతోషము అని వీరు చెప్ప గలిగేటట్టు దయ- 'చేయుము" అని కొద్దిగా ప్రార్థించితిమి.

అంతట బోధకుడు ఆ ఇంటికి వచ్చెను. ప్యారి అస్వస్థముగా నున్నంతకాలము ఆయన దినమునకు రెండు మారులు వచ్చి, ఆమెను చూచి, ఆమెతో కూడ ప్రార్థించే వాడు. అయితే ఆ దినము వంశి మరణమును గురించి విని, వాని ఇంటికి వెళ్లెను గనుక, ప్యారిని చూ-చుటకు ఎప్పటివేళకు రాక, కొంత ఆలస్యముగా వచ్చెను. ఆమె పలికిన చివర మాటలను ఆయనకు నేను తెలియ చేసినంతలో, ఆయన కన్నులకు నీరు తెచ్చుకొని, ఆమె శవమును తేరి చూచి,—"హా! 'ప్యారీ! నీవు సంశయము లేకుండా నిజమైన క్రీస్తు మతస్థురాలవై 'యుంటివి" అనెను. సాయంకాలము కాగానే, ప్యారి పాతిపెట్ట-బడెను. కొంతమంది క్రీస్తు మతస్థులు ఆమె చావు పెట్టెను తమ భుజముల మీద ఎత్తుకొని, పాతి పెట్టే చోటికి తీసుకొని వెళ్లిరి. బోధకుని కుటుంబమును నేనును గ్రామములో నుండిన దాదాపుగా అందరును ఆ పెట్టె వెనుక ఏడుచుచు నడిచినాము. కొంత కాల-ము అయిన తరువాతను, నా భర్త ప్యారికిగాను ఇటుకతో ఒక గోరీ కట్టించి, దాని మీదను ఒక తెల్ల చరపరాయి పెట్టించి, ఆ రాతి మీదను ప్యారి యొక్క పేరును, ఈ దిగువున వచ్చే ప్రభువైన యేసుయొక్క మాటలనును చెక్కించినాడు.—"ఇశ్రాయేలందైన 'నేను ఈపాటి విశ్వాసము చూడలేదని నేను నిశ్చయముగా చెప్పు-'చున్నాను. మరియు అనేకులు తూర్పునుంచియు పడమటనుంచి-'యు వచ్చి, పరలోక రాజ్యమందు అబ్రాహాము ఈసాకు యాకోబు 'అను వారితో కూడ కూర్చుందురని నేను మీతో చెప్పుచున్నాను.

'అయితే రాజ్యపు పిల్లలు వెలపటి చీకటి లోనికి త్రోయబడుదురు. 'అక్కడ ఏడ్పును పండ్లు కొరుకుటయు కలుగునని చెప్పెను." (మత్తై. 8: 10, 11, 12.)



## ౭. అధ్యాయము.



నేను ఈ జరిగిన సంగతులనన్నిటిని చూచినందున, నా మనస్సు మిక్కిలి కలతపడెను. మరియు ప్యారి పాతి పెట్టబడిన తరువాత, నేను ఇంటికి వెళ్లిన మీదట, సంకటపడి దాదాపు ఆరు వారముల పర్యంతము మంచము ఎక్కినాను. అప్పటిలో నేను ఆ క్రీస్తు పల్లెకు వెళ్లలేకపోతిని. అయితే నా ఆయాతో మతమును గురించి అతి సంతోషకరమైన చాలా సంభాషణ చేసితిని. ఈ స్త్రీ ఎప్పటి-కిని చురుకుగా పని చేసేది. అయితే ఇప్పుడు మునుపటికంటె యెక్కువగా శ్రద్ధ కలిగి, ముఖ్యముగా నన్ను సంతోషపెట్టుటకే ప్రవర్తించ గోరెను. మరియు అది క్రీస్తు మతస్థురాలై, నాతో కూడ ఏక ప్రభువుయొక్క సేవకురాలునై, ఏక మోక్షమునకు నాతో కూడ బాధ్యురాలువైన సంగతి నేను తెలుసుకొంటిని, గనుక మునుపటి-కంటె యెక్కువగా దాని యెడల నాకు ప్రేమ కలిగెను. అనేక సంవత్సరముల క్రిందట, ఈ ఆయా కానుపూరునుంచి నాతో కూడ వచ్చెను గనుక, ఇప్పుడు మేము నివసించిన చోట దీనికి కావలసిన-వారు ఎవరును లేకపోయిరి. మరియు దీనికి పెనిమిటే కాని, పిల్లలే కాని, లేరు గనుక, ఇది తిరిగి కానుపూరు వెళ్లుటకు మనస్సు లేక, నాతో కూడనే ఉండ గోరెను. ఈ హేతువును పట్టి ఇది క్రీస్తు మతస్థురాలు కావడము ఒకందున సులభముగా నుండెను. అయి-నప్పటికిని, ఇది బాల్యమునుంచియు తురకలయొక్క అన్ని ఆచార-

ముల చొప్పున జరిగించుచు వచ్చెను గనుక, తన కులము కాక మరి-
యొక కులముతో కలిసి తినుటకు మిక్కిలి కఠినమని యెంచినందున,
నేను దానికి చెప్పిన ఆలోచనము ఏమంటే,—"నీవు నీ కులమును
'త్వరపడి విడువ వద్దు. జాతివారియొక్క మాయచేతను క్రీస్తు మత-
'ములో ప్రవేశించినదని, నిన్ను గురించి జనులు చెప్పకొనకుండ,
'నీవు ఈ సంగతిని గురించి ఇంక కొంతకాలము ఆలోచించి చూ-
'డుము" అంటిని.

ఒక దినము ఆయా నా మంచము దగ్గర కూర్చుండి, ఒక గుణి-
తపు పుస్తకమును చదువుచుండెను. క్రీస్తు మతములో ప్రవేశించు-
టకు, అది యెప్పుడైతే ఆలోచించుకొనెనో, వెంటనే చదువు
నేర్చుకొనుటకును ఆరంభించినది. అంతట నేను దానిని చూచి,—
"ఆయా! నీవు క్రీస్తు మతస్థురాలవు కావడమునకు నీ మనస్సులో
'ఆదియందు బుద్ధి పుట్టించినది యేది?" అని అడిగితిని. అందుకు
అది ఇట్లనియే;—"అమ్మా! పుల్లనియొక్క పిల్లలు మత విషయమై గొ-
'ప్పగా ఎంచిన సంగతిని పట్టి, నాకు ఈ బుద్ధి కలిగినది. ఎందుకంటే,
'వీరు కేవలము పిల్లలై యుండియు, చిన్న తప్పితములను చేసినప్పుడు,
'వీరు నిండ కలతపడి దుఃఖించగా, నిరంతరమును దేవుని ఆజ్ఞలను
'అతిక్రమించే నేను ఆయన కోపమును ఏలాగున తప్పించుకొన
'గలను అనుకొంటిని. ఈ చొప్పున పాపము చేసినట్టు, నా మనస్సులో
'పరిశుద్ధాత్మ జ్ఞానమును కలుగచేసి, ప్రాయశ్చిత్తము లేనిది పాపము
'క్షమింప బడదనేది రూఢిగా నాకు అనుభవము అయ్యేటట్టును చేసెను.
'సాధువును సత్యవతియు ఈ ప్రాయశ్చిత్తమును గురించి నాతో
'తరుచుగా చెప్పినప్పటికిని, అందును గురించి ఇంక వినుటకు మిక్కిలి
'ఆసక్తి కలిగి, క్రీస్తుయొక్క యావత్తు చరిత్రయు నాకు చదివి విను-
'పించుమని వారిని బతిమాలుకొంటిని. ఆయన గొప్ప దయను గురించి
'నేను వినగా, నా మనస్సు ఆయన వైపునకు లాగబడెను గాని, ఆ

'సమయములో పాపాత్ములు క్రీస్తు మరణమువల్ల ఏ చొప్పున నీతి-
'పరులగుదురో, ఆ సంగతి నాకు బాగుగా బోధపడలేదు. తరువాత
'ప్యారి, తన మరణకాలమందు ఆ సంగతిని గురించి క్రీస్తుయొక్క
'నెత్తురు చెయ్యి అనే దృష్టాంతముచేతను కరుణకు తెలిపినప్పుడు,
'చిందింపబడిన క్రీస్తుయొక్క రక్తమువల్లనే పాపాత్ములు క్షమాపణ
'పొందడమే కాక, దేవుని చేతనుకూడ నీతిపరులుగా చేయబడుదురని
'నేను బాగుగా తెలుసుకొంటిని. ఇది నాకు తెలియగానే ఇంత
'గొప్ప రక్షణమును గురించి ఇక అశ్రద్ధ చేయలేక పోతిని" అనెను.
అందుకు నేను—"అవును, అయా! మన పాపములయొక్క లెక్క
'పద్దులు దేవుని జ్ఞాపకమనే పుస్తకములోనుంచి యేసుయొక్క నెత్తురు-
'చేతను తుడుపు పెట్టబడుట అనే దృష్టాంతము మిక్కిలి దివ్యమైనది.
'మరియు మన ప్రియయైన ప్యారికి ఆమె పాపములన్నియు ఈ
'చొప్పున తుడుపు పెట్టబడెననే నిశ్చయ జ్ఞానము ఎంత దృఢమై
'యుండెను" అంటిని.

చచ్చిపోయేటప్పుడు ప్యారి పలికిన మాటలు జ్ఞాపకమునకు తెచ్చు-
కొని, అయా వెక్కి వెక్కి యేడుచుచు,—"హా! అమ్మా! ప్యారి సంకట-
'పడిన తరువాతను, నేను రెండు మూడు పర్యాయములు ఆమె దర్శ-
'నము చేసినందువల్ల, నాకు కలిగిన లాభము ఎంతయని చెప్పుదును.
'అయ్యో! క్రీస్తు మత స్త్రీలందరును ప్యారీ వంటి వారును ఫుల్మనీ-
'వంటి వారును అయ్యుంటే, చాలా కాలము కాకముందే ఒక్క
'హిందూ మతస్థురైన తురక మతస్థురైన నుండక పోవును" అని
పలికెను.

అంతట ఎవరో ఒకరు బయట నిలుచుండి, అయాను పిలిచినందు-
వల్ల, మా సంభాషణ నిలిచెను. ఆ పిలిచిన మధురమైన స్వరమును
నేను విని, సత్యవతి వచ్చినది గదా అని వెంటనే అనుకొంటిని.
అప్పుడు దానిని లోపలికి రమ్మనుమని పిలిచితిని. అది లోపలికి

వచ్చుచున్నే,—"అమ్మా! మా తల్లి మాకు ఆజ్ఞాపించినది ఏమంటే, మీరు 'బడినుంచి వచ్చేటప్పుడు, ఆయా యొద్దకు వెళ్లి, దొరసానిగారికి ఏలా-'గున నున్నదో అడిగి రండి అనెను. ఇందు నిమిత్తమే మేము వచ్చి 'యున్నాము" అనెను. అందుకు నేను—"సత్యవతీ! నాకు నేడు కొం-'చెము నయముగా నున్నది. కాబట్టి నీ అన్న బయట కాచుకొని 'యుంటే వానిని లోపలికి పిలుచుకొని రమ్ము" అని చెప్పితిని. వెంటనే సాధువు లోపలికి వచ్చి, యథా ప్రకారము మర్యాద పూర్వకముగా నాకు ఒక సలాము పెట్టెను. అప్పుడు వారిద్దరును నా బల్ల మీద ఒక పెద్ద అద్దము ఉండగా, చూచి, అటువంటి దానిని వారు అంతకు పూర్వము ఎప్పుడును చూచి యుండలేదు గనుక, చాలా ఆశ్చర్య-మును పొందిరి. అప్పుడు సత్యవతి సంతోషముచేతను చప్పట్లు చరుచుచు,— "అన్నయ్యా! మనము ఇంటికి వెళ్లగానే, ఇక్కడికి 'వచ్చిన మీదట ఇద్దరు దొరసానులను ఇద్దరు ఆయాలను ఒక్క-'పోలికగా చూచినామని చెప్పుదును. మన అమ్మ దానిని బొత్తిగా 'కనుగొనలేకుండ నుండును" అనెను. అటు తరువాత వారు కొన్ని పన్నీరు బుడ్లను, మరి కొన్ని పరిమళ వస్తువులను చూచి, వాటిని చాలాగా మెచ్చుకొనిరి. నేను వారి బట్టల మీదను కొంచెము అత్త-రువు పోసే వరకు, వారికి కలిగిన అత్యంత సంతోషమువల్ల వారికి ఏమియు తోచకపోయెను. అయినప్పటికిని వారు తిన్నగా నడుచు-కొని, ఏమియు ముట్టక, ఏమియు అడుగక ఉండిరి. అంతట సా-ధువు, నేను సంకటముగా నున్న సంగతి జ్ఞాపకమునకు తెచ్చుకొని,— "అమ్మా! మేము ఇప్పుడు ఇంటికి వెళ్లడము ఉత్తమము అనుకొను-'చున్నాను. మేము ఇక్కడ నుంటే, మా వల్ల మీకు సంకటము 'హెచ్చునేమో" అని చెప్పెను. అయితే అది ఆలాగున నుండక-పోవడమే కాక, వారి వంచన లేని పలుకులను వినుటకు ముచ్చ-టైనది గనుక, నేను దానితో—"వద్దు వద్దు, వెళ్లవద్దు. ఈ వేళ బడిలో

'ఏమి నేర్చుకొంటివో కూర్చుండి చెప్పుము" అంటిని. ఇది విని,—"ఓ 'అమ్మా! మీరు చాలా దినముల క్రిందట, ఒక సారి ఒకానొక ఆది- 'వారము నాడు వచ్చి, మా బైబిలు సంబంధమైన వచనములను ఒప్ప- 'గించుకొందుమని చెప్పితిరి కాని, మీరు రానేలేదు. కాబట్టి మీ 'సెలవు అయితే, మా బడి పాఠములు చెప్పడముకంటె, క్రిందటి 'ఆదివారము మేము నేర్చుకొనిన వచనములు చూడకుండా నొప్ప- 'గింతుము. వాటిలో కొన్ని మహా దివ్యమైన వచనములున్నవి" అని సత్యవతి చెప్పెను. అందుకు నేను—"మంచి పనే, వాటిని 'చెప్పి వినిపించుము. అటుతరువాత, మీ తండ్రి వాటికి ఏమి 'అర్థము చెప్పెనో, దానిని నాకు తెలియచేయవలసినది" అంటిని. మొదటనే సత్యవతి ఆరంభము చేయ కోరెను, అయితే దాని అన్న నవ్వి,—"సత్యవతీ! మొదట నేనే ఒప్పగించవలసినది. అయితే నేమి, 'నీవు ఆరంభము చేయ కోరుచున్నావు గనుక, చెప్పసాగుము" అనెను. అప్పుడు సత్యవతి ఈ ముందు వచ్చే వచనములను తప్పులేకుండా ఒప్పగించెను. 'బాలుడు నడువవలసిన మార్గమందు వానిని ప్రవేశిం- 'పచేయుము; వాడు ముసలి అయినప్పుడు, దానిని విడువక ఉండును; 'అవివేకము బాలుని హృదయములో చేరుకొని యుండును; శిక్షించే 'చువ్వ వానియొద్దనుంచి దానిని తొలిగి పో చేయును.' (సామితెలు, 22: 6—15.) 'పిల్లలారా! ప్రభువునందు మీ తలిదండ్రులకు విధే- 'యులై యుండుండి, ఇది న్యాయమే.' (ఎఫెస్ 6: 1.) 'యేసు 'దాని చూచి, కోపపడి, వారితో చిన్న పిల్లలను అడ్డగించక, వారిని 'నా యొద్దకు రానియ్యుడి, దేవుని రాజ్యము ఇటువంటివారిదై యు- 'న్నది.' (మార్కు. 10: 14.) సత్యవతి వీటిని చెప్పి ముగించిన తరు- వాత, నా ముఖము చూచి,—"ఈ చివర వచనము తక్కినవాటికంటె 'బహు బాగుగా నున్నది. 'చిన్న పిల్లలను నా యొద్దకు రానియ్యుడి' అని 'యేసుక్రీస్తు చెప్పిన ఈ మాటలో ఎంత గొప్ప కరుణ కనుపడుచు

'న్నది. హా! నేను యేసునెడల మిక్కిలి ప్రేమగా నున్నాను" అనెను. ఈ ప్రియయైన చిన్నది ఈ చొప్పున మాట లాడడము నేను వినగా, నా కన్నీరు ప్రవహించ సాగెను. అది ఈ సంగతిని కనుకొని, తన చిన్న కోకయొక్క చెంగుతో ఆ కన్నీరును తుడిచివేసినది. అప్పుడు సాధువు దానితో—"సత్యవతీ! తమ తలిదండ్రుల యెడల విధేయులై 'యుండి, ఇహమందు సహా ఫలమును పొంది యున్న మనుష్యులయొ- 'క్క చరిత్రలను గురించి మనము బైబిలులో వెదకిన సంగతి విషయ- 'మైయూ దొరసానిగారికి తెలియ చెప్పుము" అనెను. అప్పుడు సత్యవతి అన్నమాట;—"ఈ కథలన్నియు ఇప్పుడు నాకు జ్ఞాపక- 'మునకు రావు, కాని బైబిలులో నాకు నేనే కనుకొనిన ఈ రెండు 'కథలను దొరసానిగారితో చెప్ప గలను. ఏమంటే, యోసేపును సౌ- 'లును తమ తలిదండ్రుల యెడల విధేయులై యుండి, చివరకు 'రాజులైరి. యోసేపు తన తండ్రియొక్క ఆజ్ఞ చొప్పున తన అన- 'దమ్ముల క్షేమమును విచారించుటకు వెళ్లితే, వారు అతనిని పట్టుకొని, 'ఐగుప్తు దేశమునకు వెళ్లుచుండిన వర్తకులకు అమ్మివేసిరి కాని, 'అతడు ఆ దేశమునకు అధిపతి ఆయెను. ఆ చొప్పుననే సౌలును 'తన తండ్రియొక్క గాడిదెలను వెదకి తీసుకొని వచ్చుటకు వెళ్లితే, 'ప్రవక్తయైన సమూయేలు అతని నెదురుకొని, ఇశ్రాయేలు మీదను 'రాజుగా నుండుటకు అభిషేకించెను" అనెను. నేను ఈ దృష్టాంతమును విని, చిరునవ్వు నవ్వి,—"మంచిది సత్యవతీ! నీవు మహా ఘనమైన 'దృష్టాంతములను చెప్పితివి, సరే. అయితే నీవు నీ తలిదండ్రులు 'చెప్పే మాటలను వింటే, ఒక చిన్నరాణిని అగుదునని అనుకొను- 'చున్నావా?" అంటిని. అందుకు సత్యవతీ—"లేదు అమ్మా! ఆలాగున 'కాదు. అయితే నేను నా తలిదండ్రులకు లోబడే పక్షమందు, దేవుడు 'నాయందు ప్రేమ తలచును. ఇంతే చాలును, నాకు ఇకను వేరే 'ఘనత అక్కర లేదు. ఇప్పుడు నా అన్న చెప్పబోయే అతని పాఠ-

'మును వినుడి. ఆయనకు నాకంటె ఎక్కువ వచనములు వచ్చును"
అని బహు గౌరవముగా చెప్పెను. అంతట సాధువు లేచి, నిలుచుండి,
స్పష్టముగా వినిపించిన వచనములు ఏవంటే: — "యెహోవా వలని
'భయము తెలివికి ఆరంభము: మూఢులు జ్ఞానమును బోధను అలక్ష్య-
'పెట్టుదురు. నా కుమారుడా! పాపాత్ములు నిన్ను పురికొలిపితే, నీవు
'ఒప్పకుము. నా కుమారుడా! నీవు వారితో కూడ త్రోవ నడువకుము;
'నీ కాళ్లను వారి మార్గమునుంచి తప్పించుకొనుము." (సామితెలు.
'1: 7-10-15.) 'మూఢుడైన కుమారుడు తన తండ్రికి నిస్సారముగాను,
'తన్ను కన్నదానికి చేదుగా నుండును.' (సామితెలు. 17: 25.) 'నేను
'గొఱ్ఱెల మంచికాపరిని. మంచి కాపరి గొఱ్ఱెలకొరకు తన జీవము
'పెట్టును.' నేను మీతో చెప్పిన ప్రకారము నా గొఱ్ఱెలు నా శబ్ద-
'ము వినును, నేను వాటిని ఎరుగుదును, అవి నన్ను వెంబడించును.
'నేను వాటికి నిత్య జీవము ఇచ్చుచున్నాను, అవి ఎన్నడును నశిం
'చవు, ఎవడును వాటిని నా చేతిలోనుంచి అపహరించడు.' (యోహా-
ను. 10: 11-27-28.) 'ద్రాక్షా వల్లిని నేను, తీగెలు మీరు, ఎవడైన
'నాయందును నేను వానియందును నిలిచి యుంటే, వాడు బహుగా
'ఫలించును, నాకు వేరై మీరు ఏమియు చేయలేరు' (యోహాను.
15. 5.) అనునవే.

సాధువు చెప్పి ముగించిన తరువాత, నేను వాని చూచి,—"మం-
'చిది సాధువా! నేను మంచి గొల్ల వాడనని యేసు తన్ను గురించి
'చెప్పినప్పుడు, ఆయన ఏమి తాత్పర్యముతో చెప్పెనో, ఆ సంగతి
'నీకు తెలుసునా?" అని అడిగితిని. అందుకు సాధువు—"అవును
'అమ్మా! నాకు తెలుసును. గొల్ల వాడు తన గొఱ్ఱెలను ఏ చొప్పున
'కాపాడునో, ఆ చొప్పుననే యేసు తన విశ్వాసపు జనులను సకల-
'మైన కీడులనుంచియు తప్పించుచున్నాడు. బైబిలులో ఒక చోట
'సైతాను చీల్చి భక్షించే సింహము అయ్యున్నాడని చెప్పబడియు-

న్నది. యేసు తన శిష్యులను ఈ గర్జించే సింహమునుంచి తప్పించు-చున్నాడు, అనగా ఆయన వారికి ఇచ్చేబలము ఎటువంటిదంటే, వారు దానివల్ల సైతానుయొక్క శోధనలలోనుంచి తప్పించుకొన-గలరు" అని పలికెను.

అంతట సత్యవతి—"ఓ అన్నా! గొఱ్ఱెపిల్లలను గురించి ఈ దొర-సానిగారితో చెప్పటకు మరచి పోతివి. చూడు! గొఱ్ఱెపిల్లలు బలహీనముగా నుండేటప్పుడు, గొల్లవాడు వాటిని తన భుజము మీ-దను ఎత్తుకొనును. ఆ ప్రకారముగానే యేసు తన జనులయొక్క శిశువుల యెడల ప్రేమ తలచి, శిశువులను నా యొద్దకు రానియ్యుడి అని చెప్పుచున్నాడు" అనెను. అందుకు నేను—"సత్యవతీ! నీవు చెప్పినది వాస్తవమే. యేసు క్రీస్తును ఒకానొకప్పుడు శిశువై యుం-డెను గనుక, శిశువులయొక్క సంతోషములను దుఃఖములును ఇట్టి-వని ఆయన బాగుగా తెలుసుకొని యున్నాడు" అంటిని.

సత్యవతి ఇది విని,—"హా! అమ్మా! నేను రక్షకుని గూర్చి ప్రార్థిం-చేటప్పడెల్ల, ఈ సంగతిని జ్ఞాపకము చేసుకొనుటకు ప్రయత్నము చేయుదును. ఒకనాడు మా బోధకుని భార్య—'నేటి సాయంకా-లము వర్షము కురియకపోతే, మగపిల్లలను ఆడపిల్లలను అందరిని ఏటి ఆవలకు తీసుకొని వెళ్లి, ఒక దొరయొక్క సాధువైన పిపంగిని వారికి చూపుదును' అని వాగ్దత్తము చేసెను. అప్పుడు ఆ దినము వర్షిం-చకపోవు గాకని ప్రార్థించితిని. నేను ప్రార్థించిన తరువాత, ఇంత స్వల్పకార్యము కొరకు నేను ప్రార్థించినందున, దేవుడు నా యెడల కోపముగా నుండునేమో అనుకొన సాగితిని. అయితే వెంటనే, యేసు శిశువై యుండినప్పుడు, ఇటువంటి వింతలను చూ-చుటకు, తానును సంతోషించి యుండవచ్చునని నేను విచారించి, అటువంటి సంగతుల విషయమై ఇకను ప్రార్థించుటకు భయపడ-కుంటిని. ఇంతే కాక, నా ప్రార్థనయు నెరవేరెను. ఆ దినము

వర్ణించక పోయినందున, మేము వెళ్లి ఆ సివంగిని సావధానముగా చూచితిమి" అని ముఖోల్లాసముతో చెప్పెను. అప్పుడు సాధువు నాతో—"అమ్మా! మా నాయన ఈ కథను విని, సత్యవతి చక్కగా జరిగించెనని చెప్పెను. ఎందుకంటే, అపొస్తలైన పౌలు 'మన దౌర్బల్యములయందు మనతో కష్టపడని ప్రధాన యాజకుడు మనకు కలిగి యుండలేదు' అని వ్రాసెను. (హెబ్రీ. 4: 15.) కాబట్టి వయస్సు చేత పెద్దలైన వారు తమ కోరిక ప్రకారము ప్రార్థించుటకు ఆజ్ఞాపించబడగా, పిల్లలును తాము కోరే దాని కొరకు ప్రార్థించవచ్చును గదా" అని చెప్పెను. అందుకు నేను—"మీ తండ్రి న్యాయముగా విచారించినాడు. మంచిది. నాలో నివసించుడీ అని క్రీస్తు తన శిష్యులకు సెలవు ఇచ్చిన వాక్యమునకు అర్థము ఏమి?" అని అడిగితిని. అందుకు సాధువు—"దాని అర్థము ఇదే, అనగా క్రీస్తును వెంబడించి, ఆయనతో కూడ నివసించవలసినది అనునదే" అనెను. అప్పుడు నేను ఈలాగున ఆయన ఎందుకు ఆజ్ఞాపించెనని అడిగితే, సాధువు—"ఒక కొమ్మకు చెట్టుయొక్క వేరునుంచి సారము కలుగకపోతే, అది ఏలాగున వాడిపోవునో, ఆలాగుననే క్రీస్తుయొక్క జనులు ఆయనను విడిచి ప్రత్యేకించి యుంటే, వారి భక్తి నశించిపోవును. ఎందుకంటే, సైతాను నిరంతరమును వచ్చి, మనుష్యులను ప్రేరేపించుచున్నాడు గనుక, వారు క్రీస్తు యొక్క కృపయు బలమును పొందకపోతే, సైతానును జయించలేక, పాపములో పడక మానరు" అని పలికెను.

ఇటువంటి సంభాషణతో చాలా కాలము జరిగినది కాని, నేనును ఈ పిల్లలును వారితల్లి వారి కొరకు ఇంటి యొద్ద ఆశగా నిరీక్షించుచుండుననే సంగతి మరచిపోతిమి. అంతట ఫుల్మనీ తానే కనుపించని నిక్షేపము వంటి తన పిల్లలను వెదకుచు వచ్చెను. ఆమె తన పిల్లలు నా యొద్ద ఉండడము చూచి, కోపగించకయే, నన్ను

చూచి,—"అమ్మా! మీరు స్వస్థముగా లేరు. ఈ పిల్లలు మీకు ఆయా-
'సము కలుగ చేతురేమో అని నేను భయపడుచున్నాను. వారిని
'ఇకను ఇక్కడ నుంచక, నేను తీసుకొని వెళ్లుదును" అనెను. బంగాళీ
స్త్రీలలో చాలా మంది ఫుల్మనీ యొక్క ఈ నడవడివల్ల బోధ కలుగ
చేసుకొన వచ్చును. నా తాత్పర్యము ఏమంటే, దొరల ఇండ్లకే
కాని, లేక తమ ఇరుగు పొరుగున నున్న వారి ఇండ్లకే కాని, అయుక్త
కాలములయందు వచ్చి, నిమిత్తము మాలిన తొందర పెట్టుచుండే స్త్రీలు,
ఇంతకు పూర్వము చెప్పినట్టు, బోధ కలుగ చేసుకొన వచ్చును.

అప్పుడు నేను ఆమెతో—"లేదు ఫుల్మనీ! నీ పిల్లలు ఎంతమాత్ర-
'మును నా సంకటమును ఎక్కువగా చేయడము లేదు. నేను వారిని
'వారి మతమును గురించి అడుగుచుంటిని. ఎందుకంటే, క్రీస్తు యొ-
'క్క మందలో ఉండే పిల్లలకు బోధ చేయడము కంటె, లోకములో
'శ్రేష్ఠమైన పని లేదని అనుకొనుచున్నాను" అని చెప్పితిని. అప్పుడు
సాధువును సత్యవతియు వసారా లోనికి పరుగెత్తుకొని వెళ్లి,
నా చిలుకను చూచుచుండిరి గనుక, వారు లేనప్పుడు వారిని మెచ్చు-
కొనుటకు నేను సంకోచించక,—"ఫుల్మనీ! నీ పిల్లలు మతాభిమానము
'కలవారనియు, వారి పరలోకపు తండ్రికి ఇష్టమైన వాటిని చేయు-
'టకే ప్రయత్న పడుచున్నారనియు తెలుసుకొంటిని. కాబట్టి
'దేవుడు నీ బోధలను వారి యెడల ఆశీర్వదించుచున్నాడని స్పష్టము-
'గా కనుగొనుచున్నాను" అని చెప్పితిని. అందుకు ఫుల్మనీ—"హా!
'అమ్మా! సమూయేలు యొక్కయు, తిమొథి యొక్కయు తల్లుల వలెనే,
'నేనును నా పిల్లలను వారి బాల్యముంచి నీతి మార్గమున కొంచపో-
'వుటకు నాకు శక్తి కలిగేలాగున ప్రార్థించుచున్నాను. మరియు నా
'పిల్లలు సమూయేలును తిమొథియును వలెనే, భక్తులై, దేవుని యెడల
'శ్రద్ధ కలిగితే, నా మనోభీష్టము నెరవేరినది అనుకొందును"
'అనెను. అందుకు నేను—"ఫుల్మనీ! భయపడ వద్దు. నీకు ఈ యావి

'దొరకక పోదు. నా యెడల ప్రేమ ఉంచే వారియందు నేనును 'ప్రేమ ఉంచుచున్నానని దేవుడు చెప్పియున్నాడు. మరియు అటు-'వంటివారిని రిక్త హస్తముతో ఎన్నటికిని పంపివేయడు. కరుణ తన 'పిల్లలకు బోధించి, వారి కొరకు ప్రార్థించి యుంటే, ఇప్పుడు తన 'కుమారుని శాశన విషయమై నిరపరాధినని తెలుసుకొని కొం-'చెము గొప్ప ఆదరణ పొందేదే గదా" అంటిని. ఈలాగున మేము మాటలాడిన తరువాతను, సాధువును సత్యవతియు ఇంటిలోనికి రా-వడముతోనే, ఫుల్మనీ నా వద్ద సెలవు పుచ్చుకొని, వారిని వెంట-పెట్టుకొని, ఇంటికి వెళ్లెను

హా! వినయము [illegible] ఈ క్రీస్తు మత స్త్రీ [illegible] దాని ప్రియు-లైన పిల్లలతోను నే[illegible]సిన సంభాషణవల్ల నా హృ[illegible]యము ఎంతో సంతోషించెను. [illegible]దూ దేశపు జనులందరును, ఒ[illegible]డు కాక-పోతే, ఒకనాడైన [illegible]భువును సేవింతురు. ఆ దివ్య [illegible]కు ఫుల్మనీ-యొక్క కుటుంబ[illegible] ముఙ్గుర్తు అయ్యున్నది. ఈ చొ[illegible]వ్వన ఆలో-చించుకొనుచు, "[illegible]వా! ఈ కాలము త్వరగా [illegible]గున చేయు-'ము. నీతి సూర్యుని [illegible]రోగ్య కిరణములతో [illegible]యింప చేసి, ఈ 'దేశమందు వ్యాపించి య[illegible]జ్ఞానము[illegible]కటిని పార దోలుము. 'ప్రభువా! నేను కట్టెలు నరికేదాని వలెను, నీళ్లు చేదుకొనేదాని 'వలెను ఉండినప్పటికి, ఈ గొప్ప కార్యముయొక్క అభివృద్ధికిగాను, 'నన్నును కొంత భారము పుచ్చుకొననిమ్ము" అని మనస్సులో ప్రా-ర్థించితిని.

దాదాపు ఆరు వారములు గడిచిన తరువాతను, నేను బయట తిరుగుటకు తగినంత స్వస్థతను పొంది, కరుణను చూచుటకు నాకు ఆశ కలిగినందున, దాని ఇంటికే మొదట వెళ్లితిని. నేను అక్కడికి వెళ్లగానే, దాని ముఖము చాలా చిక్కిపోయి యుండి, అది మనో-వ్యాధి చేతను మిక్కిలి కుష్కించి యున్నట్టు చూచితిని. నన్ను

చూడగానే, అది తన కుమారుని మరణ దినమును జ్ఞాపకమునకు
తెచ్చుకొని, ఏడుచుచు,—"హా! అమ్మా! నా దురదృష్టము ఏమని చెప్ప-
'దును? నా ఆయుస్సు అంతయు దుఃఖముతోనే సరిపోయెను" అని పలి-
కెను. అప్పుడు నేను వంశిని గురించి ఏమియు చెప్పకుండడమే మేలని
యెంచి,—"కరుణా! నీ మనస్సును దుఃఖించనీక, నెమ్మది పొంద-
'నిమ్ము. నీ అదృష్టము మంచిది కాదని చెప్పుట వ్యర్థము. అదే కాక,
'అందువల్ల నీ మనస్సు కఠినమైపోవును, ఇది మరి చెడ్డది. అప్పుడు
'దేవుడు నీయెడల కోపముగా నుండును. కరుణా! దుఃఖమనేది ఈ
'లోకములోనికి ప్రవేశించిన విధము నీవు నాకు చెప్ప గలవా?" అం-
టిని. అందుకు కరుణ—"పాపమువల్లనే" అనెను. అటుతరువాత నేను
ఆమెతో—"అది సత్యమే, గనుక మనము దుఃఖము పోగొట్టుకొనే
'నిమిత్తము, మొదట దుఃఖముయొక్క కారణమును పోగొట్టుకొన-
'వలెను. అనగా అదృష్టము మంచిది కాదని చెప్పుటకంటె, మనము
'మన పాపముల విషయమై యేడ్చి, పలవించి, వాటిని విసర్జించవ-
'లెను. దుఃఖపడే వారు ధన్యులు, వారు ఓదార్చబడుదురని యేసు
'చెప్పియున్నాడు. అనగా పాప విషయమై దుఃఖించేవారు
'ధన్యులు. నేను ఇంతకు పూర్వము చెప్పినట్లు, ఎవడైన తనకు
'ఉన్న రోగమును పట్టి దుఃఖించితే, వాడు మందు పుచ్చుకొని బా-
'గుపడును. పాపము హృదయముయొక్క రోగమై యున్నది. క్రీస్తు
'దానికి వైద్యుడు. ఆయనయందు నీకు విశ్వాసముంటే, నీవు పాపము-
'నుంచి విడుదల పొందుదువు" అంటిని. అందుకు కరుణ—"అవును
'అమ్మా! అది నిజమే. అయితే నా దుఃఖములన్నియు నా వల్లనుంచే
'కలుగడము లేదు. నా పెనిమిటి వాటికి చాలా మట్టుకు కారకుడై
'యున్నాడు గనుక, అందుకు అతనినే అనవలసినది. ఈ దినమే
'నేను అతని వెంట డబ్బులు అడుగుకొనుచు, సారాయి దుకాణము
'నొద్దకు వెళ్లితిని. అయితే అతడు ఒక్క గవ్వ అయిన నాకు ఇయ్య-

'లేదు. ఇయ్యకపోవడమే కాక, నన్ను తిట్టి తరిమి వేసెను" అనెను.
అప్పుడు నేను—"కరుణా! నీవు తిన్నగా నుండి, సంతోషముగా మా-
'టలాడి, అతని ఇల్లు అతనికి ఆనందకరముగా నుండేటట్టు చేసిన-
'పక్షమందు, అతడు అటు ఇటు ఎందుకు చల చిత్తముగా సంచరిం-
'చును? ఇది నీవు చేసితే, అతడు నీయెడల మిక్కిలి దయగా నుం-
'డును" అని చెప్పితిని.

అందుకు కరుణ—"నా యంతట నేను ఇది బొత్తుగా చేయలేను
'అనుకొనుచున్నాను. ఎవరైన నాకు ఉపదేశించితే, అప్పుడు ఒక-
'వేళ సిద్ధించవచ్చును" అనెను. అంతట నేను—"కరుణా! నేను చెప్పి-
'నట్టు నీవు చేసే పక్షమందు, నేను నీకు ఉపదేశింతును. మెట్టుకు
'నీవు మొదట దేవుని పది యాజ్ఞలను వల్లించుము. అటుతరువాత ఈ
'యాజ్ఞలన్నిటి చొప్పున జాగ్రత్తగా నడుచుకొనుటకు ప్రయత్నము
'చేయుము. ముఖ్యముగా విశ్రాంతి దినమును పరిశుద్ధముగా ఆ
'చరించి, దేవాలయమునకు వెళ్లుము. హా! కరుణా! నీవు ఇంత కాల-
'ము దేవాలయమునకు వెళ్లడము మానకుండిన, నీవు ఇప్పుడు
'మతమును గురించి ఇంత అజ్ఞానముగా నుండకయే పోదువు" అని
చెప్పితిని.

అప్పుడు కరుణ—"అమ్మా! నా వద్ద ఒక్క మంచి బట్ట అయిన
'లేదు గనుక, దేవాలయమునకు వెళ్లుటకు సిగ్గు పడుచున్నాను. ఆది-
'వారమునాడు అందరును మంచి బట్టలు కట్టుకొని వత్తురు. నేను
'మాత్రము మైలబట్టలతో ఏలాగున నుండ గలను!" అనెను.

అందుకు నేను అన్నమాట;—"కరుణా! దేవాలయమునకు తెల్లబట్టలు
'కట్టుకొని వెళ్లడమనేది యుక్తమే కాని, నీకు అటువంటి బట్టలు
'ఏ విధముచేతనైన దొరకక పోతే, దేవాలయమునకు బొత్తుగా వెళ్లక-
'పోవుటకంటె, సాధారణపు బట్టలు కట్టుకొని వెళ్లడమనేది ఉత్తమమై
'యుండును. ఎందుకంటే, శరీరము చాలా మట్టుకు అల్పమైన వస్తువు.

'ఆత్మ మిక్కిలి విలువ గలది గనుక, నీ యాత్మ క్రీస్తుయొక్క నీతిని
'ధరించేలాగున, ప్రయత్నము చేసుకొనుము. రాజైన దావీదు—'దేవుని
'కొండ మీదికి ఎక్కెది ఎవరు? ఆయన పరిశుద్ధ స్థలములో నివసిం-
'చేది ఎవరు? అని అడిగితే, పరిశుద్ధాత్మ ఇచ్చిన ప్రత్యుత్తరువు ఏ-
'మంటే, శుభ్రమైన హస్తములును నిర్మలమైన హృదయమును కలిగి,
'తన ఆత్మను మాయ వైపునకు లేవనెత్తక, కపటముగా ప్రమాణము
'చేయనివాడే. అతడు ప్రభువునుంచి దీవెనను, తన రక్షణయొక్క
'దేవునినుంచి నీతినిని పొందును' (కీర్తన. 24: 3, 4, 5.) అనునదే. మరి-
'యు కరుణా! నీవు మైలబట్టలతో మనుష్యుల యెదుటికి వెళ్లడమునకు
'సిగ్గుపడితే, లోకములోని జనులందరి యెదుటను ఉత్తమ దూతల యె-
'దుటను పాపమనే చింపిరిగుడ్డలు కట్టుకొని, చివర విమర్శ కాలము-
'లో ఏలాగున నిలువ గలవు! అయితే ఇది అట్లుండనిమ్ము. నీవు ఏ
'విధముచేతనైన దేవాలయమునకు వెళ్లుటకు ఒక తగిన బట్ట కొనలేవా?
'కొని, దానిని దేవాలయము కొరకే ఉంచుకొనలేవా?" అని అడిగితిని.

అందుకు కరుణ—"అమ్మా! తిని తృప్తి పొందుటకు చాలునంత
'ఆహారము కొనుటకు నా పెనిమిటి ఇంటికి ద్రవ్యము తీసుకొని
'రానప్పుడు, నేను ఒక మంచి కోకను ఏలాగున కొనగలను? మరియు
'ఇప్పుడు నేను దేవాలయమునకు వెళ్లడమువల్ల వినియోగమేమి? నేను
'నా దౌర్భాగ్య కుమారుని ఆత్మను చెరిపివేసితిని. దేవుడు నా
'ప్రార్థనలను బొత్తుగా వినడు. నేను నా పిల్లతో కూడ నరకాగ్నిలో
'నిత్యముగా నుండవలెను" అనెను.

ఇది విని,—"అయ్యయో! నీవు ప్యారియొక్క చివర మాటలు
'ఇంత శీఘ్రముగానే మరచిపోతివా?" అని అడిగితిని. అందుకు
కరుణ—"లేదు అమ్మా! వాటిని మరచిపోలేదు. ఇంతే కాక నా
'మనస్సులో ఆ సంతోషకరమైన మాటలను గురించి ధ్యానించుకొ-

'మచున్నాను. అయినప్పటికి, క్రీస్తు నన్ను రక్షించునని నాకు
'బొత్తుగా ఆశలేదు" అని ఉత్తరము పలికెను.

అప్పుడు నేను—"కరుణా! భయపడవద్దు. ఆయన నిన్ను రూఢి-
'గా రక్షించును. నీవు అనుదినమును ప్రార్థించవలసిన విధము ఏమంటే,
'ఓ దేవా! నీ కుమారుడైన యేసు క్రీస్తుయొక్క రక్తమనేది మమ్ములను
'యావత్పాపమునుంచి పరిశుభ్రము చేయుచున్నదని నా హృదయ-
'ములో గట్టి నమ్మకమును కలుగ చేయుము అమనదే" అంటిని. అం-
దుకు కరుణ సమ్మతించి,—"మంచిది అమ్మా! అలాగుననే చేతును"
అనెను. అప్పుడు నేను ఇంక చెప్ప సాగినది ఏమంటే:—"నీ ఇల్లు
'ఆనంద నివాసమై యుండేలాగున, నీకు ఒకటి రెండు విధులు చెప్ప-
'వలసి యున్నాను. నీ నడత మునుపటికంటె బాగుగా ఉండనిమ్ము.
'అలాగున నంటే, దానిని నీ పెనిమిటి వెంటనే కనుగొనక పోయినను,
'చివరకు కనుగొనక యుండడు. కనుగొని నిన్ను మెచ్చుకొనును,
'కోపము యావత్తును మానుము. అవశ్యములైన నీ ఇంటి పనులు
'చేసుకొనుము. ప్రేమచందు పనిలోనుంచి ఇంటికి రావడముతోనే,
'ఫుల్లనీ అతడు ఇంటివద్ద కట్టుకొనే బట్టలను అతని హుక్కా మొద-
'లైన వాటినిని ఏలాగున సిద్ధము చేయుచున్నదో, నీవును, అలాగుననే,
'నీ పెనిమిటియొక్క ఆదరణ నిమిత్తము, అన్ని విధములచేతను ప్ర-
'యత్న పడుము. ముఖ్యముగా ఈ పనులనన్నిటిని చేయుటకు మన-
'స్సును శక్తినిని ఇచ్చి, మీ ఇద్దరి హృదయములను మళ్లించుకొనే-
'లాగు, దేవుడు దయ చేయునట్లు, ఆయనను అనుదినమును ప్రార్థిం-
'చుము. హా! దేవుడు ఈ ప్రార్థనను వింటే, నీవు ఎంత గొప్ప
'ఆనందములో నివసింతువో! నవీనుడు ఇప్పుడు నాతో కూడ
'ఉన్నట్టే గదా! అయినప్పటికిని, వాడు ఇంక నీ కుమారుడే. మరి-
'యు దేవుడు నీవద్ద అతనియొక్క ఉపదేశ విషయమైన లెక్కను
'అడుగును గనుక, నీవు వానితో 'నేను ఇంతకాలము దేవుని గురించి

'తెలుసుకొనక, ఆయన ఆజ్ఞలను అతిక్రమించితిని. అయితే ఇప్పుడు
'నేను నీతి మార్గమున నడుచుటకు కోరి, నిన్నుకూడ ఆ మార్గము-
'లోనికి తెచ్చుటకు ఇచ్ఛయించుచున్నాను' అని చెప్పుము. అప్పుడు
'నవీనుడు ఈ మాటలు విని, నిన్ను అమర్యాద చేయక, సన్మానించును.
'ఎందుకంటే, క్రీస్తు మతస్థులు ప్రవర్తించవలసిన విధము వానికి బా-
'గుగా తెలుసును. ఈ క్రొత్త మార్గము నీకు మొదట కఠినముగా
'నుండునని నేను ఎరుగుదును. అయితే దానిని వదిలి పెట్టవద్దు.
'ఈ దినము మొదలుకొని నీ నడతను దిద్దుకొన సాగుము. నీ పెని-
'మిటి ఇప్పుడు ఒకవేళ సారాయి దుకాణములో తాగి పడియున్నాడే-
'మో, అయినప్పటికిని, నిరాశను పొందక, అతని కొరకు సమస్తమును
'సిద్ధము చేసి యుంచుము. వ్యయము నిమిత్తము నీవద్ద సొమ్ము లేదని
'నేను ఎరుగుదును గనుక, నీవు ఈ రెండు రూపాయీలను పుచ్చు-
'కొనుము. మీరు ఉభయులను సంతోషముగా నుండి, దేవాలయ-
'మునకు కూడి వెళ్లే మట్టుకు, మిమ్ములను గురించి దేవుని ప్రార్థించక
'మానను" అని చెప్పితిని. కరుణ ఇది విని, కొంత మట్టుకు సంతో-
షించెను గాని, నిట్టూర్పు విడిచి,—"హా! మాకు ఇటువంటి ఐశ్వర్య-
'ము పట్టునా! నా ఇల్లు ఫుల్మనీ ఇంటివలెనే ఉండునా!" అనెను.
'అందుకు నేను—"కరుణా! ఇందుకు ఏమి సందేహము? ఇందుకు నీవు
'శ్రద్ధ కలిగి, ప్రార్థించవలసినది గదా. నీ హృదయమును అనుదిన-
'మును కాపాడుకొనుము. అందులో ఏ విధమైన పాపము ప్రవే-
'శించక చూచుకొనుము. ఏమైన పొరబాటు లటస్థించితే, ఫుల్మనీ-
'యొద్దకు వెళ్లి, ఆమెయొక్క ఆలోచనము పుచ్చుకొనుము. ఆమె
'నీకు మంచి ఆలోచనము సందేహము లేక చెప్పును" అంటిని.

ఈ సంభాషణము అంత ముగించగానే, ఒళ్లెరుగక తాగి పడిన
నవీనునియొక్క తండ్రిని ఒక బంట్రౌతు ఇంటికి తీసుకొని వచ్చి,
కరుణను చూచి,—"ఇదుగో నీ ప్రియుడైన పెనిమిటి. నేను దగ్గర

'లేకపోతే, ఒక బండి వానిమీద నడిచి వానిని చంపేదే" అనెను. కరుణ తన పెనిమిటియొక్క స్థితిని చూడగానే, దాని ముఖము కోపముతో కందెను. అప్పుడు నేను—"జాగ్రత్తగా ఉండుము కరుణా! 'జాగ్రత్తగా ఉండుము. స్పృహ తప్పిన మనుష్యుని గద్దించడమువల్ల 'వినియోగము లేదు. మాటలాడక, వానిని పరుండ పెట్టుము. ఉదయ-'మందు వానిని తిట్టవద్దు" అంటిని. కరుణ ఏమి చేయునో అని చూచుటకు, అక్కడనే నిలిచితిని. అంతట అది ఒక చాప పరచి, దాని మీదను ఒక పాత బొంత వేసి,—"నా ప్రియుడా! ఇక్కడ 'పరుండి, నిద్రపొమ్ము. కరుణయొక్క తాగుబోతు పెనిమిటి దాని 'క్రొత్త నడవడిని చూచి, దానిని ఆనవాలు పట్టలేక పోయెను" అని మధురమైన స్వరముతో పలికెను. అయితే వాడు పక్క మీద పరుండి,—"ఇది, మిక్కిలి మంచి చిన్నది. నేను దీని ఇంటికి నిరం-'తరమును వత్తును" అని తనకు తానే చెప్పుకొనెను. అటుతరువాత వాడు శీఘ్రముగానే నిద్రబోయెను. వాని భార్య తిరిగి ముంగిటి-లోనికి వచ్చి, నాతో సంభాషించెను.

నేను చెప్పినది యేమంటే,—"చూడుము, ప్రొద్దులేదు. అయి-'నప్పటికిని, నీవు అంగడికి త్వరగా వెళ్లితే, నీకు కొంత చేప దొరక-'వచ్చును. కొంత తీసుకొని వచ్చి, రేపుటి దినము నీ పెనిమిటికి 'మంచి వంటకను చేసి పెట్టుము. మరియు కరుణా! ఈ పని అంత-'టిలో నీవు మిక్కిలి ఆసక్తిగా నుండి, నీ ప్రయత్నము విడువక 'ఉండవలెను. అది లేనిది నీవు మేలును ఏలాగున చివర వెళ్లించ-'గలవు? ఇంతకు ముందు నీకు నేను తెలియచేసిన ప్రకారము, క్రమ-'ముగా ప్రవర్తించుటకు మొదట నీకు బహు కఠినముగా కనుపించును 'గాని, భయపడవద్దు. నీ బలహీనతను పాపపు వాడుకలనును రో-'జించుకొని, అనుదినమును బలము కొరకు కృప కొరకును దేవుని

'అడుగుకొంటే, ఆయన వాటిని నీకు నిశ్చయముగా దయ చేయును"
అంటిని.

కరుణ కొంతసేపు మౌనముగా నుండి, అటుతరువాత నిట్టూర్పు-
తో—"హా! అమ్మా! నేను నా నడతను దిద్దుకొనినప్పటికిని, నవీనుని
'తండ్రికూడ యోగ్యుడైనంగాని, ఇహమందు నాకు ఏ విధమైన
'సౌఖ్యమును ఉండదు" అని పలికెను. అందుకు నేను అనిన మాట;—
"కరుణా! నీ పెనిమిటి నీ మంచి నడతను నీ మృదువైన చేష్టలనును
'చూచి, క్రమముగా బుద్ధి తెచ్చుకొనును. అయితే అలాగున సిద్ధిం-
'చకపోతే నేమి! నీ మట్టుకు నీవు ఎందుకు నిశ్చింతగా ఉండవలెను!
'నిన్ను సృజించినవాడు దేవుడు; ఆయనయందు ప్రేమ ఉంచి
'ఆయనను సేవించుట నీకు విధి అయ్యున్నది. ఏది సంభవించినను,
'ఇది నీకు తప్పదని జ్ఞాపకము ఉంచుకొనుము. నీవు ఈలాగున
'యోచించకపోతే, నీవు నీతిమార్గమును గురించి శీఘ్రముగా విసికి,
'దానిని వదిలి పెట్టుదువు. ఎవడైతే సౌఖ్యము కొరకే కాని,
'ఘనత కొరకే కాని, మరియొక ఏ లౌకికమునకే కాని, పరిశుద్ధ మా-
'ర్గమందు ప్రవర్తించిన మీదట, తాను కోరినది దొరకక పోతే,
'వాడు పూర్వపు యూదుల వలెనే నిరాశ చేసుకొని, —'దేవుని
'సేవించుట నాశనకరమై యున్నది, ఆయన ఆజ్ఞల చొప్పున నడుచు-
'కొని, సైన్యముల ప్రభువు యెదుట వినయముగా ప్రవర్తించినందు-
'వల్ల, లాభము ఏమి!' (మలాకీ. 3: 14.) అని చెప్పును. అయితే
'దేవునియెడలను ఆయన కుమారునియెడలను ప్రేమ ఉంచి, పరి-
'శుద్ధముగా ప్రవర్తించేవారికి, ఇహ సంబంధమైన యెటువంటి ఆటం-
'కము సంభవించినప్పటికిని, వారు వెనుకకు జారరు. ఎందుకంటే,
'వారికి ఈ లోకములో ప్రత్యక్ష లాభము దొరకకపోయినప్పటికిని,
'పరలోకములో అతిశయమైన నిక్షేపమును నిశ్చయముగా పొందు
'దురని అనుకొనుచున్నాను" అంటిని. కరుణ ఏడుచుచు,—"హా!

'అమ్మా! అది సత్యమే. దేవుడు నా పాపములను క్షమించి, చివరకు 'నన్ను పరలోకమునకు తీసుకొని పోతే, ఈ లోకములో నాకు 'దుఃఖము సంభవించడము ఒక లెక్కలోనిది కాదు. నేను చాలా 'తప్పితములను చేసియున్నాను. అయినప్పటికిని, ఇప్పుడు నా హృద-'యములో ఒక విధమైన ఆశ పుట్టుచున్నది. ఏమంటే, దేవుడు నా 'యెడల కనికరముగా నుండును అనేదే. ఈ దినము మొదలుకొని 'నేను రాత్రింబగళ్లును ఆయనను ప్రార్థించుదును. ఓ అమ్మా! నేను 'యెటువంటి చెడ్డ పాపాత్మురాలనై యున్నానో, ఆ సంగతిని నాకు 'మీరు బోధించినందుకు దేవుడు మిమ్ములను దీవించుగాక" అని చెప్పెను.

అంతట నేను—"రా కరుణా! మనము ఇక్కడ మోకాళ్లు ఊని, 'ప్రభువు నీ ప్రయత్నములను దయగా అంగీకరించి, నీ పెనిమిటి-'యొక్కయు నీ కుమారునియొక్కయు హృదయములను తిప్పేటట్టు 'ప్రార్థించుదము" అంటిని. అందుకు కరుణ—"అవును అమ్మా! అలా-'గున చేయుడి. ఎందుకంటే, నాయంతట నేను ఏ మేలునైన చేయ-'లేను" అనెను. అంతట అది మోకాళ్లు ఊనెను. అప్పుడు నేను కరుణయొక్క ఆత్మీయమైన అక్కరలను ఒకటివెనుక ఒకటి దేవునికి తెలియచేసితిని. అంతట ప్రార్థన ముగించిన మీదట, కరుణ ఏడుపు-చేత మాటలాడలేక పోయెను.

అంతట సాయంకాలము కావచ్చెను గనుక, కరుణతో—వెళ్లుదు-నని చెప్పి, ఇంటికి వెళ్లినాను. నేను దానిని చూచి మాటలాడి-నందుకు, నా హృదయము సంతోషించెను. ఎందుకంటే, దానికి కలిగిన గొప్ప ఉపద్రవములవల్ల దేవుడు దాని హృదయమును తన వైపునకు లాగుకొనుటయు, దానితో ఆదరణగా పలుకుటకే దానిని అరణ్యములోనికి కొంచపోవుటయు ఆయన సంకల్పమై యున్నట్టు,

నాకు తోఁచినది. ఇందుకు ఈ దేశపు కవీశ్వరుడు ఒకడు చెప్పిన-దానికి భాషాంతరము ఏమంటే:

### గీతపద్యము.

రాత్రిపైఁబగలేప్రకారముననగునొ,
యట్లభక్తులదుఃఖంబులడఁగి,పిదప ।
ప్రియమునవర్థిల్లునగ్నిపరీక్షగలుగు
దనుక,లోహంబులేర్పాటుగనగరాదు ॥

## ౬. అధ్యాయము.

కరుణ ఈ యుపదేశమంతయు గైకొనిన తరువాత, ఏలాగున నడుచుకొనెనో అని చూచుటకు, ఆసక్తి కలిగి, రెండు దినములు గడిచిన తరువాత, నేను తిరిగి దాని ఇంటికి వెళ్లితిని. దాని ఇంటికిని ఫుల్మనీ ఇంటికిని ఇంక చాలా భేదముగానే ఉండెను. అయినప్పటికిని, కరుణ తన ఇంటి సామగ్రిని మునుపటికంటె క్రమముగా ఏర్పరచి యుంచినట్టు చూచితిని. దొడ్డి ఊడిచి యుండెను గాని, చెత్త అంతయు ఫుల్మనీ వలెనే కరుణ బయట పారవేయక, దొడ్డిలోనే ఒక మూలను కుప్ప వేసి యుండినది. కరుణ ఇల్లు ఊడిచి క్రొత్తగానైతే, అలికినది గాని, ఫుల్మనీ నిరంతరమును చేసినట్టు, ఆ అలికేటందుకు తెచ్చిన కుండలను ఇంటి వెనుకనుంచక, ఎదుటనే పెట్టి యుండినది.

కరుణ నన్ను చూడగానే, తనకు ఫుల్మనీ ఇచ్చిన శుభ్రముగా నుండే ముతక చీరెను కట్టుకొని, నవ్వు ముఖముతో తలవాకిటికి వచ్చెను. దాని వెంట్రుకలు కూడ చక్కగా దువ్వి కట్టి యుండెను. నేను ఇంటిలోనికి వెళ్లగానే, అది ఒక పాతగుడ్డను రవికగా చేసుకొను-

చుండెను అని చూచితిని. అయితే అది చక్కగా కత్తిరించబడలేదు. కుట్టును ముదుగుగానే ఉండెను. అయినప్పటికిని, నేను చూచి, చాలా సంతోషించి,—"కరుణా! నీవు గట్టి దర్జీవి అగుదువు" అని నవ్వుచు చెప్పితిని. అది కూడ నవ్వుచు,—"అమ్మా! నాకు చేతనైనది చేయుచున్నాను. నేను వచ్చే ఆదివారము దేవాలయమునకు వెళ్లబోవుచున్నాను. గనుక, అక్కడికి వెళ్లుటకు ఒక రవిక కుట్టి, తొడుగుకొని వెళ్లితే, బాగుగా నుండునని అనుకొనుచున్నాను" అనెను. అందుకు నేను—"నీవు బాగుగా యోజించినావు. మరియు నీవు కొంచెము పని కొరకు వెదకితే, ఒక సన్నపు కోకను కూడ కొనుకొనుటకు సామర్థ్యము చిక్కును. ఇంగ్లండు దేశములో మేము ఒక సామెతను వాడుకొనుచున్నాము." ఏమంటే:

### కందపద్యము.

"నీవేదైననుజేయం
గావలెననియున్ననుండ గాసిద్ధంబై।
త్రోవేర్పడిలేకున్నను
నావలగావించికొందు నదినీవైనన్ ॥ అనునదే" అంటిని.

అంతట కరుణ—"అవును అమ్మా! మీరు వాస్తవముగానే పలుకుచున్నారు. నెలకు ఒక రూపాయి చొప్పున సంపాదించుకొని, దేవాలయమునకు వెళ్లుటకు, ఒక చీరెను కొనుకొనే మార్గము పుల్లనీ నాకు చూపి యున్నది" అనెను. ఇది విని, నేను మిక్కిలి సంతోషించి, ఆ మార్గము ఎట్టిదో నాకు చెప్పుమని అడిగినాను. అందుకు అది—"మా గ్రామములో కొందరు ధనము గల స్త్రీలు కలరు. వారు వారమునకు నాలుగు డబ్బులు ఇచ్చి, తమ ఇండ్లను ఇతరుల చేతను అలికింపింతురు. నీ యిబ్బందిని గురించి మహేంద్రబాబు భార్యతోను ఇంక ఇద్దరు ముగ్గురితోను తెలియ చేతుననియు, వారు ఈ పని చేయుటకు ప్రతివారము నిశ్చయముగా నిన్ను

'పిలిపింతురనియు, ఫుల్మనీ నాతో చెప్పియున్నది. అలాగున నైతే, ఇక
'నాకు చింతలేదు. ఒక వారము కాగానే నాకు నాలుగు అణాలు
'దొరికితే, నాకై నేనే కష్టపడి, నెలకు ఒక రూపాయి సంపాదిం-
'చుకొందును" అని పలికెను. కరుణ ఇంక అడిగినది ఏమంటే:—
"అమ్మా! మహేంద్రబాబు భార్యకు స్వస్థమైనదనియు, ఆమె అందరి
'యెదుట నా చిన్ననాడు తన్ను కొట్టలేదనియు, నా చిన్నవానిని
'తీసుకొని వెళ్లినవాడే కత్తితో తన్ను పొడిచెననియు చెప్పిన సంగతి
'మీరు వింటిరా!" అని అడిగెను. అందుకు నేను—"అవును కరుణా!
'నిన్నటి దినము ఈ సంగతి నేను విని, చాలా సంతోషించితిని. నాకు
'ఆ స్త్రీ పరిచయము లేకపోయినప్పటికిని, ఆ సంగతులు ప్రతివారి
'నోటను వినబడుచున్నవి."

అందుకు కరుణ—"అవును అమ్మా! నేను కూడ ఆమెను మెచ్చు-
'కొనవలెను. ఎందుకంటే, ఆమె బీదలయెడల మిక్కిలి దయ కలది"
అనెను. అంతట నేను నవ్వుచు,—"కరుణా! నీవు నెలకు రూపాయి
'చొప్పున సంపాదించుకొన కలిగితే, ఇక బీదరాలనని నీవు చెప్పు-
'కొన జాలవు. నీవు క్రమముగా మహా భాగ్యవంతురాలవు అగు-
'దువు" అనిన,—"హా! అమ్మా! ఈ పని ఆకలి తీరగలందులకే చేసే
'పని. ఇల్లలకడము మిక్కిలి కఠినమైనది. ఇది నాకయి నేను చేసు-
'కొనలేక, నా ఇల్లు అలకక వదిలి పెట్టితిని. ఇప్పుడు, అయ్యో! ఇత-
'రుల ఇండ్లు అలకవలసి వచ్చెను. నేను ఆ పని చేయగలనో లేనో
'మొదట కనుగొనవలెను"అనెను. అందుకు నేను అన్నమాట;—"కరుణా!
'నీవు ఆ పని ఎందుకు చేయలేవు? నీవు చేయ గలవు. నీవు ఇల్లు అలి-
'కేటప్పుడు, నేను చేయవలసిన పని చేయుచున్నానని జ్ఞాపకముందు
'ఉంచుకొంటే, అప్పుడు నీ కష్టము చులకనగా నుండును. మరియు
'ఈ పని చేయడమువల్ల ఇకను ఒక ప్రయోజనము కలదు. అది నీ
'దుఃఖములను నీవు మరిచేలాగున చేయును" అని చెప్పి, అటులేరు-

వాత నేను — "కరుణా! నీ పెనిమిటి నిన్నటి ఉదయమందు లేచి-
'నప్పుడు, జరిగినది వినుటకే ముఖ్యముగా వచ్చి యున్నాను" అంటిని.
అప్పుడు కరుణ—"ఓ అమ్మగారూ! అది పెద్ద కథ అయి యున్నది.
'ఆయన సాయంకాలమందు తాగినప్పుడు, ఆ మరుదినము ఆయనకు
'తప్పక తలనొప్పి కలిగి యుండును. మరియు దినమంతయు కును-
'కుచు, నిద్ర మబ్బుగా కూర్చుండి యుండును. ఆ ప్రకారముగానే
'నిన్నటి దినము నిద్ర లేచి, ఎవరితోను మాటలాడక, ముంగిటిలో
'కూర్చుండి, బద్ధకముగా పొగ తాగుచుండెను. అంతట నేను ఒక
'బట్టను కొంత చమురును తెచ్చి, ఆయనకు ఇచ్చి, 'నా ప్రియుడా!
'నీకు తలనొప్పిగా నుంటే, వెళ్లి గుంటలో స్నానము చేసిన పక్ష-
'మందు, కొంచెము నిమ్మళముగా నుండునని నాకు తోచుచున్నది.
'నీవు రాక పూర్వమే, నీ కొరకు కొంత అన్నము వండి సిద్ధముగా
'నుంచుదున'ని చెప్పితిని. అందుకు నవీనుని తండ్రి 'కరుణా! ఇదం-
'తయు ఏమిటి? నీకు ఏమి పట్టి యున్నది? నా సంతోషాభివృద్ధి-
'కొరకు నీవు ఎందుకు ఇంత ఆసక్తిగా నున్నావు? నావద్ద డబ్బులు
'లాగడమునకు నీవు ఈ గొత్తు అంతయు చేయుచున్నావని నేను
'అనుకొనుచున్నాను. అయితే అలాగున కానేరదని ఇప్పుడే చెప్పు-
'చున్నాను. మంచిది కానిమ్ము. నీవు చెప్పినట్టు విని, నేను వెళ్లి
'స్నానము చేసి, తిరిగి వచ్చి అన్నము తిందును' అని పలికెను.
'అమ్మగారూ! నేను ప్రాతఃకాలమందే లేచి, ఇల్లు ఊడిచి, అంతయు
'సిద్ధముగాను శుభ్రముగాను చేసితిని. ఎందుకంటే, నవీనుని తండ్రి
'ఇదంతయు చూచి సంతోషించునని అనుకొంటిని. అయితే ఆయన
'ఆడిన పరుషపు మాటలు నేను విని, కొంత కోపము తెచ్చుకొని,
'ఆయనను నిందించబోవువరకు, మీ బోధలు నాకు జ్ఞాపకమునకు
'వచ్చెను. అప్పుడు నేను ఒక మాట ఆయన పలుకలేదు. ఆయన
'స్నానము చేసి రాగానే, ముంగిటిలో ఒక చాప పరచి, ఆయన

‘యెదుట చింతపండు వేసి, వండిన ఒక కూరను అన్నమును తీసుకొని
‘వచ్చి పెట్టితిని. ఆయన ఇది చూచి మిక్కిలి ఆశ్చర్యపడి, ‘కరుణా!
‘నేడు జరుగుచున్నదంతయు నాకు బోధలోనికి రాలేదు. ఇటు-
‘వంటి కూరయు అన్నమును తిని మూడు మాసములు అయినది.
‘ఇదంతయు ఎందుకు సిద్ధము చేసినావు? వీటిని ఎక్కడ సంపాదిం-
‘చితివి?’ అని అడిగెను. అప్పుడు నేను ‘నిన్ను సంతోషపెట్టుటకే
‘ఇదంతయు సిద్ధము చేసితిని’ అంటిని. అంతట ఆయన నా ముఖ-
‘ము తేరి చూచి, ఆశ్చర్యపడి, ‘నీవు ఉండియుండి ఒకమాటుగానే
‘క్రొత్త స్త్రీవి అయితివి. ఈ రీతిని నీవు ఎల్లకాలమును నడుచుకొంటే,
‘నేను మిక్కిలి అదృష్టవంతుడను అగుదును’ అనెను. అప్పుడు తన
‘మొలలోనుంచి సంచి తీసి, నా వైపునకు పారవేసి, ‘మంచిది కరుణా!
‘నేడు నా వద్దనుంచి కొన్ని డబ్బులు తీసుకొనగలిగితివి గనుక,
‘నా సంచిలో ఉన్నవన్నియు తీసుకొనుమ’ని నవ్వుచు చెప్పెను. ఆ
‘సంచిలో నాలుగు డబ్బులు మాత్రము ఉండెను. అయినప్పటికిని,
‘నేను వాటిని తీసుకొని, ‘ఈ నాలుగు డబ్బులు నీవల్ల దొరకడ-
‘మనేది నాకు బహు గొప్ప ఉపకారమై యున్నది’ అంటిని. అప్పుడు
‘ఆయన ‘నా తల మిక్కిలి నొచ్చుచున్నది గనుక, ఇప్పుడు పెట్టి-
‘నట్టు సాయంకాలమందును అన్నము పెట్టగలిగిన పక్షమందు, నేడు
‘నా పనికి వెళ్లక ఇంటివద్దనే ఉందును’ అనెను. అమ్మగారూ! మీరు
‘నాకు ఇచ్చిన రెండు రూపాయిలను గురించి నేను ఆయనతో చెప్పితే,
‘ఆ సొమ్ము ఉన్నంతసేపు ఆయన తన పనికి వెళ్లకుండునేమో అని
‘తలంచి, ఆయనతో చెప్ప వెరిచితిని గనుక, నేను ఆయనతో ‘మం-
‘చిది నేడు ఇంటివద్దనే ఉండు. ఇంటిలో ఇంక కొంచెము చేప
‘యున్నది, దానిని నేడు వండి నీకు సాయంకాలమందు పెట్టుదును’
‘అని చెప్పితిని.”

అప్పుడు నేను—“కరుణా! నీవు బుద్ధిమంతురాలివలెనే నడుచు-
‘కొంటివి. నీ పెనిమిటి ఇది విని, దినమంతయు ఇంటివద్దనే ఉం-

'డెనా!" అని అడిగితిని. అందుకు కరుణ—"అవును అమ్మా! ఇంతే కాక 'ఆయనకు బుద్ధిపుట్టి, కొన్ని వెదురు బొంగులు తెచ్చి, ఇంటి ఆవరణ- 'ములో పోయి యున్న చోట బాగు చేసెను గనుక, అది నేడు బహు 'సుందరముగా కనుపడుచున్నది. ఈ బుద్ధి ఆయనకు ఎందుకు కలి- 'గెనో తోచదు" అని ఉత్తరము పలికెను. అందుకు నేను—"కరు- 'ణా! నీవు మిక్కిలి అదృష్టవంతురాలవు. నీ పెనిమిటి నీ బాగునకు 'అడ్డము చెప్పక, నీకు సహాయము చేయుచున్నాడు" అంటిని. అం- 'దుకు కరుణ అనిన మాట;—"అమ్మా! అలాగున నేను ఇంక చెప్పలేను. 'అయితే కథయొక్క శేషముకూడ వినుడి. నిన్నటి సాయంకాల- 'మందు ఆయన దుర్మార్గపు స్నేహితులు ఇద్దరు ముగ్గురు వచ్చి, ఆయ- 'నను రమ్మని బతిమాలినారు. మొదట ఆయన వెళ్లుటకు ఇచ్ఛయించ- 'లేదు. అయితే కొంత సేపుటికి వారు మిక్కిలి బతిమాలగా, ఆయన 'వారితో కూడ వెళ్లినాడు. కాని విస్తారము తాగక, కొంచెముగానే 'తాగి, మునుపటికంటె త్వరగానే ఇంటికి వచ్చినాడు" అని చెప్పెను.

అంతట నేను—"అతడు నేడు ఎక్కడ నున్నాడు?" అని అడిగిన,— "అమ్మా! చద్ది తిని ఉదయమున పనికి వెళ్లుచున్నానని చెప్పి వెళ్లెను. 'అయితే ఇప్పుడు ఆయన ఎక్కడ ఏమి చేయుచున్నాడో, ఆ సంగ- 'తిని నేను కనుగొనవలెను" అని కరుణ చెప్పెను.

అంతట నేను—"మొన్నటినుంచి అతడు నీతో పెళుసు మాటలు 'బొత్తుగా మాటలాడకున్నాడుగదా" అని అడిగిన, కరుణ తలవంచు- కొని,—"లేదు అమ్మా! నా పెనిమిటియొక్క శాంతము చూస్తే, ఆయన 'యెడల నేను మొదటినుంచి మర్యాదగా ప్రవర్తించి యుండిన, ఆయన 'ఇంత దుఃఖములో బొత్తుగా నుండక పోవునని నాకు రూఢి అయి- 'నది" అనెను. కరుణ ఈ సంగతి కొంచెము సిగ్గుతో ఒప్పుకొనెను. అప్పుడు నేను—"ఫుల్లనీ! ఈ రెండు దినములలోగా నిన్ను చూడ వచ్చె- 'నా!" అని అడిగిన, అది—"ఆమె నేటి ఉదయమందే వచ్చి, దాదాపు

'రెండు గంటల కాలము ఇక్కడ ఉండి వెళ్లి పోయినది. నా శుభ్ర-
'మైన బట్టలను నా ఇంటియొక్క శుభ్రతను చూచి, ఆమె ఆశ్చ-
'ర్యపడి, నాతో—'కరుణా! ఇంత కాలము గడిచిన తరువాత నేటికి
'నీవు శ్రద్ధగల ఇల్లాలవైతివా?' అని చెప్పెను. నేను మొన్నటి దినము
'మీతో చేసిన సంభాషణ అంతయు ఆమెకు తెలియచేసి, 'ఫుల్లనీ!
'ఇప్పటినుంచి నిన్ను ఒక దృష్టాంతముగా పెట్టుకొని, దేవుని ఆజ్ఞల
'ప్రకారము నడుచుకొనుటకు ప్రయత్నము చేతును' అని చెప్పితిని.
'ఫుల్లనీ ఇది విని సంతోషించి, 'ఓ కరుణా! నీవు నా హృదయమునకు
'ఎంతో సంతోషము కలుగ చేయుచున్నావు. నేను ప్రియనాథు-
'నిని సాధువుయొక్క తండ్రివద్ద ఉంచి వచ్చినాను గనుక, నేను
'కొంతకాలము ఉండి నీతో సంభాషించ గలను' అనెను. అప్పుడు
'ఆమె బైబిలులోని కొన్ని వచనములు చెప్పి వినిపించి, ఈ దిగువున
'వచ్చే వచనమును కూడ నేర్పినది. 'సమస్తమైన చేదుతనమును కోప-
'మును ఉగ్రతయును అరుపును దూషణయు సకల దుష్టత్వముతో-
'కూడ నీయొద్దనుంచి తీసివేసి, ఒకరికి ఒకరు ఉపకారులై, కరుణా
'హృదయులై, దేవుడు క్రీస్తు నిమిత్తము మిమ్ము క్షమించినప్రకారము,
'ఒకరిని ఒకరు క్షమించుకొనుడి."

'అంతట ఫుల్లనీ చాలా సేపటిదాక కూర్చుండి, రక్షకునియొక్క
'ప్రేమను గురించి మాటలాడెను. మరియు ఆమె వినిపించిన మధు-
'రమైన మాటల నన్నిటిని మునుపటికంటె నేను ఎక్కువగా గ్రహించి,
'యేసు నన్ను క్షమించి పరలోకమునకు కొంచుపోవచ్చును అను-
'కొంటిని. అయితే ఫుల్లనీ వెళ్లిపోయిన తరువాతను, మరియొక స్త్రీ
'వచ్చి, ఓ వంశి తల్లీ! అని నాకు పేరు పెట్టి, నన్ను పిలిచెను. ఎందు-
'కంటే, నన్ను ఆ పేరుచేతనే ఎప్పుడును పిలుతురు. అయితే నేను
'ఆ క్షణమందు రక్షణను గురించి ఆలోచించుకొనుచుంటిని గనుక,
'ఆ పిలుపు నాకు చాలా భయము పుట్టించెను. అప్పుడు నేను ఏడ్చి,

'అయ్యో! నేను వాస్తవముగా వంశి తల్లినే. అయితే నా పిల్లను నేను
'చెరిపివేసితిని గనుక, మోక్షము సంపాదించుకొందునని ఇప్పుడు పుట్టి
'యున్న ఆశ కేవలము మాయగ్రై యున్నది అంటిని" అని చెప్పెను.

అప్పుడు నేను అనిన మాట;—"లేదు, కరుణా! ఎందుకు మాయగ్రై
'యున్నది! నీ పాపమనేది గొప్పదిగా నున్నది. వాస్తవమే. ఆ పా-
'పమును గురించి నీవు చులకనగా ఎంచుకొని యుండవలెనని కోరను.
'అయినప్పటికీ, నీకు ఆదరణ కలిగేటట్టు, నేను ఒక మాట చెప్ప-
'వలెను. నీవు నీ పిల్ల యొక్క రక్షణ విషయమై అశ్రద్ధగా నుండి-
'నప్పుడు, నీవు మతమును గురించి కొంతమట్టుకు తెలుసుకొనకుంటివి.
'అయితే ప్రభువుయొక్క కృపను అనుభవించి, తమ పిల్లలకు చక్క-
'గా ఉపదేశించి, వారిని దేవుని శిక్షలో ఉంచనటుకంటె క్రైస్తవుల
'అపరాధము నీ అపరాధముకంటె వాస్తవముగా ఎన్నో అంతలు
'గొప్పదై యున్నది. అయ్యో! దేవుని న్యాయాసనము నెదుట ఇటు-
'వంటివారు ఒప్పగించవలసిన లెక్క ఎంత భయంకరమై యున్నది!
'అయితే కరుణా! నీ మట్టుకు నీవు భయపడవద్దు. నీవు ఇదిమాత్ర-
'ము చేయుము. పశ్చాత్తాపము పొంది, ప్రభువైన యేసునందు
'విశ్వాసముంచి, ఇక మీదట పాపమును వదలిపెట్టి, మేలు చేయుము.
'నీకు ఇంక ఒక కుమారుడు కలడు. అతనిని నీతి మార్గమున కొంచు-
'బొమ్ము. నీవు ఇది అంతయు చేసితే, నీవు ఇదివరలో చేసియున్న
'పాపమును దేవుడు నిశ్చయముగా రద్దు చేసి, క్రీస్తు నిమిత్తము నిన్ను
'అంగీకరించును" అంటిని.

కరుణ ఇది విని, తన కంటినీరును తుడుచుకొని,—"ఓ అమ్మగా-
'రూ! నేను నా పిల్లలకు బోధించకపోవడమువల్ల చాలా అపరాధిని
'అయితినని నవీనునితో చెప్పి, నా చేతనైనంత మట్టుకు యేసు
'క్రీస్తు ఎవరైనదియు, ఆయన ఏమి చేసినదియు, నవీనునకు తెలియ-
'చేసి, ఆయనయందు నమ్మికనుంచుమని అతనిని బతిమాలితిని" అని
'చెప్పెను. అందుకు నేను 'కరుణా! నీవు సరిగా చేసితివి. ఇటు-
'వంటి క్రియలవల్ల నీవు మోక్షము సంపాదించుకొన గలవని కాదు,

‘అయినప్పటికి, కొర్నేలి ప్రార్థనలును భిక్షములును సాక్షి పూర్వ-
‘కముగా దేవుని సమ్ముఖములోనికి ఎక్కినట్లు, ఈ నీ ప్రయత్న-
‘ములు ప్రభువైన యేసు క్రీస్తును సేవించుటను గూర్చిన నీ కోరికకు
‘సాక్ష్యమై యున్నవి’ అని చెప్పి,—“నీతో ఫుల్మనీ ఇంక ఏమియు
‘చెప్పలేదా!” అని అడిగితిని. అందుకు కరుణ — “అవును అమ్మా!
‘ఆమె నాకు అనేకములైన మంచి బుద్ధి మాటలు చెప్పి, చివరకు నేను
‘యుక్తమైనవాటిని చేసేకొరకు దేవుడు నాకు బలము దయచేయు-
‘నట్లును, నేను ఆయనను మునుపటికంటె ఎక్కువగా సేవించు-
‘నట్లును, నాతో కూడ ప్రార్థించెను. అటుతరువాత ఆమె వెళ్లి
‘పోయేటప్పుడు, నన్ను చూచి కరుణా! నీవు సాధారణముగా ప్రతి
‘దినమును నడిచే నడత దేవుని చిత్తప్రకారముగా నుండేటట్లు, నీ
‘కొరకు కొన్ని వేదవాక్యపు విధులను వ్రాయులాగున, నేను సాధు-
‘వుయొక్క తండ్రిని అడుగుదును” అని చెప్పెను. ఇదిగో, అమ్మా!
‘ఈమె ఈ మాటలు పలికిన రెండు గంటలకు, సాధువు ఈ పలక నాకు
‘తెచ్చి యిచ్చెను” అనెను.

నేను ఆ పలకను దాని చేతిలోనుంచి తీసుకొని చూడగా, ప్రేమ-చందు ఒక తెల్లని కాగిదము దానికి అంటించి, లావు అక్షరములతో మిక్కిలి స్పష్టముగా బైబిలులోనుంచి, పదమూడు వచనములు ఎత్తి వ్రాసినట్టు కనుగొంటిని. ఈ వచనములు బంగాళాలో నున్న క్రీస్తు మత స్త్రీలకందరికిని మిక్కిలి ఉపయోగమై యున్నట్లు నాకు తోచెను గనుక, బైబిలులో నుండే ఆ వచనములయొక్క సూచికలను అప్పుడు వ్రాసుకొని, వాటిని ఇప్పుడు ఈ గ్రంథము చదివేవారు చూచు-కొనుటకు సవిస్తారముగా వ్రాయుచున్నాను. అవి శ్రేష్ఠములైనవని గ్రహించవలసినది.

———»»«« ———

# క్రీస్తు మతపు స్త్రీల నడత నిమిత్తమైన ఏర్పాటులు.

## (1) దేవుని యెడల చేయవలసిన కర్తవ్యము.

1. నీవు ప్రభువును నిరంతరమును నీ యెదుట ఉంచుకొనుము. కీర్తన. 16: 8.

2. ఎల్లప్పుడును ప్రార్థన చేయుము. థెస్సలోని. 5: 17.

3. నీవు నీ స్వబుద్ధి మీద ఆనుకొనక, ప్రభువునే నీ నిండు హృదయముతో నమ్ముము. నీ సకల మార్గములయందును ఆయననే గ్రహించుము, అప్పుడు ఆయన నీ మార్గములను తిన్నగ చేయును. సామితెలు 3: 5, 6.

4. మీరు క్రీస్తు సంబంధులని జ్ఞాపకము తెచ్చుకొనుడి. 1 కొరిం-థి. 3: 23.

5. మీరు పానమే కాని, భోజనమే కాని, ఏమి చేసినను, దేవుని మహిమకని సమస్తమును జరిగించుడి. 1 కొరింథి. 10: 31.

## (2) నీ కుటుంబము నెడల జరిగించవలసిన కర్తవ్యము.

6. నీవు బద్ధకముయొక్క రొట్టెను భుజించక, నీ ఇంటి కార్య-ములను గురించి చాలా చూచుకొనుము. సామితె. 31: 27.

7. పనిలో మందులు కాక, ఆత్మయందు చురుకు కలిగి, ప్రభు-వును సేవించుడి. రోమా. 12: 11.

8. భార్యలారా! ప్రభువునకువలె మీ స్వపురుషులకు లోబడి యుండుడి. యెఫెసు. 5: 22.

9. మీ పిల్లలను ప్రభువుయొక్క శిక్షలోను బోధలోను వృద్ధి పొందించుడి. యెఫెసు. 6: 4.

## (3) ఇరుగు పొరుగువారియెడల జరిగించవలసిన కర్తవ్యము.

10. నీ నోరును జ్ఞానముతో తెరవుము. దయ గల బోధ నీ నాలుక మీద నుండునుగాక. సామెతలు. 31: 26.

11. పాత మనుష్యుని వాని క్రియలతో కూడ విడిచి, వానిని సృజించిన ఆయన పోలిక చొప్పున జ్ఞానము కొరకు నూతనపరచబడుచు, క్రొత్త మనుష్యుని ధరించుకొంటిరి గనుక, ఒకనితో ఒకడు అబద్ధమాడకుడి. కొలస్సై. 3: 9, 10.

12. ఒకనియందు ఒకడు ప్రేమనుంచుట గాక, మరి ఏమియు ఎవనికిని అచ్చి యుండవద్దు. ఒక్కొక్కడు తన స్వకీయమైన సంగతులనే కాక, ప్రతివాడును ఇతరులవాటిని కూడ చూచుకొనుగాక. రోమా. 13: 8. ఫిలిప్పి. 2: 4.

13. నీకు సమయము కలిగినప్పుడు, అందరియెడలను, విశేషముగా విశ్వాసపుటింటివారి యెడలను మేలు చేయుము. గలతి. 6: 10.

ఈ వాక్యములను చదివి, నేను కరుణను చూచి,—"నీవు ఈ సూత్రము చొప్పున నడిచితే, నీవు వాస్తవముగా భాగ్యవతివై యుందువు. మరియు నీకు పుల్లనీ స్నేహవతియై యున్నందుకు, మిక్కిలి కృతజ్ఞత వహించి యుండవలెను. అయితే నీవు ఆమె ఆలోచనము చొప్పున నడుచుకొనక, ఆమె మంచి నడత చూచి, నీ నడతను దిద్దుకొనకపోయిన, దేవుడు నిన్ను భయంకరముగా విమర్శించునని జ్ఞాపకము ఉంచుకొనుము" అని చెప్పితిని. కరుణ తలపోయుచు మౌనముగానుండెను. అప్పుడు నేను దాని చూచి,—"నీవు ఈ దివ్యమైన వచనముల నన్నిటిని గ్రహించినావా!" అని అడిగితిని. అందుకు కరుణ—"అమ్మా! సాధువు ఈ పలకను నాకు తెచ్చి ఇచ్చినది మొదలుకొని, ఈ మాటలను శ్రద్ధగా విచారించుకొనుచుంటిని. అయితే

వీటిలో రెండు వచనములు నాకు కొంచెము కఠినముగా కనిపించు-
'చున్నవి" అని పలికెను. అప్పుడు నేను—"ఆ వచనములు ఏవి? నేను
'వాటికి సంతోషముగా అర్థము చెప్పి, తన వాక్యముయొక్క మర్మ-
'ములను గ్రహించుటకు దేవుడు నీకు శక్తిని ఇచ్చేలాగున ఆయనను
'ప్రార్థింతును" అని సెలవిస్తిని.

అందుకు కరుణ—"అమ్మా! నాలుగవ కర్తవ్య మేమంటే, 'మీరు
'క్రీస్తు సంబంధులని జ్ఞాపకము ఉంచుకొనుడి' అనునదే. అయితే దీనిని
'మనము ఎందుకు నిరంతరమును జ్ఞాపకము ఉంచుకొనవలసినదో, అది
'నాకు బాగుగా బోధ కాలేదు" అనిన,—"కరుణా! ఆలకించుము.
'దీనిని ఒక ఉపమానముచేత తెలియచేయుదును. ఒక అన్యదేశపు
'రాజు నిన్ను పట్టుకొని, చెరలో ఉంచి, నీవు పదివేల రూపాయీలు
'తెచ్చి తనకు ఇచ్చినం గాని, నిన్ను చంపుదును సుమీ అని, నీతో
'చెప్పితే, నీవు ఏమి చేతువు? నీకు సొమ్ములేదు. నీ బీద స్నేహితు-
'లును బంధువులును పదివేల రూపాయీలు ఇయ్య గలుగుదురనేది
'కేవలము వల్లకానిది. వారు నిన్ను విడిపించ కోరినను, వారం-
'దరును కూడియైన వంద రూపాయీలను పోగు చెయ్య చాలరే-
'మో. అది గనుక నీకు వేరే గతిలేక, చచ్చిపోవలసి యుండును.
'నరికేవాడు కత్తి చేత తీసుకొని, నిన్ను పట్టుకొనే సమయములోనే,
'ఒకానొక ధనికుడు వచ్చి, మితిలేని కనికరము చూపి, ప్రేమ
'కలిగిన మృదువైన స్వరముతో, 'ఓ దౌర్భాగ్యపు స్త్రీ! నీవు బ్రతుక
'కోరితే, నా మాటలను ఆలకించుము. నేను నీ శత్రువునకు పదివేల
'రూపాయీలు ఇచ్చి, నిన్ను విడిపింతును, గాని నీవు ఎల్లప్పుడును
'నా సేవకురాలవై యుండవలెను. నేను నిన్ను కొనుకొంటిని గనుక,
'నీవు మరి యొక యజమానుని సేవించలేవు. నీవు ఈ పద్ధతులకు
'ఒప్పుకొంటే, నేను నిన్ను తప్పింతును. అయితే నీవు నా యాజ్ఞలు
'భారములని యెంచవద్దు. ఎందుకంటే, నీ ప్రయోజనార్థమైన ఆజ్ఞలనే

'నీకు నేను ఇత్తును' అని చెప్పినయెడల, కరుణా! ఇటువంటి దయ-
'గల మనుష్యునకు ఎటువంటి ఉత్తరము ఇత్తువు అని ఇప్పుడు నిన్ను
'అడుగుచున్నాను" అనిన,—"ఓ అమ్మగారూ! ఆయన ఆజ్ఞకు ఒప్పు-
'కొని, అది మొదలుకొని ఆయన సేవకురాలనై యుందును" అని
'కరుణ చెప్పెను. అందుకు నేను—"అవును కరుణా! ఈలాగున చే-
'యవము నీకు విధి అయ్యే ఉండును. అయితే కొంతకాలము
'గడిచిన తరువాత, నీవు ఆయన సేవను విసర్జించి, ఆయన శత్రువు-
'యొక్క సేవలో ప్రవేశించితే, నిన్ను గురించి ఏమని చెప్పకొం-
దురు!" అని నేను అడిగిన,—"అమ్మా! నేను ఈలాగున చేసితే, కృత-
'జ్ఞత లేని దుర్మార్గపు స్త్రీని అని అనిపించుకొన తగుదును" అని కరుణ
'ఉత్తరము పలికెను. అంతట నేను—"కరుణా! ఆలాగున కృతఘ్నత
'లేకుండా నీ మనస్సును నీవు ఏలాగున కాపాడుకొందువు! ఇది
'నాకు తెలియ చెప్పుము" అని నేను అడిగినందుకు, కరుణ—"అమ్మా!
'నేను మరణావస్థలో నుండినప్పుడు, నా యుపకారియైన యజమా-
'నుడు నన్ను తన సొమ్ముపెట్టి కొనుకొని, నాకు ప్రాణము ఇచ్చెనని-
'యు, అందువల్ల నేను ఆయనకు ఒక విధముగా అమ్ముడుబోయిన
'సేవకురాలనై యుందుననియు, ఇప్పుడు నేను ఆయనను వదిలిపెట్టి,
'ఆయన శత్రువును సేవించితే, మిక్కిలి చెడ్డ పనియై యుండునని-
'యు, తీయకుండా జ్ఞాపకమందు ఉంచుకొందును" అని పలికెను.
'అందుకు నేను—"కరుణా! నీవు తిన్నగానే పలికితివి. నా యుప-
'మానముయొక్క భావము నీకు సంపూర్ణముగా తెలిసెను. మీరు
'క్రీస్తు సంబంధులని మనస్సులో నుంచుకొనుడీ అనే వాక్యమును
'సాధువుయొక్క తండ్రి యేమి భావముచేత వ్రాసెనో అని ఇప్పు-
'డు నీవు గ్రహించ గలుగుదువని నేను అనుకొనుచున్నాను" అంటిని.

కరుణ ముఖోల్లాసములో ఇట్లనియె;—"అవును, అవును. నేను
'ఇప్పుడు దానిని బాగుగా గ్రహించుచున్నాను. పాపమనే రోగ-

'ముచేతను చావుకు సిద్ధమై నరకమునకు వెళ్లే మార్గమున నడిచి పోవు-
'చుండగా, క్రీస్తు నన్ను పదివేల రూపాయీలతో కాదు గాని, తన
'విలువ లేని రక్తముచేతనే విడిపించెను గనుక, ఇప్పుడు నేను ఆయన
'సొత్తును అయి యున్నాను. ఇది నేను మనస్సులో నిరంతరమును
'ఉంచుకొని, సైతానుకు ఏ విధమైన సేవయు చేయక, నా కరుణ గల
'రక్షకునియొక్క సేవలోనే నిలిచియుందును" అనెను.

కరుణ ఈ చొప్పున మాటలాడుట నేను విని సంతోషించితిని. ఎందుకంటే, అది పరిశుద్ధాత్మచేతను బోధింపబడకపోతే, ఈ చొ-ప్పున మాటలాడక పోవునని యోజించితిని. దేవుడు నా ప్రార్థన ఆలకించి, కరుణకు ఈ చొప్పున ఉపదేశించినందుకు నా హృ-దయములో ఆయనను స్తుతించితిని. అంతట నేను దాని చూచి,— "మంచిది కరుణా! నీకు బోధకాని వచనము మరి ఏది అయిన ఉన్న-
'దా?" అని యడిగిన, "అమ్మా! అయిదవ విధి ఏమంటే, మీరు భోజ-
'నము చేసిన, లేక పానము చేసిన, లేక మరియేమి చేసిన, సమస్త-
'మును దేవుని మహిమకని చేయుడి అనేదే. మనము అనుదినమును
'మన స్వకీయ భోగముకొరకు అనేకములైన చిన్నకార్యములను
'చేయవలసినదే గదా? ఇటువంటి కార్యములవల్ల దేవుని మహిమ
'బహిరంగమయ్యే విధము ఎట్టిది?" అని ప్రశ్నవ చేసిన, నేను ఇట్లం-
'టిని;—"కరుణా! అపోస్తలైన పౌలు ఇది వ్రాసినప్పుడు, ఏమి భావ-
'ముతో వ్రాసినాడంటే, మనము ఏమి చేసిన, అనగా తినడము తాగ-
'డము అనే స్వల్పాంశములయందు నహా, దేవుని మహిమార్థమై జరి-
'గించవలసినదని గట్టిగా తెలియచేయుచున్నట్టు స్పష్టమై యున్నది.
'మరియు దేవుడు అన్నపానాదులయందు మహిమపరచబడజాల-
'డని, మనము అనుకొన కూడదు. చాలామంది క్రీస్తు మతస్థులు
'ఈ యాజ్ఞను తెలుసుకొనక, తమ తృప్తికొరకు మాత్రమే తిని తా-
'గుదురు. అయితే ఇది యుక్తము కాదు. ఒక మనుష్యుడు తన

'యింద్రియములకు బద్ధుడై, తిండిపోతు అగుటవల్ల, అపరిమితముగా
'తిని తాగిన మీదట, తన శరీరము అంతకంతకు మాంద్యము పొంది,
'యేమియు చేయలేక, దేవుని సేవించుటకు అశక్తుడగును. అయితే
'నిజమైన క్రీస్తు మతస్థుడు మిత భోగి అయి, దేవుడు తనకు ఇచ్చిన
'అన్నపానాదులను అనుభవించుచు, తన శరీరమును పోషించి, బల-
'పరచే అన్నము దేవునివల్లనే కలుగుచున్నదని యెంచును గనుక, తన
'శరీరము దేవునిదే అనియు, దానిని దేవుని క్రియలలోనే వినియోగ-
'పరచవలెననియు అనుకొనును. ఈ చొప్పున తాగడము విషయమై
'కూడ చెప్పబడవచ్చును. దేవుడు మనుష్యులు తాగుటకు నీళ్లు
'పాలు మొదలైన మంచి వస్తువులను ఇచ్చియున్నాడు. మనుష్యులు
'వీటినిమాత్రమే తాగి తృప్తిపడితే, వారి మనస్సులు నిర్మలముగా నుండి,
'ఆ తెలివి తేటలవల్ల దేవుని మహిమపరచ గలరు. అయితే వారు
'మద్యమును తాగ నారంభించి, తాగుబోతులైతే, వారు సైతానుకు
'లోబడి, వానిని మహిమపరచుటకు తాగి, వారి శరీరాత్మలను పాడు
'చేసుకొందురు. మరియు కరుణా! దేవుని మహిమపరచ గలిగే
'ఇటువంటివి ఇంక అనేకములైన చిన్న సంగతులు కూడ నున్నవి.
'ఏమంటే, నేను నీ ఇంటికి వచ్చినప్పుడు, నీవు ఒక రవికను కుట్టు-
'కొనుచుంటివి. నేను దేవాలయమునకు వెళ్లవలెననియు, దేవాలయ-
'మునకు వెళ్లేవారందరును తగిన వస్త్రములను కట్టుకొని వెళ్లవలసిన-
'దనియు చెప్పితివి. ఎందుకంటె, ఏమి జరిగిన, శుభ్రముగాను క్రమ-
'ముగాను జరగనిమ్మని దేవుడు చెప్పియున్నాడు. ఈ యాజ్ఞా ప్రకా-
'రము నడుచుకొన వలెననే కోరికచేతను, నీవు రవికను కుట్టుకొను-
'చుంటివి గనుక, ఈ స్వల్పకార్యమువల్ల కూడ దేవుడు మహిమ
'పరచబడుచున్నాడని చెప్పవచ్చును. ఇటువంటి దృష్టాంతములను
'ఇంక అనేకముగా నీకు చెప్ప గలను. నీవు నీ పెనిమిటికి లోబడి
'యుండుము. ఎందుకంటే, దేవుడు అలాగున విధించి యున్నాడు.

‘నీ పిల్లలు దేవుని సేవించ గలిగేటట్లు, వారికి మంచి సంగతులను ‘ఉపదేశించుము. నీవు సంతోషించేకొరకు కాకుండాను, కీర్తికొరకు ‘కాకుండాను, దేవుని సంతోష పెట్టేకొరకే, బీదలయెడల దయగా ‘నుండుము. ముఖ్యముగా క్రైస్తవులయెడల ప్రేమగా నడుచు‘కొనుము. ఎందుకంటే, వారు ప్రభువుయొక్క ఇంటిల్లిపాది అయ్యు‘న్నారు. నీవు అందరియెడల గృహస్థ మార్గముగా నడిచేటప్పుడు, ‘మనుష్యుల భయముచేతను కాక, దేవుని ఆజ్ఞ చొప్పుననే నడుచు‘కొనుము. నీవు ఇటువంటి భావముతో ఈ పనులెల్ల చేసిన, దేవుడు ‘నిశ్చయముగా మహిమ పరచబడును. ఇప్పుడు కరుణా! ఈ అయి‘దవ విధి బోధ అయినదా, లేదా!” అనిన,—“అవును అమ్మా! నాకు ‘బోధ అయినది” అని కరుణ పలికెను. నేను దీనితో ఇంక సంభాషించవలెనని కోరితిని గాని, ఆ సమయములో నవీనుని తండ్రి మైదానము మీద పడి ఇంటికి రావడమును దూరమునుంచి చూచితిని. అంతట కరుణ శీఘ్రముగా లేచి తలుపు దగ్గరకు వెళ్లి, దాని పెనిమిటిని చూడడముతోనే, సంతోష ముఖముతో—“ఓ అమ్మా! ఆయన‘తో కూడ ఆయన దుర్మార్గపు స్నేహితులు ఎవరును లేరు. మరియు ‘తూలకుండ మంచి మనుష్యుని వలెనే నడిచి వచ్చుచున్నాడు. ఆయన ‘నేడు తాగి యుండ లేదు. హా! ఇప్పుడు ఆయన తాగడము వదిలి ‘పెట్టితే, నేను ఎంత హాయిగా నుందును. ఆయనతో సంతోషముగా ‘కాపురము చేయ గలుగుదును. నవీనుని తండ్రి తాగియుండక పోతే, ‘నన్ను ఎప్పటికిని కొట్టను కొట్టడు, తిట్టను తిట్టడు” అని చెప్పెను.

కరుణ తన పెనిమిటి మత్తుడు కాకుండా ఉండడము చూచి, ఈ ప్రేమ గల మాటలను పలుకగా నేను విని, ఆశ్చర్యపడలేదు గాని, సంతోషించితిని. ఏమంటే, యావత్ప్రపంచమందును బాల్యమందు వివాహము చేసుకొనిన పెనిమిటికంటె, ప్రియమైన సన్నిహిత సంబంధి ఎవడును లేడు. నేను కరుణతో వెళ్లుదును. నీవు

త్వరగా వెళ్లి, నీ పెనిమిటికొరకు కొంత పొగాకు సిద్ధము చేయుము. అతడు దాదాపుగా క్రోసెడు దూరము నడిచి వచ్చుచున్నాడు గనుక, లోపలికి రాగానే, పొగ తాగుటకు ఇచ్ఛయించునని అనుకొనుచున్నాను అని చెప్పి, ఇల్లు బైలుదేరగానే, నవీనుని తండ్రి ఎదురు పడి, నాకు వినయ పూర్వకముగా సలాము పెట్టి, తన ఇంటిలో ప్రవేశించెను. కరుణ నాతో చెప్పినట్టు, అతడు తాగి యుండలేదని అనుకొంటిని. హా! స్త్రీలారా! శ్రద్ధగా వినుడి. ప్రతి దినమును తాగి దారిలో సగమురాత్రి ద్రాక పడియుండేవాడు ఇప్పుడు ఏమియు తాగక, సాయంకాలము తన ఇంటియొద్దనే గడుపుటకు ఇల్లు చేరుచున్నాడు. ఇందుకు కారణము ఏమో మీకు తెలియ చెప్పెదను వినుడి. అతని భార్య మూడు దినములనుంచి ఇల్లు సిద్ధముగా ఉంచి, అతనితో ప్రేమగా మాటలాడినది; అదే కారణము.

నేను బండి యెక్కబోవు సమయములో పుల్లనీ త్వరగా వచ్చి, నన్ను తన ఇంటికి పిలుచుకొని పోయినది. అంతట నేను బండి దిగి, ఆమెయొద్దకు వెళ్లితిని. ఆమె కన్నుల వెంబడి నీళ్లు కారుచుండెను. అయినను ఆ కన్నీరు దుఃఖమువల్ల కాక, అధిక సంతోషమువల్లనే ప్రవహించుచున్నట్టు, నేను స్పష్టముగా కనుగొంటిని. అంతట పుల్లనీ మిక్కిలి ప్రకాశమాన ముఖముతో—"ఓ అమ్మా! చాలా కాల'మునకు నేటికి మీరు నా సుందరిని చూతురు. బోధకుడు తన 'సహోదరి ఈ వారము వచ్చునని నేడు నాతో చెప్పెను. ఆమె 'ఇక్కడ మూడు నెలల పర్యంతము ఉండబోవుచున్నదని అనుకొ'నుచున్నాను. అమ్మా! మా అందరియెడల మీకు నిండ ప్రేమ 'ఉన్నది గనుక, నా పిల్లను మీకు చూపుటకు నేను మిక్కిలి ఆశ 'కలిగి యున్నాను. అది మిక్కిలి చక్కనిదని జనులు చెప్పుకొం'దురు. అయితే ఆ సంగతిని గురించి దానిని చూచిన తరువాత 'మీరే నిశ్చయించ వచ్చును. అది వచ్చిన తరువాత మీ దర్శనము

'చేసేలాగున, దానిని మీ యొద్దకు తీసుకొని వత్తునా, లేక మీరే 'మా ఇంటికి దయచేతురా!" అని పలికెను.

అందుకు నేను—"ఫుల్మనీ! నీ కుమార్తెను నా ఇంటికి తీసుకొని 'రావద్దు. నేనే నీ ఇంటికి వత్తును. ఎందుచేతనంటే, సుందరిని దాని 'తమ్మునితోను, చెలియలితోను కూడుకొని ఇంటియొద్ద ఉండగా, చూడ 'కోరుచున్నాను. సాధువును సత్యవతియు మిక్కిలి సంతోషింతు-'రని అనుకొనుచున్నాను" అంటిని. అంతట ఫుల్మనీ — "ఓ అమ్మా! 'వారి సంతోషమునకు మితము లేదు. ఈ దినమంతయు సత్యవతి 'గంతులు వేయుచు, ప్రతివానితోను మా యప్ప వచ్చుచున్నది, మా 'యప్ప వచ్చుచున్నదని చెప్పుచున్నది" అనెను. అందుకు నేను—"ఫుల్మనీ! నేను కూడ నీతో సంతోషించుచున్నాను. నేను నిన్ను 'చూచిన దినము మొదలుకొని సుందరినిని చూడ కోరుచునే ఉన్నాను. 'నేటివరకు నేను విరిగిపోయినదాని గులాబీ చెట్టును మరిచిపోలేదు" 'అనిన,—"ఓ అమ్మా! ఆ కథ జరిగి చాలా కాలమాయెను. మీరు దా-'నిని జ్ఞాపకము ఉంచుకొని యున్నారని నేను అనుకొనలేదు" అని 'కరుణ చెప్పిన,—"అవును ఫుల్మనీ! ఆ కథ జరిగి ఒక సంవత్సరము 'అయినది వాస్తవమే. అయితే ఆ గులాబీ చెట్టును పట్టి నీ కుమార్తె 'చెప్పిన దివ్యమైన హెచ్చరికను నేను ఎన్నటికిని మరిచిపోను. మరి-'యు ఫుల్మనీ! నేను నీకు తెలియచేసేది ఏమంటే, నేను ఇంగ్లిషు 'దొరసానిని. నీవు బంగాళీ స్త్రీవి. అయినను నీ పరిచయము నాకు 'కలిగినందుకు నేను దేవుని తరుచుగా స్తుతించుచున్నాను. నీతో 'సంభాషించడమువల్ల నా మనస్సుకు నిండ ఆదరణ కలుగుచున్నది. 'మరియు నీవు నిరంతరమును ప్రతి సత్కార్యములోను నాకు సహా-'యము చేయుచున్నావు" అని చెప్పితిని.

ఫుల్మనీ ఇది వినగానే, దాని చెక్కిళ్ల వెంబడి కన్నీరు కారెను. అప్పుడు ఆమె—"అమ్మా! మీరు మాయెడల చాలా ప్రేమ కలిగి

'యున్నారుగాని, మేము అందుకు పాత్రులము కాము. నేను మీకు
'ఏమి సహాయము చేయుచున్నాను? ఉపకారము పొందేవారు మీ
'బోధవల్లనే పొందుచున్నారు" అనెను. అందుకు నేను అన్నమాట;–
"లేదు లేదు, ఫుల్లనీ! అలాగున చెప్పకుము. నేను కాదుగాని, పరి-
'శుద్ధాత్మ వేదవాక్యమనే విత్తనము వారి హృదయములో ఫలించేలా-
'గున చేయుచున్నాడు. మనము వెదవేయ గలిగితిమని దేవుని స్తుతిం-
'చవలసినదే. నేను ఇందాక చెప్పిన ప్రకారము, తిరిగి చెప్పేది ఏ-
'మంటే, నేను వెదవేసిన చోటను ప్రార్థనలవల్లను మంచి ఆలో-
'చనములవల్లను నీవు నీరు పోయుచున్నావు. కాబట్టి దానివల్ల ఏమైన
'ఫలము కలిగితే, మనము ఉభయులమును సంతోషించ వచ్చును.
'గత సంవత్సరములో దేవుడు మనకు ఎటువంటి నీతి సంబంధమైన
'కోత కలుగ చేసెనో, మనము ఊహింతము. ఎందుకంటే, ఆయన
'కృపను గురించి ధ్యానించడమువల్ల మన హృదయములలో ఆయన
'యెడల కృతజ్ఞత కలుగును. మొదట మనము ఆయాను గురించి
'చెప్పుకొనవలెను. నేను ఈ గ్రామమునకు మొదట వచ్చినప్పుడు,
'అది తన అబద్ధపు దీర్ఘదర్శియొక్క శిష్యురాలై యుండెను. అయితే
'ఇప్పుడు దానికి యేసునందు గట్టిగా నమ్మిక యున్నది. ఈ ఆయా
'నీ పిల్లల నడత చూచి, వారి సంభాషణము విని, మతమును గురించి
'యోజించుటకు ప్రేరేపించబడినట్టు, అది నాతో తరుచుగా చెప్పి-
'యున్నది" అంటిని. ఇది విని, ఫుల్లనీ పరలోకము వైపునకు కన్నులు
'ఎత్తి, మెల్లనగా, 'ఓ, కనికరము గల తండ్రీ! నేను నిన్ను స్తుతించు-
'చున్నాను' అనెను.

అంతట నేను—"రాణీయొక్క సంగతి కూడ విచారించ వచ్చును.
'అది ఇప్పుడు ఎంత యుక్తముగా నడుచుకొనుచున్నది. మరియు
'దుర్మార్గులను జగడమాడేదియునైన దాని అత్త దానికి ఏమి అజ్ఞా-
'పించునో, దానిని సహనముగానే జరుపుకొని పోవుచున్నది.

'ఓ ఫుల్మనీ! రాణి నీ యాత్మీయురాలైన శిశువు అయ్యున్నది. నేను దా-
'నితో తరుచుగా మతమును గురించి మాటలాడి యుండలేదు" అని
'చెప్పిన, ఫుల్మనీ అన్నమాట; — "అమ్మా! అది దాని పెనిమిటి అయిన
'మధువుయొక్క భయంకరమైన చావును చూచి, తన ఆత్మ విషయమైన
'క్షేమమును గూర్చి తలపెట్ట సాగెను. వాడు చచ్చిన రెండు దిన-
'ములకు దాని ప్రసవకాలమందు దేవుడు దానియెడల చాలా కరుణ-
'చూపెను. ముఖ్యముగా అందువల్లనే దాని మనస్సు పరిపాకము
'పొందెను. ఈ సంగతి అదే నాతో చెప్పినది. ఇది అలాగున
'ఉండనిమ్ము. రాణి నా యాత్మీయురాలైన పిల్ల అయ్యుంటే, మన ప్రి-
'యమైన కరుణ మీ శిష్యురాలని చెప్పవచ్చును. ఓ అమ్మా! చివర
'దినమందు అది మీకు ఆనంద కిరీటముగా నుండును. ఎందుకంటే,
'కరుణయొక్క హృదయము మిక్కిలి ప్రేమ గలది. అది నిజమైన
'క్రీస్తు మతస్థురాలై యుంటే, అనేకులయొక్క ప్రేమ చల్లారినట్టు,
'క్రీస్తునెడల దానికి ఉన్న ప్రేమ ఎప్పటికిని చల్లారదు, అని తోఁ-
'చుచున్నది" అనిన,—"ఫుల్మనీ! కరుణకు బోధించినప్పుడు, నీవు నాకు
'ఎంత సహాయము చేసినావో, ఆ సంగతిని నేను బొత్తుగా మరు-
'వను. అయితే ఇప్పుడు నీ అభిప్రాయము ఏమి? కరుణ నిజమైన
'క్రీస్తు మతస్థురాలై యుండునని నీవు అనుకొనుచున్నావా?" అని-
'నందుకు, ఫుల్మనీ—"అమ్మా! వాస్తవముగానే అనుకొనుచున్నాను.
'కరుణ తన భారము ప్రభువుమీద ఉంచి, కీడు వీడి, మేలుచేయుం-
'టకు ఆసక్తి కలిగి యున్నది. మరియు దాని ప్రయత్నము సిద్ధించు-
'ననుటకు సంశయము ఏమియు లేదు. ఎందుకంటే, 'నేను మీకు
'క్రొత్త హృదయమును దయచేతును, మీలో క్రొత్తయాత్మను ప్రవేశ
'పెట్టుదును'" (యెహెజ్కేలు. 36: 26.) అని ప్రభువు చెప్పెను అని
మారు మాట పలికెను.

అంతట నేను—"అవును ఫుల్మనీ! అది వాస్తవమే. ఎందుకంటే
'ప్రభువు తన వాక్యము సఫలమయ్యేకొరకు దాని హృదయమును

'దుఃఖముచేత కరిగించెను" అనిన, ఫ్లన్సీ ఇట్లనియె;—"హా! అమ్మా! 'మనము శ్రమ అనే దండముచేతను బాధ పొందేమట్టుకు, మనము 'క్రీస్తుయొక్క కాడిని భరించుటకు మనస్కరించక యుండడము అనేది 'ఎంత దుఃఖకరమైన సంగతి. అయితే ఆయన మన హృదయము-'లను శ్రమచేతను తన వైపునకు లాగుకొంటే, అప్పుడు ఆ శ్రమ 'నిమిత్తము దేవుని స్తుతించవలసినది. ఆయన ఈ చొప్పున కరుణ విష-'యమై జరిగించినాడు. అది నిజమైన క్రీస్తు మతస్థురాలైతే, దాని 'పెనిమిటి కూడ మతమునకు చెవి ఈయ వలెనని కోరుచున్నాను" అనెను.

అందుకు నేను—"అవును, ఫ్లన్సీ! నేనును ఈ చొప్పున అను-'కొంటిని గనుక, రా, మనము ఉభయులమును ఈ దినము మొదలు-'కొని ననీనుని తండ్రిని గురించిన మన ఆశలు నెరవేరేలాగున, ప్రా-'ర్థించ నారంభింతము. మనము వానితోనైతే విశేషించి మాటలాడ-'డము లేదుగాని, 'మీలో ఇద్దరు దేనినిగూర్చియైన భూమి-'యందు ఏకీభవించి అడుగుకొంటె, అది పరలోకమందుండే నా 'తండ్రిచేతను చేయబడును' అని ప్రభువు మాట ఇచ్చియున్నాడు. 'ఇటువంటి వాగ్దత్తము మనకు కలిగియున్నది గనుక, మనము దేనికిని 'భయపడక ఉందుము గాక. ఎందుకంటే, మన ప్రార్థనలు దేవుని 'వాక్యము చొప్పున నిశ్చయముగా నెరవేరును" అని మారు మాట పలికితిని. ఇది చెప్పి నేను సెలవు పుచ్చుకొంటిని. మరియు నాటి-రాత్రి ఫ్లన్సీయే కాని, నేనే కాని, ఈ దుర్మార్గుని రక్షణ నిమిత్తము కృపా సింహాసనము నొద్ద ప్రార్థించక ఉండలేదని నేను నిశ్చయముగా చెప్పగలను.



# ౯. అధ్యాయము.

ఈ కుటుంబములను గురించిన కథ ఇంక వివరించి వ్రాయనక్కరలేదు. అయితే నేను ముగించక ముందు, ఫుల్మనీయొక్క పెద్ద కుమార్తె కథను ఈ పుస్తకమును చదివేవారికి కొంతమట్టుకు తెలియ చెప్పవలెనని మిక్కిలి కోరుచున్నాను. ఈ కథారంభమునందు ఆ చిన్నదాని విషయమై సూచన చేయబడిన సంగతి ఈ చదివేవారికి జ్ఞాపకము ఉండవచ్చును. సుందరియొక్క నిష్కపటమైన భక్తిని గురించియు, దాని తల్లిదండ్రాదులయెడల దానికి ఉండిన ప్రేమను గురించియు చదివియుండిరి గనుక, ఇప్పుడు ఆ చిన్నదానిని గురించి ఇంక కొంచెము వినుటకు సంతోషింతురని అనుకొనుచున్నాను.

సుందరియొక్క నిరీక్షింపబడ్డ రాకనుగురించి ఫుల్మనీతో నేను సంభాషించిన తరువాతి ఆదివారమునందు, నేను దేవాలయములో బోధకుని కుటుంబముతో కూడ ఒక క్రొత్త దొరసానిని చూచి, ఈమెయే సుందరియొక్క యజమానురాలని ఆ క్షణమే ఊహించితిని గనుక, నేను ఫుల్మనీ ఇంటికి త్వరగానే వెళ్లుటకు నిశ్చయించితిని. ఎందుకంటే, ఆమెను సంతోష పెట్టుటకును, ఆమె కుమార్తెను చూచుటకును, నేను చాలా ఆశగా నుంటిని. ఆ ప్రకారముగానే మరుదినము సాయంకాలమునందు నేను అక్కడికి వెళ్లితిని. నేను బండి దిగుచుండెడమును ఫుల్మనీ చూడగానే, ఆమె నన్ను ఎదురుకొన వచ్చెను. ఆమె సంతోష ముఖమును చూచి,—"ఫుల్మనీ! మీరందరును బాగుగా నున్నారా? నీ కుమార్తెను క్షేమముగా చేర్చుకొంటివా?" అని అడిగితిని. అందుకు ఆమె—"అవును అమ్మా! దేవుని కృపవల్ల దానిని చేర్చుకొంటిని. మరియు అది మునుపటికంటె ఎక్కువ శరీర సౌందర్యము కలదిగాను, అంతకంటె అమూల్యమైన మనస్సౌందర్యము కలదిగాను నున్నదని అనుకొనుచున్నాను" అనెను.

అంతట నేను—"పుల్లనీ! 'నీతిపరులారా! మీరు శుభవంతులై
'యుందురు. మీరు మీ క్రియల ఫలమును అనుభవింతురు. నన్ను
'ఘనపరచే వారిని నేను ఘనపరచుదును- నన్ను నిరాకరించేవారు
'చులకనగా ఎంచబడుదురు' అని దేవుడు ఆనతిచ్చెను. నీవు నీ కుమా-
'ర్తెను ప్రభువుయొక్క శిక్షలోను బోధలోను పెంచినందువల్ల, నీవు
'దేవుని ఘనపరచితివి. ఇప్పుడు ఆయన ఈ నీ కుమార్తెను భక్తి కల-
'దానినిగాను మంచిదానినిగాను చేసి, నిన్ను అందరి యెదుట ఘన-
'పరచుచున్నాడు" అని చెప్పితిని. నేను మాటలాడుచు ఆవరణము-
లోనికి ప్రవేశించితిని. సుందరి ముంగిటిలో చాప మీద కూర్చుండి
యుండెను. అయితే దాని ముఖము ఇంటి వైపునకు తిప్పుకొని
యుండెను గనుక, అది నన్ను మొదట చూడక పోయెను. దాని
పక్కను సాధువు కూర్చుండి యుండెను. సత్యవతి దాని అప్ప చెం-
పను చేతితో దువ్వుచు 'ఓ అప్పా! నీవు మాకు ఇందాక చెప్పిన
'చక్కని కథవంటిది మరి యొకటి చెప్పుము' అని చెప్పుచుండెను.
అంతట అది నన్ను కనుగొని, త్వరగా లేచి, 'ఓ ప్రియమైన అప్పా!
'ఆ దొరసాని వచ్చి యున్నది' అని చెప్పిన మీదట, సుందరి లేచి, ఒక
సలాము పెట్టెను. దాని సౌందర్యమును గురించి నేను వినినదంత-
యు నిజమని చూచితిని. ఎందుకంటే, అది వాస్తవముగా అధిక
సౌందర్యము కలది. దాని రంగు ఎఱ్ఱగా నుండెను. దానికి కలిగి
యుండిన నల్లనైన పెద్ద నేత్రములవంటి నేత్రములను నేను ఎప్పుడును
చూచి యుండలేదు. దాని ముఖము మనోహరమై, దాని నడక
సుందరముగా నుండెను. అది ఎంతమాత్రమును గడుసరిగా నుండక,
చాలా లజ్జ కలిగి యుండెను. అయితే అది లేని లజ్జను తెచ్చి పెట్టు-
కొని కనుపరచలేదు. ఎందుకంటే, దొరసానులతో మాటలాడడము
దానికి ప్రాంతమై యుండెను.

నేను దానిని చూచి,—"సుందరీ! నిన్ను చూచి చాలా సంతో-
'షించుచున్నాను. నీ రాకకు కొన్ని దినములనుంచి నిరీక్షించుచు-

న్నాను. నేను ఎవరనైనదని నీవు విని యున్నావని అనుకొనుచు-
'న్నాను" అని చెప్పితిని. అందుకు, అది ఇట్లనియె;—"అవును అమ్మ-
'గారూ! నా చిన్న తమ్ముడును చెలియలును మీరు నా తల్లిదండ్రుల
'యెడల చూపిన దయ యావత్తును గురించి నాకు తెలియచేసినారు.
'అందుకు దేవుడు మిమ్ములను ఆశీర్వదించుగాక!" అనెను. అది ఈ మాట
పలుకుతుండగా, దాని నేత్రములు కన్నీరుతో నిండెను. సత్యవతి అది
చూచి, దాని బట్ట చెంగు పట్టుకొని, దాని అప్పయొక్క నేత్రము-
లను త్వరగా తుడిచి,—"కూడదు, అప్పా! ఇప్పడం ఏడ్వ కూడదు.
'ఎందుకంటే, ఇది మనము సంతోషించేకాలమై యున్నది" అని
చెప్పెను. అటుతరువాత ఈ దుఃఖము మరచిపోగలందులకు, ఆ పిల్ల
నా వైపు చూచి,—"అమ్మా! మా అప్ప కలకత్తానుంచి మాకొరకు
'తెచ్చిన మంచి వస్తువుల నన్నిటినిని మీరు చూడ కోరుదురా!" అని
'అడిగిన, 'అవును నేను వాటిని చూడవలసినది' అని మారు మాట పలి-
కితిని. అంతట సత్యవతి ఇంటిలోనికి పరుగెత్తుకొని వెళ్లి, ఆ వస్తువుల-
నన్నిటిని బయటికి తెచ్చినది. అప్పుడు నేను చూచినది ఏమంటే,
సత్యవతి కొరకు ఒక ఇంగ్లీషు దొరసాని వలెనే బట్టలు తొడిగిన ఒక
కొయ్య బొమ్మను, చేతికి ఒక జోడు గాజు పూసలతో చేసిన కంక-
ణములను; సాధువు చదువునందు ఆసక్తి గల చిన్నవాడని తెలిసెను
గనుక, అతని కొరకు అతని పుస్తకములను ఉంచుకొనేటందుకు ఒక
పెట్టెను, క్రీస్తు సభను గురించిన ఒక చరిత్రను సుందరి తెచ్చినట్టు
కనుగొంటిని. తన తండ్రి కొరకు ఒక మిర్జాకూడా తెచ్చినది. సుం-
దరియొక్క యజమానుగాలు ఆమె యజమానునియొక్క అతిలషుతో
చేసిన మూడు పాత అరచొక్కాలు ఇచ్చెను. అది ఆ మూటిని
చేర్పుగా కూర్చి ఒక మిర్జాను చక్కగా కుట్టెను.

సత్యవతి దానిని నాకు చూపి,—"అమ్మగారూ! మా అయ్య ఈ
'చొక్కా తొడుగుకొంటే, ఒక బాబు వలెనే ఉండును" అనిన్న

'దాని అప్ప—"సత్యవతీ! మన అయ్య బాబుకాడా? ఆయన బాబు 'అని పిలువబడ తగును. నేను కలకత్తాలో అనేకులైన బాబులను 'చూచినాను గాని, ఆ పేరునకు మన తండ్రి తగియున్నట్లు నేను 'ఎవరినిని ఇదివరకు చూచి యుండలేదు. భక్తియు పరువును కలిగి, 'భాగ్యవంతులయెడలను దరిద్రులయెడలను దయగా ఉండేవాడే. 'వాస్తవముగా బాబు అయ్యున్నాడని అనుకొనుచున్నాను. మన 'తండ్రి ఈ యంశములో బాబుకాడా? నాతో చెప్పుము" అనెను. సాధువును సత్యవతియు ఉభయులును కూడి,—"అవును వాస్తవమే. 'మన తండ్రియంత మంచివానిని మేము ఎప్పుడును చూచి యుం- 'డలేదు" అని మారు మాట పలికిరి. ఈ సంభాషణము జరుగుచుండ- 'గా, ఫుల్మనీ ఏమియు చెప్పక ఊరకుండెను గాని, ఆమె ముఖమును- పట్టి విచారించిన మీదట, ఆమె పిల్లలు ఈ చొప్పున మాటలాడడ- మును వినుటకు అది మిక్కిలి సంతోషించెనని కనుగొంటిని. అంతట ఆమె తన కుమార్తె తన కొరకు తెచ్చిన ఒక సీమ చీరెను నాకు చూపి, "అమ్మగారూ! మా సుందరి పాకేపిల్ల పుట్టినదినమందు, ఆ దొర- 'సాని దానికి మూడు రూపాయీలు బహుమానముగా ఇచ్చెను, 'అది వాటిని పెట్టి నా కొరకు ఈ చీరెను కొనినది. ఇటువంటి 'మంచి చీరె ఇక్కడ దొరకదు" అని చెప్పెను.

అంతట సత్యవతి—"చూడుండి, అమ్మా! మా చిన్న ప్రియనాధుని 'మా అప్ప ఎన్నడును చూచి యుండలేదు. అయినప్పటికిని ఆమె 'వానికొరకు చీటిబట్టతో రెండు చిన్న కుడతాలను, కాకను పు- 'ట్టించే ఒక కుళ్లాయీనిని కుట్టి తెచ్చినది. మఱియు అవి వానికి సరి- 'గా నున్నవి" అని పలికెను. నేను ఆ వస్తువుల నన్నిటిని చూచిన తరువాత, వాటిని చాలా మెచ్చుకొంటిని. ఎందుకంటే, అవి అన్ని- యు చక్కగానే యుండెను. అయితే వీటివల్ల దృశ్యమైన సుందరి- యొక్క గుణము, అనగా దానికి తన తల్లిదండ్రులయెడల కలిగి

యుండిన గొప్ప ప్రేమ అనేది అన్నిటికంటె ఉత్తమమై యుండెను. ఎందుచేతనంటే, అది తెచ్చిన వస్తువులు నశించేవి. అయితే ఏ అభిప్రాయముతో అది వాటిని జాగ్రత్త పెట్టెనో, ఆ అభిప్రాయమనేది దేవుని సింహాసనము నొద్దకు సంశయము లేక వెళ్లియుండును. ఆయనచేత సుగంధార్పణగాను యాగముగాను అంగీకరింపబడి యుండవచ్చును.

నేను సుందరితో సంభాషించుటకు ఆరంభించేకొరకు, నేను దానితో—"సుందరీ! ఈ మిర్జా కుట్టడము నీకు మిక్కిలి అయాసముగా 'నుండెనని అనుకొనుచున్నాను. ఎందుచేతనంటే నీవు దానికి అస్త'రువు చేసినట్టు కనుపడుచున్నది. మరియు అతలషుయొక్క తునకల'నన్నిటిని సరిగా అంచు కుట్టడములో నీకు చాలాకాలము పట్టి'యుండవచ్చును" అనిన,—"అమ్మగారూ! వాస్తవమే. దానిని కుట్ట'డములో చాలా దినములు గడిపితిని. ఎందుకంటే, సాయంకాల'మందే పిల్లలను పరుండబెట్టిన తరువాతను, నాకు కుట్టుటకు వ్యవ'ధానము కలిగి యుండెను. ఈ పని నాకు దాదాపు ఆరు మాసములు 'పట్టినదని తోచుచున్నది. అయితే ఒకప్పుడును నాకు ఆయాసము-గా నుండెనని చెప్పచాలను. నేను కుట్టుచుండినప్పుడు, నా ధ్యా'నమంతయు ఇంటి మీదనే ఉండి, నా తండ్రి ఈ మిర్జాను తొ'డుగుకొనే దినము నాకు ఎంతో సుదినమై యుండునని నా యంతట 'నేను అనుకొంటిని గనుక, ఈ తలంపు ఆయాసమును కనుపరచ'కుండ చేసెను. అయితే అది ఏలాగున నంటే నేమి, నా తండ్రి 'నిన్నటి దినము దేవాలయమునకు వెళ్లేటప్పుడు, దానిని తొడుగుకొని, 'ఆయన హస్తము నా శిరస్సు మీద ఉంచి, 'నా ప్రియమైన కుమా'ర్తెను దేవుడు ఆశీర్వదించుగాక!' అని నన్ను దీవించెను. అప్పుడు 'నేను చేసిన కష్టము యావత్తునకును సమృద్ధిగా ఫలము దొరికెను."

ఇది విని, నేను ఓ సుందరీ! మన సభలకు భూషణములుగాను ఈ దుష్ట సంతతిలో దేవుని సేవించుటకు నీవంటి ఆడ పిల్లలు ఇంక

అనేకలు ఉంటే, ఎంతో మేలు! అని మనస్సున అనుకొని సుందరిని
చూచి,—"నీవు సాయంకాలమందు కుట్టుకొనుచు, ఒంటరిగానే కూ-
'ర్చుండేదానవా!" అని అడిగితిని. అందుకు అది—"అవును, మొదట
'నాతో కూడ ఒక తురక ఆయా ఉండెను గాని, దాదాపు ఎనిమిది
'నెలల క్రిందట అది పిల్లలయెదుట చెడ్డ మాటలు ఆడినందుకు, నా
'దొరసాని దానిని నవుకరిలోనుంచి తీసివేసెనని" చెప్పెను. అంతట
'నేను—"సుందరీ! నిన్ను ఒక మాట అడుగవలెనని నాకు ఇప్పుడే
'తోచినది. నీ జత పని వారితో అనుకూలముగా నుంటివా? వారం-
'దరును హిందువులును తురకలును అయ్యుందురా? అని అడుగ కో-
'రుచున్నాను" అనిన, సుందరి అన్నమాట;—"ఒక ముసలి తోటమాలి
'మాత్రమే క్రీస్తు మతస్థుడు. ఇతడును ఇతని భార్యయును మిక్కిలి
'మంచివారు. వారు నాకు చాలా దయ చూపినారు. నేను ఆ ఇం-
'టికి మొదట వెళ్లినప్పుడు, నవుకరులకు అందరికిని నాయందు ఎంత-
'మాత్రమును ఇష్టముగా నుండలేదు. ఎందుచేతనంటే, ఒక క్రీస్తు
'మతస్థుడు రావడముతోనే, ఇంక అనేకులు వచ్చి, తమ నవుకరీలలో
'నుంచబడుదురని ఆ నవుకరులు అనుకొనిరి. అయితే ఇప్పుడు వారు
'అలాగున అనుకొనడము లేదు. వారికిని నాకును అనుకూలముగానే
'జరుగుచున్నది. నాకు సంభవించిన దుఃఖమంతయు మొదటిలోనే
'సంభవించినది. ఒక పడుచు నవుకరు నన్ను చెరపవలెనని చాలా
'ప్రయత్నము చేసెను. వాని మాటలకు నేను తుదకు సహించలేక,
'ఆ సంగతిని గురించి నా దొరసానితో చెప్పినమీదట, దొరగారు
'వానిని గట్టిగా గద్దించి, తక్కిన నవుకరులందరియెదుటను వానిని
'సిగ్గుపరచి, వానిని నవుకరీలోనుంచి తోలివేసెను. ఆ దినము
'మొదలుకొని వారందరును భయపడి, ఎవరును నాతో ఒక చెడ్డ
'మాటనైన పలుక లేదు. అయితే రెండు మూడు పర్యాయములు
మరియొక విధముచేతను నాకు నిండ అయాసము కలిగెను. ఒక

'పెద్దబోయీ యుండెను. వాడు చెడ్డ దొంగగా నుండి, దొరసా-
'నిని నిండ దగా చేసెను. కత్తులును కత్తెరలును డబ్బులును ఉంగ-
'రములును, అక్కడక్కడ పడియున్న ఇటువంటి చిన్న వస్తువులును
'మాయమగుచుండును. ఈ పెద్దబోయీ వాటిని తీసుకొనెనని
'కొంచెము అనుమానము ఉండెను. కాని వాని దొంగతనము పట్టు-
'బడక యుండెను. ఒకనాడు అంగడినుంచి మూడు మణుగుల
'కొబ్బరి నూనె తెచ్చిన తరువాత, దొరసాని నన్ను చూచి,—సుందరీ!
'నీవు నేడు కొట్టులోనికి వెళ్లి, నూనె కొలిచి చూడుము. ఎందు-
'కంటే, ఈ పెద్దబోయీ కొద్దికాలము క్రిందటనే మూడు మణుగులు
'తెచ్చెను. ఇంతలో ఇదంతయు వాడబడెనా? అని నాకు నిండ
'సంశయము కలిగి యున్నది అని చెప్పెను. ఆ పెద్దబోయీ ఈ
'మాట విని, మిక్కిలి కోపపడెను. అంతట నేను కొట్టులోనికి వెళ్ల-
'గానే, వాడు నన్ను చూచి, ఈ నూనె కొలిచేటప్పటికి, చాలా
'కాలము పట్టును. సరిగా మూడు మణుగుల నూనె యున్నది గనుక,
'నీ కష్టము ఎందుకును ఉపయోగించదు. నీవు దీనిని కొలవక, దొర-
'సానిగారితో, నూనె తూచినాననియు, అది మూడు మణుగులు
'అనియు చెప్పే పక్షమందు, మిఠాయీ కొనుకొనుటకు, నీకు ఎని-
'మిది అణాలు ఇత్తును అనెను. అయితే నేను ఈ ప్రకారము చేయు-
'టకు ఒప్పలేదు. ఎందుకంటే, ఆ చొప్పున చేసితే, దేవుని ఆజ్ఞలను
'అతిక్రమించినదానను అగుదుననియు, క్రీస్తు మతము విగ్రహారాధ-
'కుడైన ఈ బోయీయెదుట నిందింపబడుననియు యోచించితిని.
'ఇదిగాక, ఈ యెనిమిది అణాలును దుఃఖము మాత్రము తప్ప, మరి
'ఏవిధమైన తృప్తియు కలుగచేయనేరవని నేను బాగుగా తెలుసు-
'కొంటిని గనుక, నేను ఆ చమురు కొలిచి చూచితే, వాడు తెచ్చిన
'మూడు మణుగులలో, అర్ధ మణుగు తక్కువ పడెను. అప్పటి
'సమయములో, చమురు మణుగు ఒకటింటికి పది రూపాయిల చొ-

'ప్పున అమ్ముచుండెను. గనుక, ఆ పెద్దబోయీ ఒకమారే అయిదు 'రూపాయీలను దొంగిలెను. ఈ సంగతి నేను నా దొరసానితో 'తెలియచేసినమీదట, ఆ పెద్దబోయీ వచ్చి, తాను నాకు రవేనులో 'సగము ఇయ్యక పోయినందుకు, తన మీదను అవాస్తవమైన నేరమును 'మోపినానని చెప్పుకొనెను. నా దొరసాని ఆ చమురు తన యెదు- 'టనే తిరిగి కొలిపించుకొనునన్నే సంగతి ఆ బోయీ విచారించ 'లేదు. అయితే నా దొరసాని ఎప్పుడును న్యాయముగానే విమర్శిం- 'చునది. రుజువు లేక ఎవరినిని అపరాధినిగాయెంచదు. అయితే 'రుజువు దొరికిన మీదట ఆ యపరాధిని తగినట్టుగా శిక్షించునది 'గనుక, ఆమె ఆ చమురును కొలిపించి చూచితే, అర్ధ మణుగు తక్కు- 'వగా నుండెను గనుక, ఆ బోయీని నవుకరీలోనుంచి తీసివేసినది. 'ఇకను ఒక ముసలి ఆయాను గురించి మాత్రము మీతో చెప్పవలసి 'యున్నది. నా దొరసానితో కూడ అది చాలా కాలమునుంచి 'యుండి, పిల్లలయెడల మిక్కిలి దయగా తిరిగెను గనుక, దాని 'యెడల నా దొరసానికి చాలా ఇష్టముగా నుండెను. అయితే దాని- 'యందు ఒక లోపము మాత్రము ఉండెను. ఏదంటే, నా దొరసాని 'బయటికి వెళ్లిన తరువాత, అది బంగాళా మిఠాయీని తీసుకొని 'వచ్చి, పిల్లలకు పెట్టును. అలాగున చేయకూడదని' నా దొరసాని 'దానితో ఎన్నిమారులు చెప్పి యున్నప్పటికిని, అది ఆమె ఆజ్ఞలను 'కనుపెట్టక, ఆ మిఠాయీని రహస్యముగా తెచ్చి, మీ అమ్మతో 'ఒకమాటు అయిన చెప్పవద్దని పిల్లలతో చెప్పి, పెట్టుచు వచ్చేది. 'ఈ చొప్పున ఆ పిల్లలు క్రమముగా దగా నేర్చుకొనుచుండిరి. అయితే 'వారికి నాయొద్ద రహస్యముగా మిఠాయీ దొరికేదికాదు గనుక, నా- 'యందు ఇష్టముగా నుండకపోయిరి. ఆ ముసలి ఆయాను గురించి 'నేను ఏమి జరిగించవలసినదో, ఆ సంగతి నాకు తోచక, నన్ను యుక్త మార్గములోనికి కొంచు పొమ్మని దేవుని తిరిగి తిరిగి ప్రార్థి-

'స్త్రీని. నేను ఆయాయొక్క దగాను గురించి నా దొరసానితో చెప్ప-
'టకు నాకు ఇష్టము లేకపోయినది. ఎందుచేతనంటే, ఆయా నాయందు
'నిండ ప్రేమ యుంచి, నాకు అనేకములైన పనులు నేర్పినది. అయితే
'తుదకు నా దొరసాని తానే దాని అక్రమములను కనుగొనినది.
'దుర్గాదేవియొక్క విగ్రహము గంగలో స్నానము పొందే దినము, నా
'దొరసాని బయటికి వెళ్లేటప్పుడు, నన్ను పిల్లలయొద్ద ఉంచినది. ఆ
'ముసలి ఆయా నాతో—రా, మనము పిల్లలను తీసుకొని వెళ్లి, వేడుక
'చూతమనెను. నేను ఇది విని ఆశ్చర్యపడి, ఓ మంచి ఆయా! ఇది నా
'దొరసాని వింటే, ఎంతో కోపగించుకొనును అనిన, ఆయా—ఆమె,
'నీవు తెలియ చేసినంగాని, మరి యెవరివల్లను ఈ సంగతిని గురించి
'వినదు. కాబట్టి ఆక్షేపించక, రా, వెళ్లుదము అనెను. అందుకు నేను—
'వద్దు ఆయా! అలాగున కూడదు. నీవు వెళ్ల కోరితే, పిల్లలను నాయొద్ద
'ఉంచి, నీవు మాత్రమే వెళ్లుము అంటిని. అప్పుడు అది—సుందరీ!
'నీవుకూడ రాకపోతే, నామీద నేరము చెప్పుదువు. అందుకు నేను—
'లేదు ఆయా! అయితే పిల్లలను తీసుకొని వెళ్లిన పక్షమందు, నేను
'చెప్పవలసి యుండును, వారు నాతో కూడ నుంటే, నేను చెప్పనక్కర
'లేదు అంటిని. అంతట ఆయా వెళ్లిపోయెను. మేము మాటలాడు-
'కొనిన దంతయు మేరీ అనే చిన్నది గ్రహించినదని మేము అను-
'కొనలేదు. ఆయా దుర్గ అనే పేరుగల ఏదో ఒక సుందరమైన-
'దానిని తనకు చూప కోరితే, సుందరి చూపనిచ్చినది కాదని ఆ
'చిన్నది గ్రహించి, బిగ్గరగా ఏడవసాగి, ఆయాను పిలువ నారంభిం-
'చెను. అంతట నా దొరసాని ఇంటికి రాగానే, ఆ మేరీ అనే చిన్నది
'ఆమెయొద్దకు ఏడుచుచు వెళ్లి,—అమ్మా! సుందరి మిక్కిలి చెడ్డది, ముసలి
'ఆయా మంచిది. అది సుందరమైన దుర్గను నాకు చూప కోరితే,
'వద్దు వద్దు, వెళ్ల వద్దని సుందరి చెప్పినది. నాకు సుందరియందు
'ఎంతమాత్రమును ఇష్టములేదు అని చెప్పినది. నా దొరసాని ఇది

'విని, నా వైపునకు తిరిగి, ఇది ఏమిటి అని అడిగిన, నేను అమ్మా!
'నేను చెప్పచాలను. ఎందుకంటే, చెప్పనని మాట ఇచ్చియున్నాను.
'అయితే వాకిటి కావలి మనుష్యుడు ఒకడు అక్కడ నిలిచి యుండి,
'నాకును ఆయాకును జరిగినదంతయును విని యుండెను గనుక, వాడు
'నా దొరసానిని సంతోషపెట్టుటకు, కథ అంతయును చెప్పెను.
'ఇది అంతయును విని, నా దొరసాని మరునాడు ఆయాకు సెలవు
'ఇచ్చివేసెను. అయితే అది ముసలిది అయ్యుండెను గనుక, దానికి
'ఒక ఇల్లు కట్టించి పెట్టి, నెలకు రెండు రూపాయిల చొప్పున మనో
'వృత్తి ఇచ్చుచున్నది. ఆ ముసలిది, ఈ మనోవృత్తికొరకు వచ్చి-
'నప్పుడెల్ల, పిల్లలను చూచి పోవునది. నాకును దానికిని ఇప్పుడు
'చాలా స్నేహము కలిగి యున్నది. దానికి బదులుగా వచ్చిన క్రొత్త
'ఆయా కొంతకాలముదాక బాగుగా నడుచుకొనెను. అయితే తరు-
'వాత మేరీ అనే చిన్నదానికి చెడ్డ కథలు చెప్పి, దాని మనస్సు చెడ-
'గొట్టడము నేను చూచి, ఆయా పని అంతయు నేనే చూచుకొంటే,
'బాగుగా నుండునని నా దొరసానితో చెప్పుకొంటిని. వెంటనే
'ఆ ఆయా వెళ్లగొట్టబడెను. అది మొదలుకొని నేను ఒంటరిగా
'నుంటిని గాని, నా దొరసాని ఇప్పుడు తిరిగి ఇంటికి వెళ్లేటప్పుడు,
'నాతో సహవాసముగా నుండుటకు, ఇంకొక క్రీస్తు మతపు చిన్న
'దానిని తీసుకొని వత్తునని దయగా చెప్పినది" అనెను.

అటుతరువాత సుందరి ఇంక చెప్పసాగినది ఏమంటే, "అమ్మా!
'ఈ దేశపు జనులు తమ కుమార్తెలను ఇల్లు దాటనియ్యరు. ఆడ-
'పిల్లలు పరదా వెనుక తాళము వేసిన గదిలో నిరంతరమును ఉండ-
'వలసినదని చెప్పుదురు. అయితే హృదయముయొక్క తాళపు చెవి-
'వంటి చెవి యొక్కడను దొరకదు. మనము మన హృదయములను
'క్రీస్తుయొక్క చేతికి ఒప్పగించి, ఆయన దయచేసే కవచమును ధరిం-
'చితే, సైతాను మన మీద ఎప్పటికిని దాని చేయచాలదు" అనెను.

అందుకు నేను అన్నమాట,—"సుందరీ! అది వాస్తవమే. ఈ దేశపు
'క్రీస్తుమత స్త్రీలం ఇప్పుడు జరిగించుచున్నదానికంటె, క్రీస్తుమత
'పురుషులతో కలిసి బాగుగా మాటలాడితే, వారు దానివల్ల చాలా
'లాభమును పొందుదురు. అయితే కొంచెము విచారించి చూడు.
'మనుష్యులు ఇప్పుడు ఏమి చేయుచున్నారంటే, పతివ్రతలను
'దుర్మార్గపు స్త్రీలను సమానముగా ఇల్లు కదిలి వెళ్లనియ్యడము
'లేదు గనుక, ఆ పతివ్రతలు—మా పాతివ్రత్యమువల్ల ఏమి లాభము,
'మా పెనిమిటులు మాయందు నమ్మకము ఉంచరు గనుక, ఇకను మా
'మనస్సు వచ్చినట్టు మేము నడువ వచ్చును అని నిరాశచేత వారు
'చెప్ప వచ్చును గదా. అయితే ఒక పురుషుడు తన భార్య పతివ్రత
'అని యెరిగి, దానిని మనస్సు వచ్చినట్టు అనుమానము లేకుండ తిరుగ-
'నిచ్చితే, అది సంతోషించి, దాని పెనిమిటిని అంతకంతకు ఎక్కు-
'వగా సంతోషపెట్టుటకు కోరకుండ నుండునా? మఱియు ఇంక
'నేను చెప్పేది ఏమంటే, స్త్రీలు యోగ్యులైన పురుషులతో పరిచ-
'యము చేయుటవల్లను, వారితో సంభాషణము చేయుటవల్లను, వారి
'సంభాషణము ద్వారా ఎక్కువ బుద్ధిమంతులు అగుదురు. ఆదాము
'కొరకు హవ్వాను దేవుడు సృజింప యత్నము చేసినప్పుడు, నేను వీని
'గృహకృత్యమును జరుపుటకు ఒక దాసిని చేతునని అయిన, లేక
'ఇతనికి సంతానము కలుగుటకే ఒక స్త్రీని చేతునని అయిన చెప్పక,
'ఆదాము కొరకు యుక్తమైన సహాయురాలిని కలుగ చేతునని
'చెప్పెను. ఇప్పుడు ఆలోచించుము, తెలివిలేనిదై, లౌకికమును
'గుర్తెరుగనిదైన స్త్రీ, దాని పెనిమిటికి ఏలాగున తగిన సహాయురాలై
'యుండును! అనేక విధములచేతను మంచివారితో సాంగత్యము
'చేయడమువల్ల, తెలివి వృద్ధి యగును గనుక, పురుషులు, తమ భార్యలు
'తెలివికలవారు అయ్యేలాగున, ప్రయత్నపడవలెను. కొందరు బం-
'గాళీ క్రీస్తు మతస్థులు ఎంత బుద్ధిహీనులంటే, వారి భార్యలు తమ

'గృహ కృత్యమును విడిచిపెట్టుదురనే భయముచేత, బైబిలు పుస్త-
'కమును సహా వారిని చదువనియ్యరు. ఇటువంటి జనులు పశువులే
'కాని మనుష్యులు కారు. వారు తాము మాత్రమే మోక్షమునకు
'వెళ్లుదుమని అనుకొందురు. అయితే తమ గృహ కృత్యమునకు
'ఆటంకము వచ్చుననే భయముచేత తమ భార్యలకు ఉపదేశించక,
'వారిని నాశనము పొందచేయుదురు. అయితే ఇటువంటి మను-
'ష్యులు స్వానాటికి తగ్గి పోవుచున్నారని అనుకొనుచున్నాను" అంటిని.

అంతట నేను ఫుల్మనీని చూచి,—"ఈ విషయములో నీవు ఎందుకు
'ఏమియును పలుకకున్నావు? నేను చెప్పేది నీకు సరిపడి యుండ-
'లేదా?" అని అడిగితిని. అందుకు ఫుల్మనీ—"అమ్మా! మీరు చెప్పినది
'ఎందుకు సరిపడియుండలేదు. అయితే నాకు ఒకటిమాత్రము
'తోచుచున్నది. ఏమంటే, ఎవతె అయిన ఒక బంగాళీస్త్రీ ఇంగ్లీషు
'దొరసాని వలెనే అన్ని అంశములలోను ప్రవర్తించితే, ఆ స్త్రీ
'పతివ్రత కాదని ఇతరులు అనుకొందురు. అమ్మా! విచారించుడి.
'ఇంగ్లీషు దొరసానులైన మీరు దొరలతో కూడ విహరించి, వారితో
'ఒంటరిగా కూర్చుండి, సంభాషింతురు. అయితే ఒక బంగాళీ
'స్త్రీ ఆ చొప్పున చేసితే, దానిని గురించి మీరే ఏమి అనుకొం-
'దురో చెప్పుడి" అనెను. అందుకు నేను అనిన మాట;—"ఫుల్మనీ! నా
'తాత్పర్యము అది కాదు. బంగాళీ స్త్రీలు ఒక పర్యాయమే ఇంగ్లీషు
'దొరసానుల వలెనే ఉండవలెనని కోరను. ఎందుచేతనంటే, పురు-
'షులతో యుక్తముగా మాటలాడ కోరే స్త్రీలకు ఒకానొక మార్ద-
'వమై, కేవలము స్వభావ జన్యమై, యుక్తమైన లజ్జ ఉండవలసినదే.
'అయితే ముఖము కప్పుకొని కనుపరచేది లజ్జ కాదు గాని, మనో
'నైర్మల్యముచేతను దృష్టమైనది యేదియో, అదియే లజ్జ. ఇటువంటి
'లజ్జగల స్త్రీయే పురుషుని యెదుటనైన, ఒక అపవిత్రమైన మాటే
'కాని, లేక ఒక తగని కొడిగమే కాని పలుకదు, మరియు అతని

'మనస్సు తనయందు తగులుకొనే లాగున, ఏమియు చేయదు. ఇటు-
'వంటి స్త్రీలు పురుషులతో ధారాళముగా సంభాషించి, నిరపరాధు-
'లుగా నుండవచ్చును. అయితే బంగాళీ స్త్రీలు ముఖములు కప్పుకొని,
'రాణివాసముగా నుండినప్పటికిని, వారిలో ఇప్పుడు చెప్పిన లజ్జ
'ఇంగ్లీషు దొరసానులలో ఉన్నట్టు లేదు. బంగాళీ స్త్రీలు ఇతర
'పురుషుల యెదుట నిరాటంకముగా వినరాని సంగతులను గురించి
'పలుక గలరు. అయితే ఇంగ్లీషువారిలో ఒక స్త్రీ ఇటువంటి సం-
'గతులను గురించి మాటలాడితే, అది మంచి శిక్షలో రాలేదని అంద-
'రును అనుకొని, దానిని నిర్లక్ష్యము చేతురు. ఇప్పుడు చెప్పిన అన్ని
'అంశములలో ఈ దేశపు క్రీస్తుమత స్త్రీలు అజ్ఞులకంటె శ్రేష్ఠులై
'యున్నారు గాని, వారియందును ఇంక కొన్ని లోపములు కలవు.
'ఈ లోపములు ఉన్నంత మట్టుకు, వారు పురుషులతో విశేషించి
'సహవాసము చేయ కోర తగినదై యుండదు. ఇంగ్లీషువారికి ఉన్న
'తెలివిని వారు క్రమముగా సంపాదించుకొనిన కొలది, వారు మావ-
'లెనే యుందురు. అయితే ఈ సంగతి సంపూర్ణముగా నెరవేరుటకు,
'ఒక నూరు సంవత్సరములు సరిగా పట్టునని అనుకొనుచున్నాను.
'ప్రస్తుతము నా కోరిక ఏమంటే, క్రీస్తుమత స్త్రీలు కపటపు లజ్జనం-
'తను వదిలిపెట్టి, సత్క్రియలలో ప్రవర్తించవలసినది" అని చెప్పితిని.—
"నేను కన్నులారా చూచిన ఒక సంగతిని నీకు తెలియ చేయు-
'దును. ఒక క్రీస్తు మత బోధకుడు కొంత పనిమీద ఇల్లు విడిచి
'వెళ్లవలసి యుండెను గనుక, బాల్యములో ఉండిన తన భార్యను
'ఇంటియొద్ద ఉంచి, వెళ్లిపోయెను. అంతట ఈ సంగతి యెరుగని-
'వాడైన అతని స్నేహితులలో ఒకడు అతనిని చూచుటకు, అతని
'ఇంటికి వెళ్లెను. ఆ చిన్నది తన పెనిమిటియొక్క స్నేహితుని
'పులిని చూచినట్టే చూచి, అతనిని చాలా తిట్టి, లోపలి గది-
'లోనికి పారిపోయి, తలుపు వేసుకొనినది. అంతట ఆ స్నేహితుడు

'సిగ్గు పడి, మెల్ల మెల్లనగా తన ఇంటికి వెళ్లిపోయెను. అటుతరు-
'వాత, ఆ చిన్నదాని పెనిమిటి ఇంటికి రాగానే, అతని భార్య తన
'పాతివ్రత్యమును గురించి చెప్పుకొని, మహా పుణ్యాత్మురాలనని అను-
'కొనినది. అప్పుడు దాని పెనిమిటి అతని స్నేహితునితో జగడ-
'మాడి, అతనిని తన ఇంటికి రాకుండ చేసెను. ఇప్పుడు పుల్లనీ!
'ఈ వెట్టి లజ్జ ఆనేది యుక్తమో, అయుక్తమో నీవే విచారించుము,
'బంగాళీ స్త్రీలు ఇంగ్లీషు దొరసానుల వలెనే నడుచుకొంటే, జనులు
'వారిని నిర్లక్ష్యము చేతురు అంటివి. ఒక ఇంగ్లీషు దొరసాని ఇం-
'టికి ఆమె పెనిమిటియొక్క స్నేహితులలో ఎవరైన వచ్చినయెడల,
'ఆమె వారితో హద్దు తప్పక, బహు యుక్తముగా సంభాషించి, కా-
'లము ఇష్టముగా జరిగేలాగున చేయును. ఆ సంభాషణము ముగించిన
'తరువాతను, ఆ దొరసాని ఒక వేళ కూర్చుండి, కొంత సేపు కిన్నెర
'వాయించును. లేక, ఆ దొర చదువ కోరితే, ఆయనకు ఒక పుస్తక-
'మును అంది ఇచ్చి, ఆమె కూర్చుండి, తన కుట్టుపని చూచుకొనుచుం-
'డును. బంగాళీ స్త్రీలు ఈ చొప్పున చేయ నక్కరలేదు గాని,
'వారి ఇంటికి ఎవరైన వస్తే, ఆ ఇల్లాలు మర్యాదతో—నా పెనిమిటి
'ఇప్పుడు ఇంటియొద్ద లేదు, మీరు మరియొకప్పుడు వస్తే, బాగుగా
'నుండునని అతనితో చెప్పవచ్చును గదా? అయితే ఆ వచ్చినవాడు,
'తన ప్రయాణాయాసముచేత దాని ఇంటిలో విశ్రమించ కోరితే,
'అది అతని కొరకు ముంగిటిలో ఒక పీట ఉంచి, అతనికి దాహము
'మొదలైన ఉపచారములు చేసి, తన రాణివాసమునకు వెళ్లవచ్చును.
'ఈ చొప్పున ప్రవర్తించక, మరియొకలాగున జరిగించితే, అది క్రీస్తు
'మతమునకు అనుగుణముగా నుండదు. ఎందుకంటే, మీకు సమయము
'దొరికినప్పుడు, అందరియెడలను, ముఖ్యముగా విశ్వాసము గల ఇం-
'టివారియెడలను మేలు చేయుడి (గలతి. 6: 10.) అని దేవుడు
'చెప్పుచున్నాడు. అయితే ఈ దేశపు జనులు వారి స్త్రీలను ఇండ్లలో

'మూసిపెట్టి యుంచడమువల్ల, వారికి ఇటువంటి సమయము దొరకదు
'గనుక, బంగాళీలు తమవాడుకలవల్ల దేవుని ఆజ్ఞలను వ్యర్థము చేయు-
'చున్నారు. ఈ దేశపు క్రీస్తుమతస్థులు ఇంగ్లీషు దొరసానుల వాడుక-
'లను నిందించితే, నిందింతురు గాని, దేవుడు మెచ్చుకొనిన ఆ భక్తిగల
'స్త్రీలను కూడ నిందింతురా! సమూయేలుయొక్క తల్లి అయిన హ-
'న్నాను జ్ఞాపకమునకు తెచ్చుకో. ఆమె దేవాలయమునకు కుటుంబ
'సహితముగా వెళ్లుచుండేది. ఆ దినములలో జనులు తమ ప్రయా-
'ణములను కాలి నడకచేతనే చేసేవారు. కాబట్టి హన్నా జనానా-
'లో మూయబడి యుండలేదు. అయినప్పటికి, ఆమె దేవునికి ఇష్టు-
'రాలై యుండెను. మరియు సమస్త స్త్రీలలో భాగ్యవతి అయిన
'యేసుయొక్క తల్లియగు మరియ, తన వివాహము కాకముందును,
'అయిన తరువాతను, ఒక స్థలము విడిచి మరియొక స్థలమునకు వెళ్లు-
'చుండేది. మరియు ఆమె యేసుయొక్క శిష్యులతో స్నేహముగా
'నుండెను. లాజరు చచ్చిన తరువాత, యూదులు అతని ఇద్దరు
'అప్పచెల్లెండ్రను ఆదరించుటకు వెళ్లితే, వారు ఆ పురుషులను తమ
'ఇంటిలోనికి చేర్చుకొనిరి. అకులయు అతని భార్య అయిన ప్రిస్కి-
'ల్లయు బాల్యములో ఉన్న అపొల్లో అనే ప్రసంగిని తమ ఇంటి-
'లో చేర్చుకొని, అతనికి దేవుని మార్గమును మరింత సంపూర్ణముగా
'వెల్లడి చేసిరి. మరియు పౌలు రోమాలో నుండిన క్రీస్తు మతస్థులకు
'వ్రాసినది ఏమంటే,—'కెంక్రేయలో నున్న సంఘములో పరిచార-
'కురాలైన ఫేబే అనే మన సహోదరిని మీ పరామర్శకు ఒప్పగిం-
'చుచున్నాను. పరిశుద్ధులకు తగినట్టుగా మీరు ఆమెను చేర్చుకొని,
'ఏ పనిలోనైతే ఆమెకు మీవల్ల సహాయము కావలసియున్నదో,
'అందులో ఆమెకు సహాయము చేయుడి. ఎందుకంటే, ఆమె అనే-
'కులకును నాకును సహాయురాలైయుండెను' (రోమా 16: 1, 2.)
'అనునది. అలాగుననే, పౌలు మరియును ఇరక కొందరు స్త్రీలనును

'స్తుతించుచున్నాడు. పేతురు బందీ గృహమునుంచి విడుదల పొంది
'దినప్పుడు, ఎక్కడనైతే అనేకులు కూడి ప్రార్థించుచుండిరో, అటు-
'వంటి మార్కుయొక్క తల్లి అయిన మరియా ఇంటికి వెళ్లినట్టు వ్రా-
'యబడియున్నది. (కార్యములు 12: 12.) ముందుగా ఆలోచించ
'వలసినది ఏమంటే, ఇప్పుడు ఉదాహరించిన స్త్రీలందరును, స్త్రీలు
'ఉండే గదులలోనే మూయబడియుంటె, తాము చేసిన సత్క్రియలను
'నెరవేర్చకయే పోదురు. కాబట్టి, దేవుడు అంగీకరించిన దానిని ఎవ-
'రును నిరాకరించ కూడదు. బంగాళీ స్త్రీలలో మరి యొక చెడ్డవా-
'డుక యున్నది. అది ఏదంటే, వారు తమ మామల యెడలను బావల
'యెడలను విస్తారమైన లజ్జ చూపుదురు. ఎందుకంటే, ఒక స్త్రీ వివాహ-
'మైన తరువాత దాని పెనిమిటియొక్క తండ్రి దానికి తండ్రి అగును.
'దాని పెనిమిటియొక్క సహోదరుడు దానికి సహోదరుడు అగును.
'అయితే అది వారితో ఒక మాటనైన పలుకక, వారు ఎదుట నున్న-
'ప్పుడు, అది తన ముఖమును కప్పుకొంటే, తండ్రియందును సహో-
'దరునియందును ఉంచ వలసిన ప్రేమ ఇటువంటి స్త్రీలకు ఏలాగున
'కలుగును? అలాగున బొత్తుగా కలుగదు. ఈ సంగతివిషయమై
'చాలా విచారించగా, స్త్రీలలో అనేకులయొక్క లజ్జ పైకి మాత్ర-
'ము ఉన్నట్టు కనుగొంటిని. ఎందుకంటే, వారు తమ పెనిమిట్ల
'ఇండ్లలో నున్నప్పుడు, ఒక విధముగాను, తమ తల్లిదండ్రుల ఇం-
'డ్లలో నున్నప్పుడు, ఒక విధముగాను నడుచుకొందురు. ఒకనాడు
'నేను క్రీస్తు మతస్థురాలైన ఒక యౌవన స్త్రీయొక్క ఇంటికి వెళ్లి-
'నాను. అక్కడ అది తన మామ ఎదుటను, అప్పటిలో అక్కడ
'నున్న అతని స్నేహితుల యెదుటను తన ముఖమును తత్క్షణమే కప్పు-
'కొనినది. నేను అది చూచి చాలా దుఃఖించినాను. అయితే ఆ
'స్త్రీయే కొంత కాలమునకు, దాని పుట్టినింటికి వెళ్లి, అక్కడ ఒక
'హిందూ మనుష్యునితో చాలా కాలముదాక నిలుచుండి, ముఖమును

'కప్పుకొనకయే, అతనితో నవ్వుచు మాటలాడుచుండెను. ఇదిగాక,
'ఫుల్మనీ! స్త్రీలను అరలో ఉంచి, తలుపు తాళము వేసినందువల్ల, ఏమి-
'యు ప్రయోజనము లేదని అందరికిని గోచరమే. ఎందుకంటే,
'వారి మనస్సులు అందువల్ల పవిత్రములు కానేరవు. మనస్సును
'పవిత్రము చేయనేరకపోతే, ఇంటిలోనుంచి కదలకుండడమనేది
'ఏమి ప్రయోజనము! ఈ దేశపు స్త్రీలు జనానాలలో వాడుకొనే
'అపవిత్రమైన పరిహాసములును, స్త్రీలు ఒకరిని ఒకరు తిట్టుకొనే
'తిట్లును ఏ ఇంగ్లీషు దొరసాని నోటనైన రాచాలవు. బంగాళా
'భాషను బాగుగా తెలుసుకొనిన ఒక దొరసానిని నేను ఎరుగుదును.
'ఆమె ఈ దేశస్థులు వాడుకొనే తిట్లయొక్క అర్థము చాలామట్టుకు
'గ్రహించి యుండెను. ఆమె పెనిమిటి ఆమెను అనేక పర్యా-
'యములు ఆ తిట్లయొక్క అర్థము తనకు తెలియ చెప్పుమంటే, ఆమె—
'నన్ను క్షమించుడి, నా నోటూరా ఇటువంటి మాటలను రానియ్య-
'చాలనని చెప్పుచు వచ్చేది. ఫుల్మనీ! బంగాళీ క్రీస్తు మతస్థులు, తమ
'మనస్సులు పవిత్రములుగా నుండేలాగున, ప్రయత్నపడుదురు గాక.
'ఈ పవిత్రత సిద్ధించే సాధనము జనానాలో కనుపించదు. కాని
'సుబోధవల్లను, భక్తులతో ఇష్టాగోష్ఠిగా నుండడమువల్లను సిద్ధించును.
'అపొస్తలయొక్క నిబంధన ప్రకారము మనము నడుచుకొంటే,
'మనము బొత్తుగా అక్రమముగా ప్రవర్తించ జాలము. 'అలాగున
'స్త్రీలు కూడ జడవెంట్రుకలతోనైన బంగారముతోనైన ముత్యముల-
'తోనైన విలువగల వస్త్రములతోనైన కాదుగాని, దైవ భక్తి గలవార-
'మని చెప్పుకొనే స్త్రీలకు తగిన ప్రకారము సిగ్గును స్వస్థ చిత్తమును
'కలవారై, తగిన వస్త్రములతో తమ్ము తామే సత్క్రియలవల్ల అలంకరించు-
'కొనవలెను''' (1 తిమో. 2: 9, 10.) అంటిని.

అందుకు ఫుల్మనీ—"అమ్మా! ఈ నిబంధన ప్రకారము నడుచుకొనే-
'టందుకు ప్రయత్నము చేయుచున్నాను. ఈలాగున సుందరికిని
'బోధించుచున్నాను'' అనెను.

అంతట నేను అన్న మాట;—"ఓ నా ప్రియమైన స్నేహితురాలా! 'నీవు అలాగున చేయుచున్నావని నాకు బాగుగా తెలుసును. మరియు 'నేను ఇప్పుడు పలికిన కఠినోక్తులను నిన్ను గురించి పలికితినని అను'కొనవద్దు. ఎందుకంటే, నీవు ఇతరులు జరిగించుచున్నట్టు జరిగిం'చక, దేవుని ఆజ్ఞలకు లోబడి తిరుగుచున్నావు. ఇందుకు సుందరి 'కలకత్తాకు వెళ్లడమనేది ఒక దృష్టాంతమై యున్నది. ఎందుకంటే, 'అది దేవుని కవచమును ధరించి, సైతానుయొక్క తంత్రములనన్ని'టిని నిరాకరించుటకు సమర్థురాలై యుండునని నీవు గట్టిగా నమ్మి, 'మీ అప్పు తీరగలందులకు దానిని దూర దేశమునకు పంపించితివి. 'ఇదిగో! దేవుడు నీ నిరీక్షణను వ్యర్థమయ్యేలాగున చేయలేదు, ఎం'దుకంటే, నీ పిల్లకు, ఇల్లు విడిచి వెళ్లడమువల్ల, ఏ కీడును సంభవించక, 'అలాగున వెళ్లినందువల్ల, చాలా అభివృద్ధి కలిగే వచ్చినది" అంటిని.

ఫుల్మనీ సంతోష ముఖముతో—"అవును, అమ్మా! దేవుడు మా హస్త'కృత్యమును దయగా స్థిరపరచినాడు" అనెను.

నాడు నేను ఫుల్మనీ ఇంటియొద్ద సుందరితో మాటలాడుచు, ఇంక కొంత కాలము సంతోషముగా గడిపేదాననే. అయితే ఇప్పుడు వివరించిన సంభాషణము కాగానే, నేను రావడమువల్ల సుందరి తన తల్లితో చెప్పుచుండిన కథకు ఆటంకము వచ్చెనని తెలుసుకొంటిని. మరియు ఇప్పుడు ఆ కథను వినుటకు సత్యవతి మిక్కిలి ఆసక్తి కలిగి యుండినట్టు నాకు కనుపించెను గనుక, నేను ఆట్టే ఉండక, అప్పటికి సెలవు తీసుకొని వెళ్లిపోతిని.



# ౧౦. అధ్యాయము.

---

నేను సుందరిని మొట్టమొదట కలుసుకొని, దానితో మాటలాడి యుండడమే కాక, అటుతరువాత చాలామారులు దానిని చూచితిని. కొన్నిమారులు నేను దాని ఇంటికి వెళ్లితిని. కొన్ని మారులు అది నా ఇంటికి వచ్చి, నా ఆయాకు మేజోళ్లు కుట్టుట నేర్పినది. ఆ సమయములలో నేను దానితో మత సంగతులను గురించి చాలా సంభాషించి చూచితే, దాని జ్ఞాన పరిమాణమునకును, దాని బుద్ధికిని ఆశ్చర్యపడితిని. కాబట్టి అది కలకత్తాకు తిరిగి వెళ్లే దినము సమీపించగానే, నేను నిండ దుఃఖపడితిని. ఆ వైద్యుని భార్య దీనికి ఇచ్చే జీతముకంటె, రెండంతలు ఇచ్చి, దానిని నాయొద్దనే ఉంచుకొనుటకు, నేను మిక్కిలి సంతోషింతును గాని, దీని పాత దొరసానికి ఇంత అన్యాయము నేను చేయకూడదనే మాట సరే కదా? సుందరియు ఆమెను వదిలిపెట్టునని నాకు తోచలేదు. ఎందుచేతనంటే, దీని హృదయములో లేశమును కృతఘ్నత అనేది లేదు. సుందరియొక్క దొరసాని మిక్కిలి తెలివియు భక్తియు కలది. మరియు నేను కాపురము ఉన్నచోట నాకు ఇంగ్లీషు స్నేహితులు కొద్దిగా నుండిరి గనుక, నేను బోధకుని ఇంటికి తరుచుగా వెళ్లి, ఆ దొరసాని మాలో ఉన్నంతకాలము, ఆమెను చూడ వెళ్లుచు వస్తిని.

ఒక దినము ఆ బోధకుని ఇంటికి యథాప్రకారము నేను వెళ్లినప్పుడు, ఆ బోధకుడు నన్ను చూడగానే,—"సుఖశాలలో నీ స్నేహితులకు ఒక తొందర సంభవించినది. వారి కుమార్తె అయిన సుందరి వారికి ఎటును తోచని ఇరుకులో వారిని ప్రవేశపెట్టినది" అనెను. (సుఖశాల అనగా సంతోషముగా నుండే ఇల్లు. ఈ పేరు ఫుల్లనీ ఇంటికి మేము పెట్టి యుంటిమి.)

ఆ బోధకుని నవ్వు ముఖము చూచి, సుందరియొక్క కుటుంబమునకు ఎంతో గొప్ప ఆపత్తు సంభవించలేదని నేను తెలుసుకొంటిని. అయినను, నేను ఆశ్చర్యముతో చెప్పిన మాట,—"సుందరి దాని తలిదండ్రులకు కలతపెట్టుననేది బొత్తుగా నమ్మ శక్యము కాదు" అంటిని. అందుకు ఆ బోధకుడు విశేషమేమియు లేదు, వారందరును దాని వివాహమును గురించి తొందరపడుచున్నారు. మన పడుచు కుమార్తెలు, వివాహమును గురించి ఒకానొకప్పుడు తమ తలిదండ్రులకంటె తమకే బాగుగా తెలుసునని, ఏ చొప్పున అనుకొందురో, ఆ చొప్పుననే సుందరియును యోజించి, దాని తలిదండ్రులైన పుల్లనీయు ప్రేమచందును దాని కొసరము వెదకిన పెనిమిటిని బొత్తుగా గ్రహించక యున్నది. అయితే మొదటినుంచి జరిగిన కథ అంతయు మీకు నేను తెలియచేసినంగాని, ఈ సంగతి మీ బోధలోనికి రాదు. కాబట్టి వినుడి. కిందటి బుధవారము నాడు, పరువు గల ఒక పడుచు బాబు, వివాహము నిమిత్తము, ఒక చిన్నదానిని చూచుకొనుటకు, కలకత్తానుంచి ఇక్కడికి వచ్చినాడు. అతడు తన బోధకుని యొద్దనుంచి ఒక సిఫారసు ఉత్తరముకూడ తెచ్చుకొన్నాడు. ఆ యుత్తరములో అతడు పూర్వము బ్రాహ్మణుడు అనియు, మూడు సంవత్సరముల క్రిందట క్రీస్తు మతములో ప్రవేశించినాడనియు, అది మొదలుకొని బహు యుక్తముగా ప్రవర్తించుకొనుచున్నాడనియు, అతడు ఒక ఇంగ్లీషుబడిలో పెద్ద ఉపాధ్యాయుడనియు, అతనికి జీతము నెల ఒకటింటికి ఇరువదియైదు రూపాయీలనియు వ్రాసియుండెను. ఈ యుత్తరమును నేను చదువుకొని, నా సహోదరిని చూచి, 'ఓ లూసీ! ఈ పురుషుడు సుందరికి తగినవాడని నాకు తోచుచున్నది. దానిని నీవు వదిలిపెట్టుటకు నీకు ఇష్టమా' అని అడిగిన, ఆమె—'సుందరియొక్క మేలునకు ఏది ఉపయోగించునో, అందుకు నేను పార్థింతును' అనెను. ఇది నేను విని, ప్రేమచందును పుల్లనీనిని

'పిలిపించి, ఆ యౌవనస్థుడు తెచ్చిన ఉత్తరముయొక్క ముఖ్య తాత్ప
'ర్యమును వారికి తెలిపిన మీదట, ఆ బాబు కూడ అక్కడికి వచ్చెను
'రావడముతోనే, వారు అతనితో చాలామట్టుకు ఆయా సంగతులను
'గురించి, ముఖ్యముగా మతమును గురించి సంభాషించి, అతడు వాస్త-
'వముగా ప్రభువుయొక్క శిష్యుడని కనుగొనిరి. అయినను ప్రేమ-
'చందు—'ఈ మనుష్యునియొక్క భక్తిని గురించి ఆ బోధకుడు ఏమి
'చెప్పుచున్నాడో, ఆ సంగతిని తిరిగి చదివి వినుపించుడి' అనెను.
'అప్పుడు నేను ఆ యుత్తరములో వ్రాసియున్న యొక భాగము చది-
'వితిని. అది ఏదంటే,—'ఈ పడుచువాడు యేసుక్రీస్తుచేతను ఏర్ప-
'డిన కలశమై యున్నాడని నేను రూఢిగా నమ్ముచున్నాను. ఇందుకు
'ఒక స్పష్టమైన దృష్టాంతము ఏమంటే, ఇతడు ఇతరులయొక్క రక్షణ
'నిమిత్తము మిక్కిలి ఆసక్తి కలవాడై యున్నాడు' అనునదే. ప్రేమ-
'చందును ఫుల్మనియును ఇది విని, మిక్కిలి సంతోషించిరి. ఎందు-
'కంటే, వారు చాలా కాలమునుంచి సుందరి కొరకు ఒక భక్తిగల తగిన
'పురుషుని నిమిత్తము వెదకుచుండిరి. అటుతరువాత, నేను చెప్పిన
'ఆలోచన ప్రకారము, ఆ బాబునకు సుందరిని కనుపరచగలందులకు,
'అతనిని వారు తమ ఇంటికి భోజనము నిమిత్తము పిలిచిరి. ఆ ప్రకా-
'రమే, నిన్నటి సాయంకాలమందు అతడు మిక్కిలి చక్కని వస్త్రములు
'ధరించి, ఇక్కడనుంచి ప్రేమచందు ఇంటికి వెళ్లెను. అతడు వెళ్లక
'పూర్వము, సుందరియొక్క భక్తిని గురించి నేను అతనికి తెలిపితిని.
'ఫుల్మనీ తన కుమార్తెతో అతడు ఇంటికి వచ్చే హేతువును చెప్పక,
'ఆ బాబు కలకత్తానుంచి వచ్చి, బోధకుని ఇంటియొద్ద ఉండుచుం-
'డెను గనుక, అతనిని భోజనమునకు పిలిచితిమని మాత్రము చెప్పి
'యూరకుండెను. ఆ బాబు వచ్చి, సుందరియొక్క చక్కదనమును
'చూచి, దానియెడల నిండ ప్రేమ కలవాడై, ఫుల్మనీతో నేను వెళ్లి-
'పోయిన తరువాత ఈ సంగతిని గురించి నీ కుమార్తెయొక్క తాత్ప

'ర్యమును తెలుసుకొనును. నన్ను వివాహము చేసుకొనుటకు దానికి
'మనస్సు ఉంటే, నేను సంతోషముగా వివాహము చేసుకొందును'
'అనెను. అయితే ఈ యుదయమందు సుందరి ఆ పురుషుని పరి-
'ష్కారముగా ఒల్లనని చెప్పినట్టు, దాని తలిదండ్రులు నాకు తెలియ-
'చేసినారు. అందుకు ఆ చిన్నది చెప్పిన హేతువు ఏమంటే, నేను
'అతనిని ఎరుగను. అతడును నా మనస్సు ఎరుగడు గనుక, వివాహ-
'మైన తరువాత, మేము ఉభయులమును సుఖముగా నుందుమో, దుః-
'ఖముగా నుందుమో, నిశ్చయము ఏమియు లేదు అనెను. ఆ చిన్నది
'ఇంతే చెప్పినది కాని, మరి ఏ కారణమును చెప్పలేదు. ఫుల్లని తన
'కుమార్తె ఆడిన మాటలు గ్రహించలేకుండి,—"నా వివాహము కాక-
'ముందు, నేను సుందరియొక్క తండ్రిని గురించి ఏమియు ఎరుగ-
'కుండినను, నాకు శుభము కలుగలేదా! ఒక పురుషుడు అందరిచేతను
'భక్తుడని చెప్పబడ్డ తరువాత, అతనిని ముందుగా చూడ నక్కర-
'లేదు' అని ఫుల్లనీయొక్క అభిప్రాయము" అనెను. అంతట నేను—
"ఈ పర్యాయము మన స్నేహితురాలైన ఫుల్లని తిన్నగా ఆలోచించ-
'లేదని అనుకొనుచున్నాను. మీ అభిప్రాయము ఏమి?" అని అడి-
గినందుకు, బోధకుడు—"ఇంగ్లీషువారిలో వివాహము చేసుకొనే-
'టప్పుడు, భర్తయందును భార్యయందును భక్తిగాక ఇతరమైన అనేక
'గుణములను విచారింతురు. స్త్రీపురుషులు రుచులలో నేమి, గుణము-
'లలో నేమి, కోరికలలో నేమి, వాడుకలలో నేమి ఒకటే అయ్యు-
'న్నవారు ఇతరులకంటె అతి సౌఖ్యముగా జీవింతురు గనుక, మన
'వివాహములలో ఇటువంటి ఐకమత్యమును విచారించడము యుక్తమై
'యున్నది. అయితే బంగాళీ స్త్రీలు, ఇంగ్లీషు స్త్రీల వలెనే వివాహము
'కాకముందు, పురుషులతో పరిచయము చేయలేరు. మరియు ఇటు-
'వంటి పరిచయము చేయలేక పోతే, ఒకరియొక్క మనోభీష్టము
'మరియొకరికి ఏలాగున తెలియవచ్చును? ఈ హేతువును పట్టి నేను

‘చెప్పేది ఏమంటే, బంగాళీ స్త్రీలు తమకొరకు తాము పురుషులను ‘స్వయముగా వరించే కాలము వచ్చే పర్యంతము, వారి తల్లిదండ్రుల- ‘యొక్కయు వారి సంఘముల బోధకులయొక్కయు ఆలోచన ‘ప్రకారము నడుచుకొనవలసినది” అనెను. అందుకు నేను—“అవును, ‘అయ్యా! ఇది వాస్తవమే అయ్యుండవచ్చును. అయినను, ఈ దేశపు ‘స్త్రీలు తమ వివాహముల విషయమై కొంచెము స్వాతంత్ర్యము కను- ‘పరచ సాగించితే, నేను మిక్కిలి సంతోషింతును. అయితే అది ‘ఆలాగున ఉండనిమ్ము. ఈ సంగతిని గురించి ఇప్పుడు ఏమైన ఏర్పా- ‘టు అయినదా!” అని అడిగిన, బోధకుడు అనిన మాట, – “ఫుల్మని ‘దాని కుమార్తెను ఇక్కడికి నేటి సాయంకాలమందు తీసుకొని ‘రాబోవుచున్నది గనుక, అప్పుడు ఏది అయిన ఒక నిష్కర్ష అగునని ‘తోచుచున్నది. నేను సుందరితో చెప్పి, దానిని ఒప్పించేలాగున, ‘ఏ విధముచేతనైన చేతునని ఫుల్మని మిక్కిలి కోరుచున్నదిగాని, అది ‘నేను బొత్తుగా చేయను. ఎందుకంటే, వివాహపు సంగతిలో ‘బాధ్యత పుచ్చుకొనడమనేది అసాధ్యమైన పని. మెట్టుకు సుందరి ‘ఈ చిన్నవానిని ఎందుకు అంగీకరించదో, నేను దానిని అడిగి ‘తెలుసుకొందును. అది చెప్పు హేతువుకంటె, మరియొక హేతు- ‘వుకూడ ఉండవచ్చును అని అనుకొనుచున్నాను” అనెను.

ఈ సంగతి ఏలాగున ముగించునో, అది కనుకోగలందులకు, నేను చాలా ఆశగా నుండి, ఫుల్మని యెప్పుడు వచ్చునో అని నిరీక్షించు- కొనుచు, బోధకుని ఇంటిలోనే యుంటిని. ఒక గంట కాలములో సుందరిని వెంటపెట్టుకొని ఫుల్మనీ వచ్చినది. ఆయా సంగతులను గురించి కొంతసేపు మాటలాడి, ఆ బోధకుడు సుందరిని చూచి,—“చూడు ‘సుందరీ! ఈ బాబును నేను ఎరుగను గనుక, ఇతడు నాకు వద్దని మీ ‘తల్లితో చెప్పితివి. మంచిది అతనితో కొంతమట్టుకు పరిచయము

చేయుము. అప్పుడు ఈ సంగతిని గురించి నీకు తెలియ రావచ్చును.
'అయితే ఇది నీవు చేయకపోతే, అతనిని ఎందుకు వివాహము చేసు-
'కొనవో, ఆ హేతువును నాకు వాస్తవముగా తెలియ చెప్పుము"
అని పలికెను.

సుందరి ఆ బాబుతో పరిచయము చేయనొల్లక, తల వంచు-
కొని, ఇట్లనియె,—"అయ్యా! మీరు నన్ను ఇంత స్పష్టముగా
'అడుగుచున్నారు గనుక, మీతో చెప్పవలసినది ఏమంటే, ఈ పురు-
'షునకు భార్యనై యుండుటకు నాకు మనస్సు లేదు. ఇందుకు ఒక
'కారణము ఉన్నది. అయితే దానిని నేను వెల్లడిచేసితే, ఈ దేశపు
'జనులు నన్ను నిందింతురు. అయితేనేమి, ఈ విషయములో నేను
'ఏమియు అక్రమము జరిగించలేదని నాకు రూఢిగా తెలుసును"
'అనెను. ఇది ఫుల్మనీ విని—"సుందరీ! నీ మనస్సులో ఉన్నదంతయు
'భయములేక తెలియ చెప్పుము. దేవుని ఆజ్ఞలకు ప్రతికూలముగా
'నీవు ఏమియు చేసి యుండకపోతే, నీ తలిదండ్రులు నిన్ను బొత్తుగా
'నిందించరు. ఇతరులు ఏమి చెప్పితేనేమి, వారివల్ల నీకు ఏ విధమైన
'హానియు రానేరదు" అనెను. అంతట నేను—"సుందరీ! నిజమే.
'నీ తలిదండ్రులకు నీవు తెలియచేయక, ఏ మర్మమునైన మనస్సులో
'ఉంచుకొన కూడదు. కాబట్టి నీవు ఈ పురుషునిని ఎందుకు వివా-
'హము చేసుకొనవో, ఆ హేతువును మాకు స్పష్టముగా చెప్పుము"
అంటిని.

సుందరి తల వంచుకొని,—"ఆ కారణము ఏమంటే, నా అభిప్రా-
'యము మరియొక చిన్నవానియందు ఉన్నది. నా దొరసాని అతనిని
'ఎరుగును. అతడు ఆమె ముసలి తోటమాలి కుమారుడు" అనెను.

ఆ జాతి వైద్యుని భార్య ఇది విని,—"హా! సుందరికి చంద్రకాం-
'తుడు అనేవాడు తగిన పెనిమిటి అయియుండును అని నేను ఎన్నో
'పర్యాయములు అనుకొంటిని. అయితే చంద్రకాంతుడు ఇంక

'రెండు మూడు సంవత్సరములు విద్య నేర్చుకొంటే, అటుతరువాత 'వానికి ఏది అయిన ఒక లాభకరమైన మంచి యుద్యోగము దొరక- 'వచ్చునని నా భర్తగారు చెప్పినారు. అయితే సుందరికి ఇప్పుడు 'దాదాపుగా పదియేను సంవత్సరముల ఈడు వచ్చియుండెను గనుక, 'దాని తలిదండ్రులు దానికి ఇంక రెండు మూడు సంవత్సరముల 'పర్యంతము వివాహము లేక ఉంచరు అని నేను అనుకొంటిని'' అనెను.

నేను ఈ చంద్రకాంతుడు ఎటువంటివాడు అని అడిగితే, ఆ దొరసాని—''వాడు మా తోటమాలి కుమారుడే. మొదట వాడు తన 'తండ్రితో కూడ తోటపని నేర్చుకొనుచుండెను. అయితే ఇప్పుడు 'తన తండ్రికంటె ఎక్కువ విద్వాంసుడై యున్నాడు. మూడు సంవ- 'త్సరముల క్రిందట, నా పెనిమిటి మా ముసలి తోటమాలికి ఇంగ్లీషు 'పుష్పముల వివరములను వాటి పోలికలను వ్రాసిన ఒక పుస్తకము 'ఇచ్చి, ఈ దేశములో అద్యే జాతి పుష్పములు అన్నియు తన 'తోటలో వేయించ నున్నాను అని అతనితో చెప్పెను గనుక, ఆ 'పుస్తకములో వ్రాసియున్న పుష్పముల పోలికల నన్నిటినిని జాగ్ర- 'త్తగా పరిశీలన చేసి, వాటిలో ఏయే పుష్పములు ఈ దేశ పుష్పము- 'వలె నున్నవో, వాటిని కనుపరచవలసినదని మాలికి ఆజ్ఞాపించెను. 'చంద్రకాంతుడు ఆయా చెట్ల పేరులను గుణములనును తీయకుండ 'విచారించుకొనుచుండెను గనుక, ఈ పుస్తకమును చేత తీసుకొని, 'ఇంటిలో కూర్చుండి, అందులో నుండే పోలికల నన్నిటిని వ్రా- 'య నారంభించి, అటుతరువాత తాను వ్రాసిన వాటిని తెచ్చి, నా 'పెనిమిటికి చూపెను. ఆయన వాటిని చూచి, ఆశ్చర్యపడెను. 'ఎందుకంటే, అంతకు పూర్వము ఆ చిన్నవాడు చిత్తరువు వ్రాసే విద్య 'నేర్చుకొనియుండలేదు. వాడు వ్రాసిన చిత్తరువులు నీలి రంగు- 'తో ను లక్కుకతోను వ్రాసి యుండినప్పటికి, అవి ఎంతో వికారము-

‘గా కనుపించలేదు. కాబట్టి నా పెనిమిటి చాలా సంతోషించి,
‘చంద్రకాంతునకు వృక్ష శాస్త్రమును నేర్ప నిశ్చయించెను. చంద్ర-
‘కాంతుడు స్వభావ సిద్ధముగా మిక్కిలి ప్రవీణుడు. మొదట వాడు
‘వారములో రెండు పర్యాయములు వృక్ష శాస్త్రమును బొమ్మలు వేయు-
‘టను నేర్చుకొనుటకు, నా పెనిమిటి యొద్దకు వచ్చేవాడు. అటుతరు-
‘వాత, ప్రతివైద్యుని ఇంటిలోను ఉండే మనుష్య శరీరముయొక్క ఆయా
‘భాగములను గురించిన ప్రతి రూపములను చూచి, వాటివలెనే తా-
‘నును క్రొత్తగా వ్రాయ నారంభించి, మనుష్య శరీరముయొక్క ఆయా
‘భాగములను గురించిన సంగతులను నేర్చుకొన సాగెను. నా పెని-
‘మిటి ఆ చిన్నవాని శ్రద్ధ చూచి, వానికి వైద్య శాస్త్రము ఉపదేశించ
‘నారంభించెను. మరియు వానికి ఇప్పుడు కలుగుచుండే నేర్పును
‘పట్టి విచారిస్తే, రెండు మూడు సంవత్సరములలోగా కంపెనీవారు
‘ఏర్పరచిన ఔషధ శాలలలో, ఒకదానికి పై అధికారిగా, నెలకు
‘నూటయేబది రూపాయీల జీతము గల పని వానికి దొరకవచ్చు-
‘నని నా పెనిమిటి అనుకొనుచున్నాడు. చంద్రకాంతుడు విద్యా
‘ప్రావీణ్యము కలిగియుండుట మాత్రమే కాదు గాని, వానికి మతా-
‘భిమానము చాలా కలదు. మరియు వాడు తన ముసలి తలిదం-
‘డ్రులమీదను నిండుదయగా నుండినందున, వారు అతనికి ప్రాణభా-
‘వమై యుండిరి" అని పలికి, ఆ దొరసాని సుందరిని చూచి,—"సుం-
‘దరీ! ఇదంతయు అటుండనిమ్ము. చంద్రకాంతునినే కాని, అతని
‘మంచి గుణములనే కాని, నీవు ఏ చొప్పున తెలుసుకొన గలిగినా-
‘వ్వో, నేను ఎరుగను, ఎందుకంటే, నీ యెదుట వానిని నేను ఎప్పు-
‘డును స్తుతించలేదు. మరియు నీవు వానితో మాటలాడకూడదని
‘చెప్పియుంటిని. కాబట్టి వానియెడల నీకు కలిగియున్న ప్రేమ
‘ఏ చొప్పున పుట్టినదో, ఆ సంగతి నాకు తెలుపుము" అనెను. అం-
దుకు సుందరీ—"అమ్మా! వానితో నేను ఎప్పుడును మాటలాడలేదు,

'సత్యమే, కాని వానితల్లి నాతో తరుచుగా తన కుమారుడు నన్ను
'తప్ప మరి ఎవరినిని వివాహము చేసుకొనడని చెప్పుచు వచ్చెను.
'మరియు ఇదిమొదలుకొని మూడు సంవత్సరములకు చంద్రకాంతుని
'వివాహము చేసుకొందునని నన్ను ప్రతిజ్ఞ చేయుము అని కోరెను.
'అయితే నేను నా తలిదండ్రులను అడుగకుండా, ఏ ప్రతిజ్ఞనైన చే-
'యను అని చెప్పినాను. నేను కలకత్తాకు వెళ్లకముందు, ఈ సంగ-
'తిని గురించి నా తల్లితో మాటలాడవలెనని యుంటిని గాని, ఆమె
'అంత కాలము వివాహము లేకుండ, నన్ను ఉండనియ్యదనే భయ-
'ముచేతను ఇదివరకు ఆమెతో చెప్పుటకు ధైర్యము లేకున్నాను" అని
చెప్పెను.

బోధకుడు ఇది విని,—"ఆలాగుననైతే, సుందరీ! నీవు చెప్పిన
'మాటలవల్లనే ఈ బాబును నీవు ఎంత ఎరుగుదువో, చంద్రకాం-
'తుని కూడ అంతే ఎరుగుదువు అని కనుపడుచున్నది" అనిన, సుందరీ—
"అయ్యా! ఆలాగున కాదు. నేను చంద్రకాంతుని అనుదినమును
'చూచుచున్నాను. అతని తలిదండ్రులయెడల అతనియొక్క ప్రేమ
'గల ప్రవర్తనమును గురించి నేను ఎరుగుదును. మరియు వాని అధి-
'కమైన మతాభిమానమును గురించి కూడ నేను ఎరుగుదును. ఎందు-
'కంటే, అతడు ప్రతి సాయంకాలమందును ఒక చింత చెట్టుక్రింద
'కూర్చుండి, హిందూ నవుకర్లతోను తురక నవుకర్లతోను యేసు
'క్రీస్తును గురించి చెప్పి, వారికి ఉపదేశించుచున్నాడు. ఒక పర్యా-
'యమే అతడు నాతో ఒకటే మాట పలికి చెప్పినాడు. నా దొర-
'సానియొక్క శిశువు చచ్చిన దినమందు, నేను ఏడ్చుచు, చావు పెట్టె-
'యొద్ద నిలుచుండి యుంటిని. అప్పుడు చంద్రకాంతుడు లోపలికి
'వచ్చి, నా దగ్గర నిలుచుండి,—'సుందరీ! ఏడువ వద్దు. నీయొక్క బల-
'ములేని చిన్న మొక్కను దేవుడు తన స్వకీయపు తోటలోనికి తీసుకొని
'వెళ్లి, అక్కడ అది వృద్ధి పొంది, పుష్పములతోను పండ్లతోను నిండి

'యుండేలాగున, దానిని నాటెను. మన యజమానుడు ఇంటికి ఉత్త-
'రపు దిక్కున నున్న పెద్ద తోటలో ఏది అయిన ఒక మిక్కిలి బలహీన-
'మైన మొక్కనే కాని, లేక శ్రేష్ఠమైన మొక్కనే కాని చూస్తే, నా
'తండ్రిని పిలిచి, దక్షిణపు వైపున నున్న చిన్న తోటలో ఈ మొ-
'క్కను తీసి నాటుము. ఎందుకంటే, దీనిని నేనే చూచుకొని, దీని
'సువాసనవల్ల సంతోషింతునని చెప్పును. అలాగుననే, దేవుడు నీ చిన్న
'పిల్లను ఇంతకంటె మంచి ప్రదేశములో నాటుటకు, దానిని తీసు-
'కొని పోయెనని చెప్పెను'" అనెను.

ఆ జాతి వైద్యుని భార్య ఇది విని,—"హా! ఇది ఎంత సుందర-
'మైన ఉపమానము!" అనగానే, ఆమె కన్నులు కన్నీరుతో నిండి
యుండెను. ఎందుకంటే, ఎనిమిది నెలల క్రిందట, ఆమె సమాధిలో
ఉంచిన తన చిన్న కుమార్తెను జ్ఞాపకము చేసుకొనెను.

అప్పుడు సుందరి ఇట్లనియె,—"అది వాస్తవముగా సుందరమైన
'ఉపమానమే అయ్యున్నది. ఆ దినము మొదలుకొని నేను మును-
'పటికంటె ఎక్కువగా చంద్రకాంతుని గురించి భావించితిని. అతడు
'ఈ చొప్పున మాటలాడినప్పుడు, నా ప్రియురాలైన తల్లిని ఆ క్షణమే
'స్మరించితిని. ఎందుకంటే, ఆమె నిరంతరమును పుష్పములను పట్టి
'అతీయమైన సంగతులను బోధపరుచుకొనుచుండును" అనెను.

అప్పుడు బోధకుడు—"ఫుల్లనీ! ఇది అంతయు వినుచున్నావు గదా.
'ఇందుకు ఏమి చెప్పుచున్నావు?" అని అడిగెను. ఫుల్లనీ—"అయ్యా!
'నా చిన్నది ఇంత భక్తిగల పురుషునికొరకు రెండు మూడు సంవ-
'త్సరముల మట్టుకు తాళియుండే పక్షమందు, నాకు సమాధానమే.
'అయితే అప్పటికి సుందరి పదునెనిమిది సంవత్సరముల ఈడు కలదై
'యుండును. అయినను ఇప్పుడే దీని వివాహ విషయమై చంద్ర-
'కాంతునితో ఏదైన ఏర్పాటు కలిగి యుంటే, అటుతరువాత, కొంత
'వ్యవధానము అయినందువల్ల ఏమియు హానిలేదు" అని మారు మాట

పలికెను. ఆ వైద్యుని భార్య అన్నమాట;—"చూడు, ఫుల్లనీ! చంద్ర 'కాంతుడు తన్ను వివాహము చేసుకొనుటకు కోరుచున్నాడని నీ 'కుమార్తె చెప్పుచున్నది. అలాగునయినైతే, నేను ఇంటికి తిరిగి వెళ్ల- 'గానే, ఆ చిన్నవానితోను అతని తల్లిదండ్రులతోను మాటలాడి, 'అన్ని సంగతులును పరిష్కరించుదునని నీ యెదుటనే మాట ఇచ్చు- 'చున్నాను. మరియు ఆ చిన్నవాడు బ్రతికి యుంటే, తన చేత 'నైనంత మట్టుకు తన ఒడంబడికను నెరవేర్చుకొనునని అతని విష- 'యమై రూఢిగా చెప్పగలను" అనెను.

అంతట సుందరి ముఖోల్లాసముతో ఫుల్లనీని చూచి,—"చూడు 'అమ్మా! నేను చెప్పబోవు సంగతి ఆలోచనములోనికి తెమ్ము. యౌ- 'వన స్త్రీలకు, వారి వారి పెనిమిట్లయొక్క తలిదండ్రులవల్ల, చాలా 'శ్రమ కలుగును. ఎందుకంటే, వారు వీరియెడల తరుచుగా కాఠి- 'న్యము జరిగింతురు. అయితే చంద్రకాంతునియొక్క తలిదండ్రులు 'భక్తి కలవారు. నేను కలకత్తాకు వెళ్లినది మొదలుకొని, వారు నా 'యెడల నిండ దయ చూపినారు గనుక, ఇక మీదట వారు దుఃఖ- 'పెట్టుదురని అనుకొనుటకు, నాకు ఏ హేతువును కనుపించలేదు. 'కలకత్తానుంచి వచ్చిన బాబుకు భార్యను కావడముకంటె, చంద్ర- 'కాంతుని వివాహము చేసుకొనుట ఉత్తమమైన సంగతి అయినందుకు 'మరియొక హేతువును నీకు కనుపరచ గలను. ఈ మనుష్యుడు నా 'ముఖము మాత్రము చూచి, నన్ను వివాహము చేసుకొన కోరుచు- 'న్నాడు. అయితే ఇది యుక్తము కాదు. ఇది భార్య నిమిత్తము 'జూదమాడుటగా కనుపడుచున్నది. ఇటువంటి ఆటవల్ల మంచిదే 'కలుగునో, చెడ్డదే కలుగునో, ఎవరికి తెలుసును! కాబట్టి మను- 'ష్యుడు ఒక చిన్నదానియొక్క మనోగుణములను తెలుసుకొనిన 'తరువాతను, దానిని వివాహము చేసుకొనుట ఉత్తమమై యున్నది. 'చూడుము. మా దొర తోటమాలి కుమారుడు ఈ పరిశీలన చేసి

'యున్నాడు. ఎందుకంటే, ఒక సంవత్సరము మట్టుకు నా ప్రవ
'ర్తనమును ఒక దినము తప్పక కనుపెట్టిన తరువాత, నన్ను వివా
'హము చేసుకొనన కోరెను. ఇప్పుడు అతడు నన్ను వివాహము చేసు
'కొంటే, నా సుగుణములును దుర్గుణములును అన్నియు అతనికి తెలిసి
'యున్నవి గనుక, నాయొక్క లోపా లోపములను గురించి అతడు
'ఏమియు చెప్పలేకుండును."

అంతట మేమందరమును—"సుందరీ! నీవు ఈ యంశమందు క్రమ-
'ముగా విచారించినావు" అంటిమి. అటుతరువాత, ఫుల్లనియు దాని
కుమార్తెయు సెలవు పుచ్చుకొని, వెళ్లిపోయిన మీదట, నేను బోధ-
కుని చూచి,—"ఇప్పుడు మీరు సుందరి మీదను నేరము మోపగలరా?"
అని అడిగిన, ఆయన—"బొత్తుగా నేరము మోపలేను. అది నిష్కప-
'టముగా క్రమమైన దానిని జరిగించెను గనుక, దానియందు ఏమి-
'యు నేరము లేదు. బంగాళీ క్రీస్తు మతపు టాడ పిల్లలందరును సుం-
'దరివలెనే యుంటే, వారు ఇంగ్లీషు స్త్రీల వలెనే, వివాహముకాక పూ-
'ర్వము, తమ పెనిమిట్లను వరించ వచ్చును" అనెను.

ఆ జాతి వైద్యుని భార్య ఇట్లనియె,—"హా! ఈ ప్రియురాలైన చిన్నది
'నాతో కూడ ఉండును అనే సంగతిని పట్టి, ఎంతో సంతోషించు-
'చున్నాను. ఇది చంద్రకాంతుని వివాహము చేసుకొనిన తరువాత,
'వారుభయులకును నా స్వకీయావరణములోనే ఒక ఇల్లు కట్టించి,
'వారిని అందులో ఎప్పటికిని ఉంచుదును" అనెను. అంతట ఆ
బోధకుడు—"మంచిది. మీరందరును సంతోషించుచున్నారని నాకు
'తెలుసును. అయితే మీలో ఎవరును నా యౌవన స్నేహితుని
'విషయమై ఆలోచించక యున్నారు. అతడు భార్య నిమిత్తము దూర
'దేశమునుంచి వచ్చి యున్నాడు. ఇప్పుడు అతనిని ఉత్త చేతులతో
'పంపించవలసి యున్నది గనుక, నేను అతనితో ఏమి చెప్పి పంపించి
'వేతును!" అనెను.

అందుకు నేను—"అతనికి ఒక ఉపాయము చూపించ గలను. ఈ బాబు విధవను వివాహము చేసుకొనుటకు కోరిన, రాణిని చేసుకొనవచ్చును. సుందరి తప్ప, రాణివంటి చిన్నది అతనికి ఎక్కడను దొరకదు" అనిన, బోధకుడు ఈ ఉపాయమును విని, సంతోషించి,—"అవును, మీరు బాగుగా పలికితిరి. రాణిని ఇంతకు పూర్వము నేను తలపెట్టలేదు. అది బాబుకు యుక్తమైన భార్య కావచ్చును. ఎందుకంటే, అది మంచి తెలివి గల చిన్నది. మరియు అది ఇప్పుడు నిజమైన క్రీస్తు మతస్థురాలని నేను కనుగొని యున్నాను. దాని మొదటి పెనిమిటియొక్క దుర్మార్గతవల్లను అవివేకమువల్లను, అది అతనితో కూడ సుఖముగా నుండలేక పోయెను. అయితే దానికి తగిన పెనిమిటి దొరికితే, మునుపు సంభవించిన శ్రమ ఇప్పుడు సంభవించకుండును. ఈ బాబు దానిని వివాహము చేసుకొంటే, వారు ఉభయులును బహు సుఖముగా నుందురు" అని అనుకొనుచున్నాను అనెను.

ఆ ప్రకారముగానే, ఆ బాబుకు రాణిని గురించి తెలుపబడెను. అంతట అతడు దానితో రెండు మూడు పర్యాయములు సంభాషించి, దానిని వివాహము చేసుకొందునని తన కోరికను తెలిపినప్పుడు, రాణి సంతోషముగా ఒప్పెను. ఎందుకంటే, దాని దుర్మార్గపు ఉత్త దానిని చాలాగా బాధించేది అయి యుండెను. బాబు వచ్చిన నెల దినములకు, ఆయనకును రాణికిని వివాహము అగునని, దేవాలయములో మూడు ఆదివారములు వరసగా ప్రకటన చేయబడెను. అప్పుడు ఎవరును అందుకు ఆక్షేపించలేదు గనుక, ఆ తరువాతి గురువారమునాడు, వారి వివాహమును గురించి నిశ్చయము అయినది. అయితే ఒక అంశమును పట్టి మాత్రము ఒక వాదము జరిగినది. రాణి సుమతి అనే తన చిన్న పిల్లను తనతో కూడ కలకత్తాకు తీసుకొని వెళ్ల గోరెను. అయితే ఆ చిన్నదాని తండ్రియైన మధువు చచ్చిపోయేటప్పుడు, తన పిల్ల ఇక్కడి బోధకునియొక్క భార్య పెట్టిన బడికి

పంపబడ వలెనని చెప్పి యుండెను గనుక, రాణియొక్క అత్త ఆ పిల్ల తనదనియు, దానిని రాణి తీసుకొని వెళ్లకూడదనియు అతి రోష-ముతో పలికెను. అంతట రాణి మిక్కిలి దుఃఖపడి, రోదనము చేయ నారంభించెను. అప్పుడు ఫుల్మనీ దాని అత్తను చూచి,—"మధువు ఆ 'పిల్లను నాకు ఒప్పగించి, ఆ పిల్లకు మతోపదేశము కాగలందులకు, 'బోధకుని భార్య పెట్టిన బడికి దానిని పంపించుమని నాతో చె-'ప్పెను గనుక, మధువు తన పిల్ల భక్తి కలిగి యుండేటందుకే కోరెను 'అని స్పష్టముగా కనుపడుచున్నది గనుక, ఈ పిల్ల యెక్కడ నుండి-'నను, ఏ బడికి వెళ్లినను, భక్తిగలది మాత్రము అయ్యేంటే, అంతే 'చాలును. ఇది అంతయు నెరవేరుటకు ఈ పిల్ల తన తల్లితో కూడనే 'యుంటే, ఉత్తమమై యుండునని నాకు తోచుచున్నది. ఎందుకంటే, 'మధువు చచ్చినప్పుడు, రాణి మత విషయమై అశ్రద్ధగ నుండెను. 'అయితే ఇప్పుడు దానికి మతమునందు మిక్కిలి ఆసక్తి కలిగియున్నది 'గనుక, అది తన పిల్లను యుక్తమార్గమునందు నడిపించుటకు ప్రయ-'త్నము చేయక మానదు" అని చెప్పెను. ఫుల్మని చెప్పినదానికి మేము అందరమును హర్షించిన మీదట, చిన్ని సుమతి దాని తల్లితో కూడ కలకత్తాకు వెళ్లేటట్టు నిశ్చయింపబడెను. రాణియొక్క అత్త ఇందుకు నిండ కోపగించుకొనెను. అయితే ఆమెను ఆదరించుటకు, రాణి తన మొదటి పెనిమిటియొక్క ఇల్లును భూమియు సమస్తమును ఆమెకు ఇచ్చి, ఆమెతో—"నీవు బ్రతుకునన్ని నాళ్లును, ఈ భూమియొక్క 'ఫలసాయము అనుభవించుము. అయితే నీవు చచ్చేటప్పుడు, దానిని 'నీ మనమరాలికి ఇచ్చివేయుము. నేను ఈ భాగ్యములో రవ్వంతైనను 'ముట్టుకొనను" అని చెప్పెను. రాణి చేసిన ఈ యుపకారమువల్ల, దాని అత్తయొక్క జీవిత కాలమంతయు దానికి ఏమియు కొదువ-లేకుండెను.

ఈ పుస్తకమును చదివేవారు నా ఆయానుగురించి విని, చాలా కాలము ఆయెను. అయితే నేను ఇప్పుడు వ్రాయవలసినది యేమం-

టే, అది చాలా కాలమునుంచి భక్తిగా ప్రవర్తించి, ఇప్పుడు స్నానము పొంద గోరెను గనుక, రాణి వివాహమును ఆయా స్నానమును ఒక్క దినమందే కావలసినదని బోధకుడు నిశ్చయించెను. హా! ఆ దినము నాకు ఎంతో సంతోషకరమైన దినము. నాకు మాత్రమే కాక, ఆ క్రీస్తు మతస్థుల పల్లెలో నుండినవారికందరికిని ఆ దినమందు సంతోషము కలిగెను.

రాణికి తలిదండ్రులు లేనందున, దాని నిమిత్తము ఒక వివాహపు విందు చేయ గోరి, నేను బోధకునితో — "మీ సంఘపు జనులు 'కొంచెముగా ఆ దినమందు విందారగించితే, మీకు అనిష్టముగా 'నుండునా!" అనిన, అందుకు ఆయన—"నిండ ఇష్టమే. నాకు ఎం- 'దుకు అనిష్టముగా నుండవలెను! మన ప్రభువు తానే ఒక వివాహపు 'విందుకు వెళ్లియుండెను. కాబట్టి, మీరు నా జనుల నిమిత్తము విందు 'సిద్ధము చేసితే, మంచి పనే. వారి సంతోషమును చూచి, నేనును 'సంతోషింతును. అతి దరిద్రులైనవారును అప్పులపాలైయున్న వా- 'రును తమ వివాహకాలమునందు విందుచేయుటకే కాని, లేక తమ 'పెండ్లి కూతుండ్ల కొరకు నగలు కొనుటకే కాని, అప్పుచేసిన పక్ష- 'మందు, అటువంటివారి యెడలనే నాకు నిండ అనిష్టముగా నుండు- 'ను" అని పలికెను.

నేను ఇది విని, కావలసినదంతయు కొనుటకు, ప్రేమచందుకు సొమ్ము ఇస్తిని. అప్పుడు వివాహదినము రాగానే, పల్లె నడుమ ఒక శుభ్రమైన చోట ఎరుపు తెలుపు గల ఒక చాందినీ బట్ట కట్టబడెను. అంతట నేను కేలమీద పఱచుటకు, కొన్ని చాపలు పంపిస్తిని. ఫుల్మనీ- యొక్క పిల్లలును చిన్నవాడైన నవీనుడును సొగసైన పుష్పములతోను ఆకులతోను తోరణములు కూర్చి, ఆ చాందినీ చుట్టును కట్టిరి. నవీనుని విషయమై నేను చెప్పవలసినది ఏమంటే, వాడు చదువులోను వ్రాతలోను నిండ ప్రవీణుడు కాకపోయినను, వాడు

క్రమముగా మిక్కిలి మంచి చిన్నవాడై, మేటి పని బాగుగా నేర్చు-
కొనెను. ఫుల్మనీయు ఇంక నలుగురు స్త్రీలును వివాహమునకు వెళ్ల-
లేదు. ఎందుకంటె, వారు సూర్యోదయము మొదలుకొని, విందుకు-
గాను పని పాటలలో తిరుగుచుండిరి. పదకొండు గంటలకు ఆయాను
నాతో కూడ బండెక్కించుకొని, రాణిని దేవాలయమునకు తీసుకొని
వెళ్లే నిమిత్తము, క్రీస్తు మతపు పల్లెకు వెళ్లితిని. రాణి గులాబీ రంగు-
గల ఒక మిక్కిలి సొగసైన పట్టు చీరెను కట్టుకొని, ఫుల్మనీయొక్క
ఇంటిలో నా కొరకు కాచుకొని, సిద్ధముగా నుండెను. అది నా
బండి చూడగానే, నవ్వుచు బయటికి వచ్చెను. చూపులో రాణి
సుందరియంత చక్కనిది కాకపోయిన, ఆ దినమందు దానిని చూచిన
వారందరును అది మిక్కిలి చక్కనిదని చెప్పి, దానిని అన్ని విధముల-
చేతను స్తోత్రము చేసిరి. నా నమ్మకమైన ఆయా దోవపొడుగునను
ఏడుచుచునే యుండెను. అయితే దాని కన్నీరు దుఃఖమువల్ల పుట్టిన
కన్నీరు కాక, దేవునియెడల దానికి కలిగి యుండిన కృతజ్ఞతవల్లనే
పుట్టినవి. అది ఒక పర్యాయము తనకు తానే బిగ్గనగా—"ఓ దేవా!
'దౌర్భాగ్య పాపాత్మురాలనైన నాయెడల ఎంత కనికరము చూపి
'యున్నావు" అని పలికెను. మరియు మార్గములో రెండు మూడు
పర్యాయములు—"నా తండ్రీ! నిన్ను స్తుతించుచున్నాను" అని చెప్పు-
కొనుచు వచ్చెను.

మేము దేవాలయము చేరగానే, బోధకుడు పెండ్లి కొడుకును
వెంట పెట్టుకొని వచ్చి, మా కొరకు కూర్చుండి కాచుకొని యుం-
డగా, కనుగొంటిమి. అప్పుడు ఆయన మొదట ఆయాకు స్నానము
ఇచ్చి, అటుతర్వాత రాణిని వివాహము చేసెను. అది అయిన తరు-
వాత, క్రీస్తు మతపు పల్లెకు తిరిగి వస్తిమి. వివాహపు విందు సిద్ధము
కాగానే, పల్లెలో నుండిన జనులందరును చాందినీ క్రింద కూర్చుండి,
భోజనము చేయ నారంభించిరి. వచ్చినవారి ముఖములన్నియు సం-
తోషముతో ప్రకాశించినవి. మరియు అక్కడ ఒక దుఃఖకరమైన

ముఖము సహా కనుపడలేదు. విందు అయిన తరువాత, వారు ఒక వివాహ కీర్తనమును పాడిరి. అటుతరువాత, బోధకుడు లేచి నిలుచుండి, క్రొత్తగా స్నానము పొందిన క్రీస్తు మతస్థురాలి కొరకును పెండ్లికొడుకు పెండ్లికూతురి కొరకును దేవుని ప్రార్థించెను. అంతట రాణియు దాని పెనిమిటియు ఫుల్మనీ ఇంటికి వెళ్లిరి. తల్లి దాని కుమార్తెయెడల ఏలాగునసో, ఆలాగునసే ఫుల్మనీ రాణియెడల ప్రవర్తించెను గనుక, ఇప్పుడు వివాహము చేసుకొనినవారు కలకత్తాకు వెళ్లకముందు, రెండు మూడు దినములు తనతో కూడ ఉండేలాగున, ఫుల్మనీ కోరెను. రాణి సెలవు పుచ్చుకొనేటప్పుడు, దానితో ఏకాంతముగా కొన్ని బుద్ధి మాటలు నేను చెప్ప కోరి, దానితో కూడ ఫుల్మనీ ఇంటికి వెళ్లితిని. గదిలో ఉభయులమును చాలా కన్నీరు విడిస్తిమి. చివరకు దానితో ప్రేమగల మాటలను అనేకము పలికి, వచ్చి, బండి త్వరగా ఎక్కుచుండగా, కరుణ ఒక మంచి దసరీ చీరెను కట్టుకొని, నా యొద్దకు వచ్చి,—"ఓ యమ్మా! 'కొంచెము తాళుడి. 'నా మంచి అదృష్టమును గురించి మీకు చెప్పుదును వినుడి. మరి-'యు ఓ ఫుల్మనీ! నీవును చూడు. నవీసుని తండ్రి నాకు ఈ చీరెను 'తెచ్చి ఇచ్చినాడు. దీని వెల నాలుగు రూపాయీలు. మేము 'సొమ్ము కొరకు అప్పుచేయ నక్కరలేక పోయెను. ఎందుకంటే, నా 'పెనిమిటి అనుదినమును పనికి వెళ్లి, నెలకు ఎనిమిది అయిన, పది 'అయిన రూపాయీలు సంపాదించుచున్నాడు. నేడు దేవాలయము-'నకు వెళ్లేటప్పుడు, ఆయన ఈ చీరె బయటికి తెచ్చి, కనుపరచి,—'కరుణా! దీనిని నీవు పుచ్చుకొనుము. స్త్రీలు అందరును నేడు 'మంచి బట్టలను ధరింతురు. నీవు మురికి బట్టలు కట్టుకొని వెళ్ల 'నేల? నాకు శక్తి యుంటే, పది రూపాయీలు చేసే చీరెను నీకు 'ఇత్తును. ఎందుకంటే, నీవు దానికి తగియున్నావు'" అనెను. అంతట 'కరుణ మిక్కిలి యుల్లాసముతో చెప్పసాగినది యేమంటే,—"నాకు 'పది రూపాయీల చీరె యెందుకు? ఆయన ప్రేమగల మాటలు నా చెవిని పడుటే చాలును. ఇది గాక, ఈ చీరె బాగుగానే యు

న్నది. నేను వివాహము చేసుకొనినది మొదలుకొని, నేటి వరకు పట్టు వస్త్రములను ధరించి యుండలేదు. అయితే ఇప్పుడు ఈ మంచి దశ నాకు పట్టినది" అని పలికెను. ఈ జరిగిన చిన్న సంగతివల్ల విచారించగా, కరుణ తన శాంతమైన ప్రవర్తనమువల్లను చల్లని మాటలవల్లను, తన దుర్మార్గపు పెనిమిటిని సంపూర్ణముగా లోబడ చేసుకొనెనని నాకు స్పష్టమాయెను. హా! ఈ పుస్తకము చదివేవారలారా! మీలో ఎవరికైన దులాబీ పెనిమిటి యుంటే, ఆ స్త్రీ కరుణయొక్క దృష్టాంతమును అనుసరించుగాక.

పుల్మనీ తన స్నేహితురాలి మాటలు విని, సంతోష పూర్వకముగా పరలోకము వైపునకు కన్నులెత్తి,—"ప్రభువు నామము స్తుతింపబడుగాక; ఎందుకంటే, ఆయన మనుష్యుల హృదయములను భేదించుచున్నాడు" అని పలికెను. నేను సంతోషముచేత ఏడ్చి, ఒక మాట అయిన చెప్పలేకపోతిని. అయితే కరుణ చెప్పినది ఆలకించి, ప్రభువునెడల నా హృదయము కృతజ్ఞతతో నిండి పొర్లినది. అటుతరువాత నేను బండెక్కి, ఇంటికి వెళ్లి, ఆ దినము జరిగినది అంతటికిని దేవుని స్తుతించితిని.

ఈ క్రీస్తు మతస్థులతో విడువక ఇంక రెండు సంవత్సరముల పర్యంతము ఇష్టగోష్ఠిగా నుంటిని. అటుతరువాత, కుటుంబ సహితముగా ఆ ప్రదేశము విడిచి, మరియొక ఊరికి వెళ్లవలసి వచ్చెను. వెళ్లేటప్పుడు, వారును నేనును దుఃఖించితిమి. అయితే ఈ లోకపు జనుల వలెనే మేము దుఃఖించలేదు. మేము ఈ లోకములో విడిపోయినప్పటికిని, దేవుని సింహాసనముయెదుట తిరిగి కలుసుకొని, కలకాలము ప్రభువును గూర్చి స్తుత్యారాధనములతో కూడుకొనిన కీర్తనములను పాడుకొనుచుందుమని మాకు గట్టి నమ్మకముండెను.

కరుణ చివరకు నిజమైన క్రీస్తు మతస్థురాలాయెను. అయితే అది తన మతమందు ఎక్కువ ఉల్లాసముగా నుండలేకపోయెను. ఎందుకంటే, అది తన పెద్ద కుమారుని మరణమును గురించి తరుచుగ తలం-

చుకొనుచుండెను. ఒకానొకప్పుడు, ఆ చిన్నవాని చావును పట్టి, తన్ను దేవుడు అంగీకరించడని అనుకొనుచుండునది. అటువంటి సమయములలో దేవుని వాక్యమును చదువడమువల్లనే దానికి ఆదరణ దొరకుచు వచ్చినది. మరియు ఒకానొకప్పుడు, అయిదు ఏడు గంటలమట్టుకును, ఒక మచ్చున కూర్చుండి, చదువుకొనుచుండునని ఫుల్మనీ నాతో చెప్పెను. సుందరి, తాను వరించిన పెనిమిటిని వివాహము చేసుకొని, ఇప్పుడు నిండ సంతోషముగా నుంటున్నదని కొన్ని దినముల క్రిందట వింటిని. ఈ సంగతి నాకు తెలియచేసిన మనుష్యుడు, సుందరికి ఇద్దరు కుమారులును ఒక కుమార్తెయు కలిగిరి అనియు, దాని తల్లి ఏలాగుననో, అదియు ఆలాగుననే తన పిల్లలకు దేవుని సంగతులలో ఉపదేశించి, నీతి మార్గములలో వారిని నడుపుచు వచ్చుచున్నదనియు చెప్పెను.

ఇప్పుడు ఈ పుస్తకమును చదివే వారితో ఒక మనవి మాత్రమే చేసుకొనుచున్నాను. ఎవరిని గూర్చియైతే మీరు చదువుకొనుచు వచ్చిరో, వారందరును మీ స్వదేశస్థులై యున్నారు. మీ వలెనే వారును పూర్వము హిందువులై యుండిరి. మీ వాడుకలును ఆచారములును వారి వాడుకలును ఆచారములును ఒక్కటిగానే యుండెను. అయితే ఇటీవలను వారు క్రీస్తు మతమును అవలంబించిరి. మీరును అందుకు ప్రయత్నము చేసితే, ఫుల్మనీని సులభముగా పోలియుండ వచ్చును, ఎందుకంటే, అది నరులకు చేతకానిది ఏదియు చేసియుండలేదు. కాబట్టి ఎవరియొక్క హృదయము దేవుని వైపునకు సంపూర్ణముగా తిప్పబడునో, అటువంటి స్త్రీ, ఫుల్మనీవలెనే, సద్వృత్తి కలిగి యుండవచ్చును గనుక, ఫుల్మని క్రీస్తును వెంబడించినట్టు, మీరును దానిని వెంబడించుడి అని గట్టిగా మీతో చెప్పుచున్నాను. ఆమె బీదలయెడల చూపిన దయా విషయమైయు, ఇతరులయొక్క ఆత్మీయమైన క్షేమమును గూర్చి చేసిన ప్రయత్న విషయమైయు మీరు దానిని నిదానించి, అది ప్రవర్తించినట్టు ప్రవర్తించుడి. అయితే ముఖ్యముగా, ఓ స్త్రీలారా! ఫుల్మనీ తన పెనిమిటియెడల ప్రేమ

యుంచి, అతని ఇల్లు చక్కపరచి యుంచినట్టును, అది నిష్కపట-
ముగా నడుచుకొని, అందరితో దయగా మాటలాడినట్టును, మీ-
రును చేయుడి. ఓ తల్లులారా! ఫుల్లనీ తన పిల్లలకు ఉపదేశించి,
వారి కొరకు విడువక ప్రార్థించి, వారికి సత్ప్రవర్తన అనే మంచి
దృష్టాంతము కనుపరచిన ప్రకారము, మీరును చేయుడి. మరియు
మునలి ప్యారీయొక్క చరిత్రను మరువకుడి. అది బైబిలు చదు-
వడములోను, ప్రార్థించడములోను ఏ చొప్పున విడువకుండెనో,
ఆ చొప్పుననే దానిని అనుసరించి యుండుడి. మధువుయొక్క
భయంకరమైన [illegible] జ్ఞాపకమందు ఉంచుకొనుడి. మీరు జాగ-
రూకు [illegible] ఎందుకంటే, మీరు మరణ కాలము
ఎ [illegible] వచ్చునో ఎరుగ [illegible] కరుణ తన కుమారుని శవముమీద
[illegible] అ చిన్నవానికి మ [illegible] యు చేయకపోతిని గదా అని
[illegible] ఏడ్చిన విధమును జ్ఞాపకమందు ఉంచుకొనుడి. అయితే
[illegible] కరుణ [illegible] పిల్లలకు మంచి బోధ చేయక పోవడమువల్ల,
[illegible] యుండిన పక్షమందు, చివరకు కరుణ బుద్ధి తెచ్చుకొని-
నట్లు, మీరును మీ దుష్ట ప్రవర్తనను వదిలి, శీఘ్రముగా మళ్లుకొని,
క్రీస్తు [illegible] నకు వాస్తవమైన శిష్యురాండ్లు అయి
యుండు [illegible] భారము మోసుకొనియున్న సమస్త-
మైనవారలారా! నా యొద్దకు రండి, నేను మీకు విశ్రాంతిని కలుగ
'చేతును' అని, ఆయన ఆనతిచ్చిన ఆదరణకర వార్తలు తలంచుకొనుడి.

ఈ యాలోచనము చొప్పున మీరు ప్రవర్తించిన, మీ కొరకు
రచించిన ఈ చిన్న గ్రంథము వ్యర్థమైపోదు. మరియు ఈ గ్రంథము
రచించిన్వాడు, దీనిని చదువ బోవువారి నిమిత్తము దేవుని సింహాసన-
వము నొద్ద చేసిన ప్రార్థనలు అన్నియు నెరవేరును.

